# ఆంధ్ర గ్రంథాలయము



## వయోజన విద్యాసంచిక

సంపుటము ౨ జూలై, అక్టోబరు ౧౯౪౧ సంచికలు 3, ౪




సంపాదకులు
గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.
పుణ్యమూర్తుల రాజశేఖరం, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.
పాత్రూరి నాగభూషణం, డిప్. లిబ్.

ప్రచురణకర్త : అడుసుమల్లి శ్రీనివాసరావు
సారస్వతనికేతనం, వేటపాలెము

"ఆంధ్రుల విజ్ఞాననాగరికతలు నేటివికావు. పెక్కు శతాబ్దములనుండి అవిచ్ఛిన్నముగ వర్థిల్లుచు వచ్చుచున్నవి. బ్రిటిష్ఇండియాలోని ఆంధ్రులను, స్వదేశ సంస్థానములందలి ఆంధ్రులను ఏకము చేయగలిగినది భాషానుబంధమే యను మాట మనమెన్నటికిని మరువరాదు. మన గ్రంథాలయోద్యమమును ఇంకను అభివృద్ధిచేయవలసిన సమయ మిదియే యని గ్రహించవలెను. రాష్ట్రమునందలి మూలమూలలను గ్రంథాలయములను నెలకొల్పవలెను. మరల మతవిభేదములు లేక ఎల్లరును వానిని వినియోగించుకొని వానిప్రయోజనమును పొందునట్లు చేయవలెను."

—సర్ విజయ

"ప్రజల యజ్ఞానమును పోగోరుటయే దేశోద్ధరణ సాధనములలో ప్రధానమయినది. గ్రంథాలయము లిందుకెంతేని సాయపడును. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ మీ గ్రంథాలయోద్యమమును 27 యేండ్లు జయప్రదముగ నడపగలుగుట ముదావహము. 1939-40లో కంటె 1940-41 లో సంఘసభ్యుల సంఖ్య కొంచె మించుమించు రెట్టింపగుట ఈ యుద్యమమునకు గలిగిన నూతనోజ్జీవనమునకు చిహ్నము. సంఘము తలపెట్టిన మహాకార్యములన్నియు కొనసాగవలెననిన విద్యావంతులగు ప్రజలయొక్కయు ప్రభుత్వముయొక్కయు తోడ్పాటు హెచ్చు కావలసియున్నది."

—గ్రామోద్ధరణ



ముద్రాపకులు
భారతీ ప్రెస్, తెనాలి

# ఆంధ్రగ్రంథాలయము

## వయోజన విద్యాసంచిక

సంపుటము ౨ | జులై, అక్టోబరు ౧౯౪౧ | సంచికలు ౩, ౪




సంపాదకులు

గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.

పుణ్యమూర్తుల రాజశేఖరం, బి. ఏ., బి. ఇడి., డిప్. లిబ్.

పాతూరి నాగభూషణం, డిప్. లిబ్.

# విషయసూచిక (Contents)

# ఆంధ్ర గ్రంథాలయం

వయోజన విద్యాసంచిక

| సంపుటము ౨ | జులై, అక్టోబరు ౧౯౪౧ | సంచికలు 3, ౪ |
| --- | --- | --- |


## వయోజన విద్యాప్రయోజనములు

### కీర్తన

చదువులు చదువుటకన్న - బహు
శాస్త్రజ్ఞానము కెదిత్రోవన్న ?............చ॥

ఆచదువు మనకురాకున్న - మన
సంసారములను సుఖములు సున్న.....చ॥

చింతలను తొలగించు - సిరిని తన
చెంతకును పిలిపించు - యెన్నో
మంతనముల నెఱిగించు - ధీ
మంతులుగా జనముల నొనరించు ......చ॥

వినయమునకు అదినెలవు - బహు
విద్దియలందున గలవు - వృ
త్తులకును గూర్చును చెలువు - ని
స్తులమని దానిని పిలువు................ చ॥

ఇహసౌఖ్యము కది వెరవు - మోక్షపు
మహలున కదియే తెరవు
అదియుంటే కలుగదు కరువు
లేకుంటే బ్రతుకే బరువు .............. చ॥

—శ్రీ గరిమెళ్ల సత్యనారాయణ, బి. ఏ.

# ఆంధ్రదేశ వయోజన విద్యామహాసభ, తెనాలి

## స్వాగతోపన్యాసము

స్వాగతము, కాగితముతో కబురంపినంతమాత్రముననే దూరమనక భారమనక యిచటికి దయచేసిన తమకెల్లరకును సుస్వాగతము.

వయోజనవిద్యా ప్రచారమునకు కలిగిన బాలారిష్టదోషములనుతొలగించి, ప్రచారమున కనువగు సాధన సామగ్రులను సంతరించి, కార్యకలాపమునకు దగిన ప్రణాళికల నేర్పఱచి దేశోద్ధరణకు ఆయత్తులయి మా పిలుపు విన్నంతనే కష్ట నష్టములకోర్చి యిచ్చటికి దయచేసి మా కతిథిసేవాభాగ్యము నబ్బజేసిన మహా మహుల కెల్లరకు శుభ స్వాగతము.

మా తెనాలి పూర్వము రామకృష్ణాది కవివరులను కడుపారగాంచి ఆంధ్రమున కమూల్యమగు సేవ చేయుటయే గాక నేడును దేశాభివృద్ధికరములగు నవీనోద్య మములలో యథాశక్తిని పాటుపడుచు ఆంధ్రదేశమున పేరెన్నికగన్నది. ఇంతకంటె ఈ ప్రదేశమును గూర్చి నే నిప్పుడు చెప్పదలచుకొనలేదు.

## వయోజనవిద్యావశ్యకత

విద్య మానవునకు ముఖ్యావసర మనుటలో సంకోచించు వాడుండడు. దేశాభివృద్ధి సాధనములలో జ్ఞానము ప్రధానమనుటకును వెనుకాడు వా డుండ బోడు. మానవుడు సాంఘిక జీవి. కాన అతడు సంఘములో తా నెట్లు మెలగ వలయునో తెలిసికొనియుండ వలయును. సంఘ మెట్లుండవలయునో, ఇప్పుడున్న మంచిచెడ్డ లేమియో చర్చించి నిశ్చయించుకొనవలయును.

అతనికి పరిపాలనతో సంబంధమున్నది గావున ప్రభుత్వము నెడల తనకుగల బాధ్యతలను, తనయెడల ప్రభుత్వమునకుగల బాధ్యతలను బాగుగ దెలిసికొన వలయును.

ఇటులనే మానవునికి ఆరోగ్యము, ఆర్థికము, కృషి, పరిశ్రమలు, వర్తకము మొదలగు పెక్కు విషయములు ఎఱుగవలసియున్నది. ఇవి పాఠశాలలలో చిన్నతన ములో కొంతకొంత నేర్చుకొన్నవారు ఈజ్ఞానమును పెంచుకొనవలయును. అటు లనే చిన్నతనమున విద్య నేర్వనివారు తమ కెక్కువ యవసరమున్న విషయములను నేర్చుకొనవలసి యున్నారు. ఇందులకే వయోజనవిద్యా ప్రచార మావశ్యక మైనది.

ఈ ప్రచారము ఆంధ్రదేశమున రాత్రి పాఠశాలల మూలమునను, పురాణములు ఉపన్యాసముల మూలమునను చాలకాలము నుండియు జరుగుచునే యున్నదిగాని యిది ఒక కార్యక్రమము ననుసరించిగాని ఒక ప్రణాళిక ననుసరించిగాని కాక చెల్లాచెదరుగ వెదజల్లినట్లుండుటచే దీని నొక త్రాటికి గ్రుచ్చుటకు నేటి సంస్కర్త లుద్దేశించినారు. కాంగ్రెసు ప్రభుత్వము చేయుచున్నపుడు ఈ విషయమును తలచినది. మన దేశములో కొన్ని ప్రాంతములు ఒక్కొక్క కార్యక్రమము ననుసరించుచున్నవి.

ఈ జ్ఞానప్రచారము సక్రమముగ నుండి పెంపొందించుకొనుట కవకాశములు గలుగవలయునన్నను, తమ పౌరసత్వపు హక్కును (Vote) సంపాదించుకొనవలయునన్నను, నిరక్షరాస్యతను తొలగింపవలయు ననుట నిర్వివాదము. ఇందు కొఱకై ఆంధ్రదేశమున పెక్కు సంస్థలు సంఘములు తలపెట్టినవి.

## ప్రభుత్వవిధానము

మన గవర్నమెంటువారు ఈ కార్యభారమును తాము పూని దేశమును జ్ఞానవంతముగా చేయవలసియుండియు అట్లు చేయకుండుటయేగాక చేయదలపెట్టిన యితర సంఘముల నెత్తిపై పిడుగువైచుట విచారకరము. ఈ ప్రచారమును కమ్యూనిష్టులు చేయుచున్నారనియు, కమ్యూనిజమును బోధించుటకే యీప్రచారము చేయుచున్నారనియు గవర్నమెంటువారు నిశ్చయించుట ప్రమాదము.

కుక్కను కొట్టదలచుకొన్నపుడు పిచ్చిదని చెప్పి కొట్టుమన్నట్లుగా ఈ వయోజన విద్యాప్రచారము నడగగొట్టుటకు కమ్యూనిజముతో ముడివైచినట్లుగా కన్పట్టుచున్నది. కమ్యూనిజము వ్యాపింపకుండ చేయుటకు గవర్నమెంటువారికి చాల ఆయుధములు- శాసనములపేరుతో—ఇదివరకే యున్నవి. ఉన్నవి యుండగా విద్యాప్రచారమునే చితుకగొట్టబూనుట కిప్పుడు పూనుకొనియున్నారు. తమతప్పును సవరించుకొనుటకు ససేమిరా యనుచున్నారు. ప్రజాందోళనమును పెడచెవిని బెట్టుతున్నారు.

మన రాజధాని విద్యాశాఖ డైరెక్టరుగారు ఈ మధ్య గుంటూరులో మాటలాడుచు నిరక్షరాస్యతానివారణ ప్రచారమువలన లాభము లేదనియు, చిన్నతనమున నేర్చుకొన్న ప్రారంభవిద్యవలననే ప్రయోజనమున్నదనియు పలికినారు. మఱి ఈ విద్యాశాఖ నూటికి 89 మందికి ఏల చదువు చెప్పింపలేదో! దేహమునకు కావలసిన పటుత్వము చిన్నతనముననే సంపాదించుకొనవలయునుగాని పెద్దవారయిన పిమ్మట యువకులు సంపాదించుకొనరాదనుచు శాసనముచేయు ఈ ప్రభు

త్వము ఎంత ఆలోచనగలదో మన మూహించుకొనవచ్చును. ప్రభుత్వముయొక్క యిట్టి పెడచూపును మనము ప్రజాందోళనముచే మార్పవలసియున్నాము.

అమెరికాలో బానిసజాతులు స్వతంత్రము పొందినపుడు తమ జీవితకాలములో తమ మత గ్రంథము నొక్కసారి తాము స్వయముగా చదువుకొని ధన్యులు కావలయు నను అభినివేశముతో అరువదియేండ్లవారుకూడ చదువుకొన ప్రారంభించినట్లు మన దేశమునందును యువకులు, జ్ఞానమునకు మొగమువాచియున్న ప్రజలు పెక్కురు ప్రస్తుత దేశపరిస్థితులను, ప్రపంచ పరిస్థితులను పత్రికలలో తాము స్వయముగ చదువుకొనవలయునని ఉవ్విళ్లూరుచున్నారు. వారి యీ యభిలాషమును మనము తీర్పరాదా? అందులకు మూడు సంవత్సరముల శిక్షయు, జరిమానాయునా ప్రభుత్వమువారిచ్చు సత్కారము! ఇది దేశద్రోహమా! దీనికి ఇండియా రక్షణ శాసనమా!

ప్రభుత్వమువారి యీ నిర్ణయమును మార్పించుటయే గాక మన మిప్పుడు మఱియొక కార్యమును నిర్ణయింపవలసియున్నది.

నిరక్షరాస్యతానిర్మూలమును, విద్యాప్రచారమును ఫలవంతముగ జేయుటకు మనము చక్కనిపద్ధతుల నాలోచింపవలసియున్నది. వాని నాచరించుటకు తగిన యుపాయముల వెదకవలసియున్నది. ఈ కార్యములను చక్కగ నిర్వహించుటకు సమర్థులయిన పెద్దలందఱు ఇచ్చట చేరియున్నారు. విజ్ఞానవేత్తలగు మీరందఱు ఈవిషయములను సమగ్రముగ నాలోచించి ఆంధ్రదేశమునకు కర్తవ్యమార్గమును జూపి మీధర్మమును నెఱవేర్చుకొందురని విశ్వసించుచు మీరు ఇచ్చటగలిగిన సాకర్యలోపములకు మమ్ము క్షమియింతురని మీ యుదారాశయమును వేడుచు ఇంతటితో నేను ముగించుచున్నాను.

రావి సత్యనారాయణ, బి. ఏ.,
ఆహ్వానసంఘాధ్యక్షుడు

*

ఆంధ్ర దేశ వయోజన విద్యామహాసభ
తెనాలి



ఆహ్వాన సంఘాధ్యక్షులు



ప్రారంభకులు

# ఆంధ్రదేశ వయోజన విద్యామహాసభ
## తెనాలి



అధ్యక్షులు

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ.

# అధ్యక్షోపన్యాసము

డాక్టరు సుబ్బరాయన్‌గారు, ఆహ్వానసంఘాధ్యక్షా !

సోదరీమణులారా, సోదరులారా !

ఈనాటి మహాసభకు మీరు నన్ను అధ్యక్షత వహింపవలసినదని కోరి గౌరవించినందుల కెంతయు కృతజ్ఞుడను,

## విద్యయే శక్తి

మన దేశములో మహాయోగులు విద్యను సర్వసాధనముగా నుపయోగించినారు. విద్యవలన మృత్యువును తరించినారు. ఇహలోక పరలోకములకు రెంటికి విద్య తారకముగా నిర్వచించినారు. జ్ఞానమంటే మనవారిది పట్టి పరలోకజ్ఞానమే యనుకొనువారు చాల పొరబడుచున్నారు. నాల్గువిధములయిన జ్ఞానములు మనపెద్దలు నిర్వచించినారు.

(1) సంజ్ఞానము—చక్కనైనట్టి ఎరుక

(2) ఆజ్ఞానము—శాసనవిధానశక్తి

(3) విజ్ఞానము—శాస్త్రవిషయగ్రహణము

(4) ప్రజ్ఞానము—సర్వము నెరుగుట

ఇందులో గర్భితమయిన అర్థము అందరికి నా వివరణలేకయే తెలియగలదు. శాసనవిధానశక్తి, శాస్త్రవిషయగ్రహణమును, సంజ్ఞానమును, సాంఘికార్థికముల ప్రజ్ఞానము జ్ఞానసంపూర్ణత్వము. గీతలను శ్రీకృష్ణుని ముఖమునుండి విన్న యర్జునుడు నాట్యవిద్యలో, శస్త్రవిద్యలోవలె ప్రవీణుడు. లీలావతి గణితశాస్త్రమున ప్రవీణ. కృష్ణదేవరాయలు సంగీత, సాహిత్య, క్షత్రియ, రాజకీయ ఇట్టివిద్యలయందెన్నిటియందో ప్రవీణుడు. భారతపురుషులలో నొక్కొక్కడొక్కొక్క శాస్త్రము కూలంకషముగా నెరిగినవాడు. ధర్మజుడు ధర్మశాస్త్రవేత్త. భీముడు పాకశాస్త్ర, మల్లశాస్త్రముల ప్రవీణుడు. అర్జునిని మాటచెప్పితిని. నకులసహదేవులు గో అశ్వశాస్త్రముల పేరెన్నికగన్నవారు. ద్రౌపది భారతశక్తికి పూర్ణరూపమని చెప్పదగినది. పువ్వులుగ్రుచ్చుటలో పూర్ణప్రజ్ఞగలది.

మన పూర్వులు చతుష్షష్టికళలని పేరుపెట్టి 64 విద్యల నభివృద్ధిచేసిరి. కాని అందరును ముక్కు మూసుకొని కూర్చొని ఇతరులకీ లోకమును వదలి వైకుంఠమునకు బొమ్మనలేదు. అందే జీవితశక్తి కలుగవలెనన్నా, ముక్తి ప్రాపించవలెనన్నా విద్య, జ్ఞానము ప్రథమాధారములనిరి.

ఐతరేయోపనిషత్తునందలి ఉత్తరశాంతి పాఠమున బ్రహ్మచారి ఏమనుచున్నాడో చూడుడు.

అధ్యయనమునందు దృఢబుద్ధి యలరుగాక !<br>
అధ్యయనము నన్విడువనిదగును గాక !

పఠన మొనరింపబడు వేదభాగములను<br>
రేయిబవళులు నేను దర్శింతుగాక !

తన్ను అధ్యయనము విడువరాదట ! రేయిబవళులు వేదభాగములను తాను దర్శించుచుండవలెనట!

నా మతమున పూర్వము మనదేశమున దాస్యములోకి త్రోయబడిన ఏ కొందరో తప్ప నాటి రాజకీయసంఘ మంతయు బ్రహ్మ క్షత్రియ వైశ్యులే. వీరి యందరకును బ్రహ్మచర్యాధికారము, అధ్యయనాధికారము కలదు. అందుచేత వీరెల్లరును తమ్ము విడువని అధ్యయనము నారాధించిరి. ఆనాడు వరయోజనవిద్యయని, ఇందులో అక్షరజ్ఞత ప్రధానమా ? విజ్ఞాన వికాసములు ప్రధానములా?

అనునట్టి ప్రశంసలే రాకుండెను. జ్ఞానమన్నది శక్తి. శక్తి సాధింపదగినది. అది యారాధింపదగినది. వాయువును పీల్చినట్లు, ఆహారమును భుజించినట్లు విద్యను సంపాదించిరి. రాజ్యము లేలుకొనిరి. లోకమునకు జ్ఞానభిక్ష పెట్టిరి.

## పాశ్చాత్యదేశములు — విద్యాప్రచారము

నేడు పాశ్చాత్య సీమలలోనూ మోక్షసంపాదనకు కావలసిన శక్తిమాట యెట్లున్నా జీవయాత్ర గడుపుటకు కావలసిన శక్తి సంపాదించుటకయి జ్ఞానమును సంపాదించుచున్నారు. ఉపాసించుచున్నారు! 'నాలెడ్జ్ ఈజ్ పవర్' అన్నారు. అనగా జ్ఞానమే దాని శక్తియగుట వారి మతము కూడాను. అట్టి జ్ఞానము, పూర్వము మనలోవలెనే అందరు ఆరాధింపవలసినదని, సాధింపవలసినదని వారు పూనుకొని మనవారు బ్రహ్మచర్య కాలముగా ఎంచిన విద్యాభ్యాస కాలమును విద్యార్థిదశలోని విద్యగా నెంచుచు జీవితాంతము వరకును అనేక రూపముల నందరును సాధింపదగిన తక్కుంగల విద్యను వయోజనవిద్య యన్నారు.

విద్యను సాధించుటకు పూర్వము మన దేశములో శ్రవణముఅంటే వినికిడి ఎక్కువగా నుపయోగించినా అక్షరములు లేవనిగాని గ్రంథములు లేవనిగాని యనుకొనరాదు. అశోకునినాటి శిలాశాసనాదులు మన తక్షశిలాది ప్రాచీనవిద్యాలయములు మన యక్షరజ్ఞానపు ప్రాచీనత్వమును స్పష్టముగా సూచించును. అచ్చుకూర్పుట ఏర్పడి లక్షలకొలది ప్రతులు విజ్ఞానసంపుటములగు గ్రంథాలకు తయారు కావడము విద్యసంపాదించుటకు కావలసిన సాధనము అక్షరజ్ఞత యయిపోయినది. చారిత్రకపరిణామము పరపరిపాలనచే తెగిపోకయున్న రాష్ట్రాలలో ఈ క్రొత్తమార్పు మామూలు జీవితప్రవాహములోనే కలిగి ప్రత్యేకము అక్షరజ్ఞత ప్రయత్నాలు చేసుకొనవలసినపని ఆధునికరాష్ట్రాలకు కలుగలేదు. ఇంగ్లండు, అమెరికా సంయుక్త రాష్ట్రాలు ప్రముఖముగా ఈ పరిణామానికి ఉదాహరణములు. అక్షరజ్ఞత ప్రచారము వేరేగా చేయకుండానే ఇంగ్లండులో నూటికి 99.66 ను, అమెరికాలో 96.1 ను అక్షరజ్ఞులయినారు. అదే కొద్దిగా వెనుకబడి కొంతకాలము చీకటిలోనుండిపోయిన జపాను రుష్యాలలో ప్రజారాజ్యము లేర్పడుటతో జ్ఞానము లేక శక్తి నిలువదని గ్రహించి ఆయాదేశములు ప్రయత్నము చేసి నూటికి నూర్గురను, నూటికి 90.2 రను అక్షరజ్ఞులను చేసికొన్నవి. తుర్కీలో కెమల్‌పాషా ప్రాతలిపినికూడా మార్చి వృద్ధులనుగూడ బళ్ళకు లాగితెచ్చి అక్షరజ్ఞులను విద్యావంతులను చేయ నుపక్రమించినాడు. అక్షరజ్ఞమయి శక్తి సంపాదించిన జపాను బ్రిటనుతో తులతూగుచుండ స్వాతంత్ర్యము 1911 లోనే సంపాదించియు చీనా పూర్ణవికాసము పొందలేక ఎంత ప్రజ, ఎంత సంపద యున్నను జపానుకు భోగ్యమయి, కొంత రుష్యా శిక్షణ యుండడముచేత నైదేండ్లుగా జపానుతో హాహాకారీగ పోరవలసివచ్చినది.

ఈ ఉదాహరణము లన్నీ కంటియెదుట నుండడముచేతను, నేటిదినము కమ్మరము, వడ్రంగము, వ్యవసాయము వ్యాపారము వగైరా ఏపని చేసినా విజ్ఞానము లేకుండా చేయటము ప్రయోజనకారి కాక తిండికే అల్లాడవలసి రావడముచేతను, ప్రపంచానికి ప్రజాపరిపాలన ఏకరాజకీయ మోక్షముగా ఏర్పడి ప్రతివ్యక్తీ వోటు చేయడానికి కొంత విజ్ఞానముండితీరవలసి రావడముచేతను విజ్ఞానమే సాధింపదగిన ఫలమయినా, దానికి ఇతర సాధనాలు ఎన్నో ఉన్నా, పత్రికలు పుస్తకాలు చదవడము ప్రధానసాధనము కావడముచేతను ప్రపంచమును సంస్కరింపనెంచే విజ్ఞులందరును అక్షరజ్ఞతను, అది లేనిప్రాంతములో ప్రచారము చేయడము దీక్షగా పెట్టుకొనవలసివచ్చినది.

ప్రపంచమంతటను జరిగే యత్నము మన దేశములోను జరుగుట సహజముగానే సంభవింపవలసినది. కాని మన చారిత్రక పరిస్థితులు బహు చిత్రమయినవి. సాధారణముగా పరుల పరిపాలన చేతనే యీ చిత్ర పరిస్థితియంతయు సమకూడినదనుకొనడము మన యలవాటు. ఆ విధముగా మన మనుకొనుచు

పోదుమేని ప్రభుత్వము మారువరకు ప్రయత్నము సాధ్యము కాదు. అని మన మిట్టి సమస్యలన్నిటి విషయమునను నిద్దురబోతులగుట జరుగుచున్నది.

## మన లోపము

పారతంత్ర్యముచేత మనకు శృంఖలాలేర్పడియుండడము నిజమే యయినా మనకు మనమే యేర్పరచుకొనే శృంఖలాలుగూడ చాల కలవు. మనదేశములో ప్రాకృతములు విశృంఖలముగా విహారము చేసినన్ని దినములు మనదేశము విజ్ఞానవంతముగా నున్నది. కాని సామాన్య మానవులు వ్యవహారములో నుపయోగించు భాష బూతుక్రింద లెక్కపడి తెనుగుభాష బోటి భాషలు నన్నయాదులనాటి నుండికూడ సంస్కృత సూత్రాల కనుగుణంగా నడచవలసిరావడంతో విద్యాప్రచారము సంక్షేపమయి పోయింది. అక్షరజ్ఞులుగా ఉన్నవారికి ఉత్తమ విజ్ఞానమందుబాటులో లేకపోయింది. వారి కవసరమైన మార్గాలలో వాఙ్మయము నడవకపోయినది. రాజులకు, ప్రభువులకు, పండితులకు తృప్తి గొలిపే వ్రాతలే బయల్పడినవి. బ్రిటిషుప్రభుత్వ మేర్పడిన తరువాత ఇంగ్లీషువారికి భారతదేశభాషల సారస్యము కాక భారత వ్యాపారమే ముఖ్యమైనందున ఈ పండితభాషయు శుష్కించినది.

నేటికి 30 ఏండ్లక్రిందటి మన తెలుగుభాష విషయమాలోచింపుడు. దీనిని చదివేవారు సాధారణముగా బళ్లలో చదివే ఏనాటి కారురో! ఇది ఇంగ్లీషుయుగంలో బళ్ల తెలుగు. దానివర్ణన నే చేయనక్కరలేదు. తెలుగుతరగతికే పోవలసినది లేదని, పోయినా పంతులవారుచెప్పేది యేమీ లేదనీ ఏదైన కొద్దిగావున్నా అదిరాకపోయినా పరీక్షలలో నష్టంలేదని అనుకొనేరోజులవి. స్కూళ్ళబయట చూతామా తూచాలు తప్పుపట్టుకొనే పండితవాఙ్మయము.

## ఇటీవలి ప్రయత్నాలు

ఇరువదవ శతాబ్ద మారంభమయి 'కర్జను'దయచేత వందేమాతరం ఉద్యమము ప్రబలినతరువాత మన వాఙ్మయము సృష్టించుటలో ప్రత్యేకము ప్రజాసమూహముయొక్క అవసరాలమీదికి దృష్టిసారించడము జరిగినది. విజ్ఞానచంద్రిక, ఆంధ్రభాషాభివర్ధనీ, విజ్ఞానసర్వస్వము, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక యిత్యాది ప్రయత్నములు పుట్టి పెరిగినవి. వందేమాతరం ఉద్యమంమీద గట్టిదెబ్బ వేయడంతో మన ఆంధ్రదేశముమట్టుకు మన ఆంధ్రదేశములో విజ్ఞానప్రచారోద్యమము బలపడింది. అందులోని అంశలే గ్రంధాలయోద్యమము, ఆంధ్రరాష్ట్రోద్యమము. ఇంతజరిగినా భాషాశృంఖలాలు పూర్తిగా త్రెగడానికి మహాజనానికి తగినభాష, వాఙ్మయముపొందడానికి 1914-18 సంగ్రామము, రుష్యావిప్లవము, మనదేశములో హోమురూలు ఆందోళన, గాంధీయవతరణము ఇన్నియు దూరకారణములు కావలసివచ్చినవి.

మన గ్రంథాలయోద్యమము అక్షరజ్ఞతను కడచిన 8-10 ఏండ్లుగా నొక్కుతున్నా గాంధీజీబోటివాడుకూడ దీనిని నిర్మాణకార్యక్రమములో చేర్చడాని కిష్టపడె ఇప్పుడే యుపక్రమించినాడు. దేశమంతటను దీని యౌజ్జ్వల్యము ప్రబలినది. కాంగ్రెసువారు ప్రాంతాలలో రాజ్యాధికారము నందుండిన దినములలో మద్రాసుకోస్తాలో ఎక్కువ ప్రయత్నము జరుగలేదు గాని సంయుక్తపరగణాలలో (యు. పి. యందు) మంత్రి సంపూర్ణానందు 1939 జనవరి 15వ తేదీని అక్షరజ్ఞత ఉత్సవదినంగా ఏర్పరచి అత్యుత్సాహప్రయత్నము చేసినాడు. బిహారులో మంత్రి సయ్యదుమహమ్మదు అక్షరజ్ఞతకు 3 మాసములు తరువాత విజ్ఞానారంభమునకు 3 మాసములు నియోగించి అనేక కేంద్రాలలో పనిని ప్రారంభించినారు. పుస్తకాలు, పత్రికలు ఈ కేంద్రాలకు సరఫరాచేయ నేర్పరచినారు. అధికారానధికారులందరను ఈకార్యానికి వినియోగించుకొనినారు. ఆసాములోను ఉత్సాహముతోడనే యుపక్రమించినారు. బొంబాయిలో డాక్టరు ఖేరు వయోజనవిద్యకు ప్రత్యేకమొక బోర్డునే నియమించి బొంబాయినగరమును రెండేండ్లలో 100 కి 100 గురు అక్షరజ్ఞులు కలదిగా చేయవలెనని ప్రయ

త్నించినారు. కాంగ్రెసుప్రభుత్వాలు కాని సింధు పంజాబులలోనూ విద్యామంత్రు లీవిషయమయి పరిశ్రమ చేసినారు.

కాని మన మద్రాసు కోస్తాలోనో కాంగ్రెసు మంత్రులు రాజ్యమేలుచున్నపుడుకూడ వయోజనవిద్య విషయమయి ఎక్కువ జోక్యము ప్రభుత్వమువారు పుచ్చుకొనలేదు. శ్రీ రాజగోపాలాచారిగారు తాను మంత్రి కాకపోతే వయోజనవిద్యాబోధకు సేవకుడుగా నవుదునని వాగ్విజృంభణము చేసి 'తంబీ వా' అనే పుస్తకాన్నొకదానిని మరిదాని తరువాత దాని చెల్లెండ్రను అరవదేశముమీదికి విసరిరి. దక్షిణఇండియా వయోజనవిద్యా సమావేశములు ఇప్పటికి మొదటిది మద్రాసులో, రెండవది మధురలో, మూడవది కోయంబత్తూరులో జరిగి కొంత యాందోళన సాగినది. నాలవది మన యీ గుంటూరుజిల్లాలోనే త్వరలో సమావేశము కావలసియున్నది. దక్షిణపు చివరన తూత్తుక్కుడిలో ఛేర్మెన్ రోచ్ విక్టోరియా క్రింద మునిసిపాలిటీ ఆరుకేంద్రములలో వయోజన విద్యాబోధ జరుగుచున్నది. మధురజిల్లాలో మిసస్ వైలరన్ మిషనరీ సతి రోమను అక్షరాలను ప్రాతిపదిక చేసి వయోజనాక్షరాస్యత సాధించు ప్రయత్నాలు చేయుచున్నది. మద్రాసునగరములో అటనట కొందరు ఈ పరిశ్రమ చేయుచున్నారు. కార్పొరేషను వారితో శ్రీ వెంకటస్వామినాయుడుగారు మేయరుగా నున్నప్పు డాలోచించిన యాలోచన ఫలంగా మన ఫుల్లారెడ్డిగారి కమీషనరు గిరిలో నాలు వయోజన కేంద్రాలలో చక్కని పని సాగుచున్నది. వయోజనుల కిచట తేనీరుగూడ సరఫరా చేయుచున్నారు. 1941—42 సంవత్సరపు బడ్జెటులో అక్షరజ్ఞత కేంద్రాలకు రు 10,000 మంజూరు చేసుకొన్నారు. మద్రాసు నగరము వివిధభాగములలో 23 గ్రంథాలయ పఠనాలయాలు మునిసిపల్ కార్పొరేషనువారి యాదరణమున జరుగుచున్నవి. 45 ఇతర పఠనాలయములకు వీరు సహాయపడుచున్నారు. ఏవం విధ కృషికి శ్రీ ఫుల్లారెడ్డిగారికి మనము ధన్యవాదములు చెప్పవలసి యున్నది. మైసూరు విశ్వవిద్యాలయకృషి ప్రశంసింపదగినది.

## ఆంధ్రదేశమున వయోజనవిద్యా ప్రచారము

తెలుగు దేశమున జరిగిన పనియు తక్కువ యయినది గాదు. మా గ్రంథాలయ సంఘమువారే కడచిన మే మాసమునందు గ్రంథభాండారులకు శిక్షణ నిచ్చుటలో అక్షరజ్ఞత ప్రచారమునకు గావలసిన శిక్షణనంతయు అచటి శిక్షణాక్రమములో చేర్చిరి. ఈ గ్రంథాలయ సంఘమువారే నేను రచించిన 'వయోజనవిద్య - మొదటి పుస్తకము'ను ప్రకటించిరి. కొన్ని ఏండ్ల క్రిందటనే ఆంధ్రరాష్ట్ర వయోజన విద్యాసంఘ మేర్పడెను. కీ. శే. శ్రీ శనివారపు సుబ్బారావుగారు దాని విషయమయి యెక్కువ కృషిచేసిరి.

గుంటూరుజిల్లాలో జిల్లావిద్యార్థిసంఘమువారు గత వేసవిలో కొల్లూరులో వయోజనవిద్యా ప్రచారకుల నిమిత్తము శిక్షణాలయము నొకదానిని నడపిరి. ఇందు తయారైన విద్యార్థులు జిల్లాలో చాల తావుల పెద్దల బడుల సాగించిరి. రేపల్లె, తెనాలితాలూకా గ్రంథాలయసంఘముల వారును కొన్ని చోట్ల వయోజనవిద్యా వ్యాప్తికై రాత్రి పాఠశాలల నిర్వహించిరి.

కృష్ణాజిల్లాలో శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, కాట్రగడ్డ రాజగోపాలరావుగారు వగైరాల కృషిచే గ్రామములు అక్షరజ్ఞతకయి యుత్సాహముతో పనిచేయుచున్నవి. శ్రీ రామచంద్రరావుగారు వ్రాసిన వయోజనవిద్య వాచకములు అచ్చయి విరివిగా ప్రచారమునందున్నవి. మరి ఇతర ప్రాంతాలలో వలె తెలుగు దేశములోను మిషనరీలు అక్షరజ్ఞత వ్యాపింపజేసే ప్రయత్నాలు బాగా చేయుచున్నారు. ఇదివరలో ఉన్న అక్షర జ్ఞానపు పుస్తకములు రమారమి వారివే. సుందరంగారు, దేవరాజు, హైదరాబాదు రీడరులు గ్రంథ ప్రచురణమున పేర్కొనదగిన ప్రయత్నములు. ఇతరు లనేకు లిట్టి ప్రయత్నము లాంధ్రదేశమున చేయుచున్నారు. వారి నందరను పేర్కొనపోవుటకులేక నా యజ్ఞాన లోపముగాని వారి ప్రసిద్ధి లోపము గాదు.

ఆంధ్రదేశమున జరుగనిండు, మరి యెచ్చట జరుగనిండు, అన్ని దేశోపకార కార్యములందు వలెనే ఇందులోనూ యువకవర్గమే యెక్కువ యుత్సాహముతోను పట్టుదలతోను పనిచేయునట్టివారు. యువకుల యుత్సాహ మొకొకప్పుడు పొంగి యుద్రేకముగా పరిణమించుట సహజమే. ఈ గుణమే యువక హృదయములకు లేకపోయినట్లయిన ఆంగ్లభూమి సంరక్షణకు, రుష్యా సంరక్షణకు నేటిదినము సిద్ధపడి ప్రాణమర్పించుచుండు లక్షలకొలది సైన్యముల కూర్చుటయే సాధ్యపడియుండదు. అందుచేత యువకుల యుత్సాహములను తీవ్రముగా నణచివేయు ప్రయత్నము అధికారులుగాని, నాయకులుగాని చేయదగినది కాదు. దానిని క్రమపరచి ఉచితరీతిని అది యుపయోగపడునట్లు తీర్చుట నీతి.

## ప్రభుత్వనిరోధము

ఇటీవలి మద్రాసుప్రభుత్వమువారి నిరోధము ఈ దృష్టిపథమునుండి మిక్కిలి యాక్షేపణీయముగా దోచును. ఈ రాష్ట్రమునందు యువకులు చేయునట్టి వయోజన విద్యాప్రయత్నమునందు, ఇప్పటి మద్రాసు ప్రభుత్వమువారికి కమ్యూనిష్టుపార్టీవారి సర్వాంతర్యామిత్వము తప్పితే మరి యేదియు గోచరించలేదు. అందుచేత వారు కడచిన జూన్ నెల 11 వ తేదీని జీ. ఓ. నంబరు 1229 (ఎస్-84) పబ్లిక్ (జనరల్) జారీచేసిరి. దానికిగాను శ్రీ గవర్నరుగారు డిఫెన్సు ఆఫ్ ఇండియాశాసనముక్రింద సంక్రమించిన అతినిరంకుశ అధికారమును వినియోగింపవలసివచ్చినది. అందులో చేసిన ఉత్తరువును అంత నిరంకుశముగాను ఉన్నది. మద్రాసునగరములో పోలీసుకమీషనరుగారి అనుమతిలేకను, జిల్లాలో జిల్లామేజస్ట్రీటు ఉత్తరువులేకను వయోజన విద్యాశిక్షణ తరగతులుగాని, వయోజనవిద్యా తరగతులుగాని జరుపరాదు. ఇందుకొక మినహాయింపు కల్పించినారు. గవర్నమెంటువారి విద్యాశాఖ వారిచేతగాని వారు కారణంగాగాని ఏర్పడే శిక్షణలకుగాని తరగతులకుగాని ఈయుత్తరు వన్వయించదు. ఈ యుత్తర్వుమీద వ్యాఖ్యగా గవర్నమెంటువారు జూన్ 14 వ తేదీ నొకప్రకటన గావించిరి. అందులోనే నిదివరలో సూచించిన కారణమును సూచించిరి. ఈ యుత్తరువు నుల్లంఘించి నడుచుకొనేవారు మూడుసంవత్సరముల పరిమితివరకు శిక్షకును జరిమానాకును పాత్రులుగావలసియుందురని తెలియజేసిరి. గవర్నమెంటువారి విద్యాశాఖవారు అధికారక్రమమున (అఫిషియల్) నడిపే రిఫ్రెషరు కోర్సులు వగైరాలకీయుత్తరు వన్వయించదనిరి.

నిర్బంధము నెరపుటలో ఈ వివరణ అసలు ఉత్తరువు కంటె తీక్ష్ణతరమయినదనుటకు సందేహము లేదు. మునిసిపాలిటీలు, లోకలుబోర్డులు, కో-ఆపరేటివు సంస్థలు వగైరాలు ఏ విద్యాధికారితోనో సంప్రదించి పనిచేసుకొంటే బాధ తప్పునేమో యని అసలు ఉత్తరువు చదివినవారు భ్రమపడుదురని యేమో ఈ వివరణ సర్కారువారు ప్రచురించిరి. ఆ విషయము వారి ముఖతానే వినవలసి యుండును.

ఇక ఉత్తరువు సారమాలోచింతము. విద్యార్థులందరును కమ్యూనిష్టుపార్టీ ఉత్తరువులను నడుపువారేనా ? అట్లైన 150 ఏండ్లుగా బ్రిటిషు ప్రభుత్వములో నేర్చిన చదువు లన్నియును దుష్ఫలములను ప్రసాదించినవని యంగీకరింపవలసినదేనా ?

విద్యలు నేర్పే గురువులకు పరీక్షలు జరిపి పట్టములిచ్చు విశ్వవిద్యాలయాధికారులు వీరిపరిపాలన సౌభాగ్యము సన్నగిలిపోయినందుననా గవర్నమెంటువారు జిల్లామేజస్ట్రీటుకు పోలీసుకమీషనరుకూ ఈవిషయమున విద్యార్థులను, వారితోగూడ కమ్యూనిష్టుపార్టీతో సంబంధంలేని సాదా వయోజన విద్యాప్రచారకులను వశము చేయవలసివచ్చినది. మద్రాసుప్రభుత్వమువారు మనసున లేనిపోని కలవరమీ విషయమున పొందినారని నా యభిప్రాయము. ఇట్టి కలవరము పొందడము చాల పొరపాటు. మహాజనమున వివిధపార్టీలకు చెందిన ప్రజలున్నట్లే విద్యార్థులలోను ఉన్నారు.

అదిగాక వయోజనవిద్య ఒకపార్టీవా రెక్కువకోరుట మరియొకపార్టీవారు తక్కువకోరుట యను మాటేలేదు. కమ్యూనిష్టుపార్టీవారి కెంత దీనియందభిలాషో, అంతా కాంగ్రెసువారికి జస్టిసుపార్టీ

వారికి, హిందూపార్టీవారికి, ముస్లింపార్టీవారికి, తుదకు వ్యవసాయశాఖ డైరెక్టరుకు, కో-ఆపరేటివు రిజిస్ట్రారుకు, ఆరోగ్యశాఖాధికారులకు దీనియం దభిలాష. అనుదినము నాబోటివారు ఘంటాపథముగా చెప్పురీతిగా వయోజనవిద్య పార్టీవిద్యగాదు. దీనికి పార్టీకి ముడిపెట్టరాదు. అన్ని సాధనాలనూ దుర్వినియోగం చేసేవారున్నట్లే, తుదకు టీపార్టీలను దుర్వినియోగము చేసేవారున్నట్లే దీనిని దుర్వినియోగం చేసేవారుందురు. అట్లు దుర్వినియోగము చేసేవారిని శిక్షించవచ్చును. దండించవచ్చును గాని టీ అంగళ్ళన్నీ టీపార్టీలన్నీ మా ఉత్తరువులేకుండా పెట్టరాదని గవర్నమెంటువా రనవచ్చునా? ఇదీ అంతే.

ఈ యుత్తరువుమీద వ్యతిరేకాభిప్రాయ మన్నివిధాల రాజకీయాభిప్రాయాలవారూ వ్యక్తపరచినారు. గవర్నమెంటువారు ఇంతవరకు దీనిని ఉపసంహరించకపోవడము నాకు ఆశ్చర్యంగానే వుంది. ఇకనైనా ఆలస్యము చేయకుండా ఈ ఉత్తర్వును రద్దుచేయుదురుగాక యని నామనవి. న్యాయంగా పనిచేసే వారయితే పోలీసుకమీషనరు కేల వ్రాసుకోరాదు? జిల్లామేజస్ట్రీటుల కేల వ్రాసుకోరాదు? అనే ప్రశ్నలు అసందర్భమయిన ప్రశ్నలు. ఆవిధమయిన నిరోధము సాధారణముగా చేయదగినది గాదు. భరింపదగినదీ గాదు అనడము ఈ ఉత్తరువును గవర్నరుగారు తమ ప్రత్యేకాధికారాలు వినియోగించి చేయడముచేతనే స్పష్టమవుతుంది. వారి నడిగినా ఇది విధిలేక చేసినపని యందురుగాక! తమ కధికార ముండవలెనని అపేక్షచే చేసినపనియని యెన్నడునరు. కాబట్టి యిట్టి యుత్తరువు లెంత త్వరగా ఉపసంహారము చేసుకొంటే అంత ప్రతిష్ఠ ప్రభుత్వాలకు కలుగుతుంది. ఆపనిని మద్రాసు ప్రభుత్వమువారు త్వరలో చేయుదురుగాక యని యెదురు చూచుచున్నాను.

వయోజనవిద్యకు అక్షరజ్ఞత ప్రథమాధారమే యయినా అదే వయోజనవిద్య కాదనడము ఇదివరలోనే స్పష్టపరచినాను. స్కూళ్ళు విశ్వవిద్యాలయాలకు మించిన వయసున జాతిలోని ప్రతి పురుషుడును, స్త్రీ యును పూర్ణజీవితమును గడుపుట కెరుంగవలసిన సర్వ విజ్ఞానమును వారి కందజేయడము వయోజనవిద్య కార్యక్రమము.

ఇతర దేశాలలో వయోజన విద్యాప్రచారము ఎట్లు జరిగేది మొదలగు సంగతులు మిత్రులనేకులు తమ యుపన్యాసములలో చెప్పగలరు. మన దేశమునందు ప్రయోజనకారులు అగుచుండు నట్టియు, కాగలయట్టియు విధానమును సూచించి నేటి నవ్యపరిస్థితులలో నుపయోగింపనగు నొకటి రెండు సాధనాలను వివరించి నా యుపన్యాసము ముగింప దలచినాను.

## వయోజన విద్యాప్రచార సాధనాలు

మన కుటుంబముల దినసరి కార్యక్రమములోనే వయోజన విద్యాప్రచారమున కవకాశములున్నవి. పాటలు, పండుగలు, పేరంటములు, కొలువులు, వివాహాది శుభముహూర్తములు అన్నిటిని మనతో జేరు నలుగురకు యెక్కువ విషయగ్రహణము కలుగు నవకాశాలుగా తీర్చవచ్చును. స్కూళ్లు, కాలేజీలు, విశ్వవిద్యాలయములలో వారి విద్యాప్రణాళికకు మించి జరుగు సంఘోద్దీపక వ్యవహారముల మాట నేను చెప్పనే యక్కరలేదు. భజనలు, బొబ్బిలికథలు, వీధినాటకములు, హరికథలు, యాత్రలు వయోజన విద్యాప్రచారకులకు మంచి యవకాశములు. యాత్రల కిపుడు క్రొత్త తేజస్సు కలిగినది. ఆంధ్రదేశములో గ్రంథాలయసంఘమువారు గ్రంథాలయ యాత్రలు చేయుచున్నారు. ఆ యాత్రలలో బొమ్మల లాంతరు సహాయమున నైతేనేమి, ఇతరత్రా నైతేనేమి విజ్ఞాన విషయములనేకములు బోధించుచున్నారు. ఈ సందర్భములోనే గ్రంథాలయ పఠనాలయముల మాట కొంత చెప్పుకొననిండు.

నేటి దినము దేశభాషలలో పఠనాలయములను విరివిగా ప్రోత్సహించుట అత్యావసరము. నూతన యుగ విజ్ఞాన ప్రబోధకములగు గ్రంథములు నేడు వెలువడుట మన భాషలలో తక్కువ. కారణా

లన్నిటిని నే నిచట ఏకరువు పెట్టనక్కరలేదు. మీరంద రెరిగినవే. పత్రికలు దినదినము, వారవారము లోక విజ్ఞానాన్నంతా వెదజల్లక విధిలేదు. కాబట్టి అందులోనుండి వివిధ విషయములను సంబంధించిన వ్రాత లప్పటికప్పుడు కత్తిరించి వేరేవేరే ఫైళ్ళుగా అతికించి పెట్టితే చదువరులకు మంచి విజ్ఞానము పంచిపెట్టడానికి వీలున్నది.

పఠనాలయాల యావశ్యకత ఇంతఉందంటే గ్రంథాలయాల యావశ్యకత లేదనికాదు. మంచి గ్రంథాలు చేర్చిపెట్టడము చాలకాలముగా అనుభవములో నున్న పని. ఉండగలదు.

ఇప్పటి మద్రాసుప్రభుత్వమువారు గ్రంథాలయముల గ్రాంటులు పునరుజ్జీవింపజేసినందులకు మనము కృతజ్ఞత చూపదగును. కాని యాగ్రాంటులు జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయితీల వశము చేయడము మాత్రము స్వతంత్రగ్రంథాలయములకు నిరుత్సాహజనకము. తెలుగుదేశములో స్వతంత్ర గ్రంథాలయాలు చక్కగా పనిచేసేవి చాలకలవు. జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, పంచాయతులు తమతమ ప్రాంతాల స్వతంత్రగ్రంథాలయాలకు తమకువచ్చు గ్రాంటులనుండి విరాళాలు ఇయ్యగలవని, ఇయ్యవచ్చునని ఇదివరలో ఉండేది. ఇప్పుడు వీరునడిపే గ్రంథాలయముల కిత్తురట! దీనిని గవర్నమెంటువారు దిద్ది తగినయుత్తరువుల పాలింతురుగాక యని కోరుతున్నాను. *

మరియొకమాట. పత్రికలకు చందాలు పంపుకొనుటకుకూడ పంచాయతులకు హక్కులేక పోవడము విషాదకరము. లోకల్ బోర్డు ఇనస్పెక్టరువారి ముందు ఉత్తరువు ఉండవలెననుట నేటినిబంధన. దీనిని రద్దు చేయవలెనని చాల దీర్ఘముగా అందోళన జరిగియు ఫలము కలుగలేదు. ఈ నిర్బంధమును ప్రభుత్వమువారు తొలగింతురు గాక యని నాకోరిక.

పైన చెప్పిన సాధనాలే కాక వయోజన విద్యకు బొమ్మలప్రదర్శనాలు, వస్తు ప్రదర్శనాలు, శిల్పాలు, ఉపన్యాసాలు, సినీమాలు ఇట్టి వెన్నియో కలవు. నేడు అన్నిటికంటె ఎక్కువ విస్తారంగా వస్తుండేది రేడియో.

రేడియోకు సంబంధించిన అన్ని వివరాలను నేనిక్కడ విమర్శింపదలచుకొనలేదు. ఇటీవల పడమటి దేశాలలో ప్రచారములోనికి వచ్చిన 'గ్రూప్‌లిసనింగు' అను విధానము చాల ఉపయోగకరమని నా యభిప్రాయము. దానికి తగిన సుశిక్షిత సేవకబృందమును మనము సిద్ధము చేసికొని ఈ దేశమునందును మన మా విధానము ననుసరించడము లాభప్రదమని నా మనవి.

'గ్రూప్' అనగా ఒకముఠా. రేడియోలో చెప్పే విషయాలు విని అవగాహన చేసుకొనే ఉద్దేశ్యముతో కొందరు కొందరటునటు ముఠాలుగా యేర్పడుదురు. లంకాషైరులో నలుగురు వ్యవసాయదారులు, ఒక బేల్‌దారు, ముగ్గురు కూలీలు, ఇద్దరు బడి ఉపాధ్యాయినులు, ఇద్దరు లత్కుమ్రులు, ఒక పీనుగల మోతరి, ఒక మతాచార్యుడు ఒక ముఠాగా చేరిరి. గం 8-30 లకు రేడియోలోవినుట కేర్పడియుండ గం. 8-15 లకు. వీరు సమావేశమైరి. ఈ ముఠానాయకుడు రేడియోలో రాబోయే విషయమును ప్రస్తావించెను. ఈ ముఠా ఎదుట నొక పటము పరచి 'మెడిటరేనియన్' 'పసిఫిక్' సముద్రాలను చూపి కొన్ని వివరాలను చెప్పెను. తరువాత 30 నిముషములు రేడియో వినిరి. కొందరు కొన్ని గుర్తుల వ్రాసుకొనిరి. అది ముగిసిన పిదప ఈ ముఠావారు కొంత విశ్రాంతి పొందిరి. తరువాత ముఠానాయకుడు రేడియోలో చెప్పిన సంగతులు కొన్ని వాక్యాలలో సంక్షేపించి అనువదించి విమర్శ యీ సంగతులమీద జరుగవచ్చునని సూచించెను. ముఠావారు వీటిని విమర్శించడమే కాక తాముగ క్రొత్తవిమర్శన లారంభించిరి. ఒక యరగంట చర్చ జరిగిన పిదప నాయకుడు దానినంతయు

* పై గ్రాంటులకు సంబంధించిన పూర్తి ప్రకటనలో 1860 వ సం॥ 21 వ ఆక్టుక్రింద రిజిష్టరైన గ్రంథాలయములకు కూడ గ్రాంటు లిచ్చున ట్లుదహరింపబడినది. —ఆం. గ్రం. సం.

సమన్వయపరచి యుపన్యసించెను. అందరును ఏదో కొంత క్రొత్తవిషయమును నేర్చుకొంటిమని సంతోషించి యిండ్లకు పోయిరి.

ఈ ఏర్పాటు చాల మంచిది. వయోజనవిద్య ఏరూపంగా చెప్పదలచుకొన్న ఇందులోని మార్గ మవలంబనీయమేయగును. కాని నాయకత్వము వహింపవలసినవాడు సమర్థుడు కావలెను. ప్రపంచ విజ్ఞానము బాగా కలవాడుగా నుండవలెను. తనతోచేరే నలుగురిలో ఉత్సాహము జనింపజేసేవాడు కావలెను. వారి యాత్మగౌరవము నిలిపి తన యాత్మగౌరవము నిలుపుకొన గలవాడు కావలెను. వార డుగు ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పగల శాంతుడు గావలెను. ఈసామర్థ్యము, ఈగుణములు పుట్టు కతోరావు. శిక్షణతో రావలెను. కావున వయోజన విద్యాప్రచారము కోరేవారు సుశిక్షితమగు మానవబలమేర్పరుచు కొనుటకు తగిన సంఘవిధానమంతయు నాలోచింపవలెను.

మిత్రులారా! ఇంకను మిమ్ము అలసట చెందింపవలెనని నాయిష్టముగాదు. ఈసభ యెదుటికి రాగల విషయాలు తామాలోచింపగలరు. సభ జయప్రదముగా జరుగుటకు మీయందరి సహకారమే యాధారము. మీసహకారము పూర్ణముగా ప్రసాదింతురని నావిశ్వాసము. సావధానముగా నాప ల్కుల నాదరించి వినిన మీకెల్లరకును కృతజ్ఞుడను.

**గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ.,**
అధ్యక్షుడు

## తీర్మానములు

౧. భారత విజ్ఞానమునకు మార్గదర్శకులును, ప్రపంచవిఖ్యాత కవిచంద్రులును అగు రవీంద్ర కవీంద్రుని మరణమునకు ఈ సభవారు తమ సంతాపమును వెలిబుచ్చుచు, వారి కుటుంబము నకు సానుభూతిని తెలియబఱచుచున్నారు.

౨. భారతజాతీయ కాంగ్రెసుకు ఒకప్పుడు అధ్యక్షులుగ నుండి నిరంతరము జాతీయసేవకే తమ జీవితమును వినియోగించిన శ్రీమాన్ యస్. శ్రీనివాసయ్యంగారు, భారతదేశ మితవాద నాయకులు, ఆంధ్రపుత్రులు నగు సి. వై. చింతామణిగార్ల మరణములకు ఈ సభవారు తమ సంతాపమును తెలియజేయుచు వారి కుటుంబములకు సానుభూతిని తెల్పుచున్నారు.

3. ఆంధ్రదేశములో గ్రంథాలయోద్యమములో చాలకాలము పనిచేసి ఆంధ్రసారస్వతసేవచేసిన శ్రీ బుర్రా శేషగిరిరావు, పురాణం సూరిశాస్త్రిగార్ల మరణములకును - వయోజన విద్యా ప్రచారమునకు కాకినాడలో చాలకాలము పనిచేసిన శ్రీ పర్వతనేని వేంకటేశ్వరరావుగారి అకాల మరణమునకును ఈ సభవారు సంతాపమును వెలిబుచ్చుచు వారి కుటుంబములకు సానుభూతిని తెలియజేయుచున్నారు.

౪. ఆంధ్రరాష్ట్రమందు వివిధసంఘాల ఆధిపత్యాన నడుపబడుచున్న వయోజన విద్యాలయాలమీద ప్రభుత్వమువారు జూన్ 11 వ తేదీ అమలు జరిపిన నిషేధాజ్ఞ సామాన్యపౌరసత్వ హక్కు లనే భంగపరచుచున్నది. ప్రజాస్వామ్యంకోసం పోరాడుతున్నామనే బ్రిటిష్‌గవర్నమెంటు యీమాత్రపు ప్రజాహక్కులనుగూడ తొలగించుట అన్యాయము; అక్రమము; కాన ఆ నిషే ధాజ్ఞను వెంటనే ఉపసంహరించుకోవలసినదిగ ఈ సభవారు మద్రాసు ప్రభుత్వమువారిని హెచ్చరించుచున్నారు.

౫. వయోజనవిద్యా ప్రచారంపై నిషేధం తొలగించవలసినదిగ ప్రభుత్వాన్ని కోరుచు అన్ని గ్రామాలలోను, తాలూకాలలోను, జిల్లాలలోను ప్రజాశ్రేయస్సు కోరే అన్ని సంస్థలనుండి

ఎన్నుకోబడ్డ ప్రతినిధులతోను విద్యావ్యాపక విషయములో కృషిచేయు బాధ్యతగల వ్యక్తులతోను కలసియున్న సంయుక్త రాయబారవర్గాల నేర్పఱచి ప్రభుత్వమువద్దకు రాయబారాలు నడపుతూ నిరంతరము ప్రభుత్వం నిషేధాజ్ఞను తొలగించేవఱకు ప్రజాందోళన – సభలద్వారా, అసమ్మతిప్రదర్శనాలద్వారా – సాగించుచుండవలయును.

ప్రత్యేకంగా రాష్ట్రాంతరపున పైచెప్పిన విధముగానే ప్రజాసంస్థలనుండి – అనగా యువజన విద్యార్థి, గ్రంథాలయ, రైతు, కార్మిక, మహిళాసంఘములనుండి ప్రతినిధులతోకూడిన రాయబారవర్గమును ఏర్పఱచి ప్రభుత్వమువద్దకు పంపవలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

రాయబారవర్గసభ్యులు :

1. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, కన్వీనరు
2. గోపరాజు రామచంద్రరావుగారు, ముదునూరు, కృష్ణాజిల్లా.
3. చెరుకూరి చలపతిరావుగారు.
4. కాట్రగడ్డ రాజగోపాలరావుగారు.
5. రావి సత్యనారాయణగారు, మునిసిపల్ ఛెయిర్ మన్, తెనాలి.
6. గోగినేని భారతీదేవిగారు, నిడుబ్రోలు, గుంటూరుజిల్లా.
7. బచ్చు జగన్నాథదాసుగారు, హైకోర్టువకీలు, మదరాసు.
8. మద్రాసు విద్యార్థిసంఘసభ్యులొకరు

౬. వయోజనవిద్యాప్రచారాన్ని జయప్రదంగా కొనసాగించుట కవసరమైన కార్యకలాపాన్ని నెరవేర్చుటకు ఒక స్థాయిసంఘ మవసరమని అభిప్రాయపడుచూ, క్రిందివారిని స్థాయిసంఘముగా ఏర్పాటుచేయుటకు ఈ సభవారు తీర్మానించుచున్నారు.

స్థాయిసంఘసభ్యులు :

1. గా. హరిసర్వోత్తమరావుగారు — అధ్యక్షులు
2. గో. రామచంద్రరావుగారు — ఉపాధ్యక్షులు
3. చె. చలపతిరావుగారు — కార్యదర్శి
4. జి. యస్. బాలాజిదాస్ గారు
5. సి. వీరరాఘవస్వామిగారు
6. వై. ప్రభాకరరావుగారు
7. సి. వేంకటేశ్వర్లుగారు
8. కె. రాజగోపాలరావుగారు
9. జి. వి. సుబ్బారావుగారు
10. మానికొండ సూర్యావతిగారు
11. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

౭. వయోజనవిద్యాప్రచారకులైన చాలామంది విద్యార్థులను మన రాష్ట్రములో ప్రభుత్వము ఎట్టి విచారణగాని లేకుండా నిర్బంధములోఉంచడాన్ని ఈ సభవారు ఖండించుచున్నారు. నిర్బంధములోనున్న వయోజనవిద్యాప్రచారకులను ఎట్టి షరతులు లేకుండా వెంటనే విడుదలచేయవలెనని ఈ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

౮. ప్రపంచమందున్న అన్ని దేశాలలోను వయోజన విద్యకై ఎంతప్రోత్సాహమును చెప్పబడుచున్న ఈ రోజుల్లో—

"నిజము నాలోచించినయెడల బడికిపోయెడు వయసునుదాటి పెద్దవారైనవారికి విద్యనుగరపుటకై ధనమును ఖర్చుచేయుట నిరర్థకమేమోననియు, మంచిదికాదనియు తోచుచున్నది." అని బాధ్యతాయుతుడయ్యును మన రాష్ట్ర విద్యాశాఖాధికారి గుంటూరులో మాట్లాడుట చాల సంకుచితదృష్టితో నున్నదని ఈ సభవారు గర్హించుచు వారికముందు సరియైన దృష్టితో వయోజనవిద్యకు తగిన ప్రోత్సాహ మివ్వగలరని నమ్ముచున్నారు.

౯. క్రిందటి సంవత్సరం కృష్ణాజిల్లాలో ముదునూరు గ్రామంలో జరిగిన వయోజనవిద్యాపాఠశాల ఈ సంవత్సరం రాష్ట్రీయ పాఠశాలగా మార్చబడి మార్గసౌకర్యములుగల ఇంకో గ్రామంలో-బెజవాడతాలూకాలో జరుపుటకు ప్రయత్నాలు జరుగుచున్నవి. ఆ పాఠశాల వయోజనులకు విజ్ఞానం కలిగించుటకు చాలా ఉపయోగకరంగా ఉన్నది గనుక, ఆ పాఠశాల ఈ సంవత్సరం స్థాపింపబడగానే దానిలోచేరి విద్యాశిక్షణ పొందమని వయోజనులకు ఈ సభవారు హెచ్చరించుచున్నారు.

౧౦. వయోజన విద్యావ్యాప్తికిని, విజ్ఞానాభివృద్ధికిని గ్రంథాలయముల స్థాపించి ప్రచారము చేయుచున్న ప్రతి పట్టణ, గ్రామ గ్రంథాలయ సంఘములవారున్నూ, నిరక్షరాస్యతా నిర్మూలనము చేయుటకు వయోజన రాత్రి పాఠశాలలు స్థాపించి నడుపవలసినదిగ ఈ సభవారు కోరుచున్నారు.

౧౧. ఆంధ్రరాష్ట్రములోని జిల్లాబోర్డులు, పురపాలక సంఘములు, పంచాయతీబోర్డులు, ఇతర ప్రజా సంస్థలవారును వయోజనవిద్యా ప్రచారమును నిరోధించు మద్రాసు గవర్నమెంటువారి చర్యను గర్హించుచూ, వారి ఉత్తర్వును రద్దుపరచవలసినదిగ తాము తీర్మానించి ప్రభుత్వమువారికి పంపవలయునని ఈ సభవారు కోరుచున్నారు.

౧౨. ప్రపంచములో నూటికి నూరుమందిని విద్యావంతులుగ చేయగలిగి, వయోజనవిద్యాప్రచారాన్ని చక్కగా నడిపి, ఎంతమందినో విజ్ఞానవంతులుగచేసి 20 ఏండ్లలో ప్రపంచములో ఏ దేశము పొందని విద్యా విజ్ఞానాభివృద్ధుల పొందగలిగిన సోవియట్ రష్యా యీనాడు జర్మనీతో యుద్ధమునకు దిగుటచే అచటి విజ్ఞానము నాశమగుచున్నది. ఇట్టి దేశమును బలవంతముగ యుద్ధములో దింపిన ఫాసిస్టురాజ్యాల చర్యను ఖండించుచు, వానితో పోరాడుచు గొప్ప ప్రతిఘటన చూపుచున్న రష్యాను ఈ సభవా రభినందించుచున్నారు.

౧౩. ఆంధ్రదేశములో అన్ని జిల్లాలలోను, జిల్లావయోజన విద్యామహాసభలను జరుపవలయునని ఈ సభవా రేకగ్రీవముగ తీర్మానించుచున్నారు.

---

# వయోజనవిద్య *

శ్రీ గోపరాజు రామచంద్రరావు, ఎం. ఏ.

విద్యఅంటే భావాలను వృద్ధిచేసికోవడం. ఇది రెండువిధాలుగా జరుగుతుంది. మొదటిది: ప్రత్యక్షముగా చూడడం, వినడం. రెండవది: చదవడం, గ్రహించడం.

పురాణశ్రవణం, తోలుబొమ్మలాటలు, నాటకాలు, సినిమాలు, ఉపన్యాసాలు ప్రత్యక్షానికి తోడ్పడతాయి. ఈవిధమైన విద్యాప్రచారంవల్ల జనసామాన్యానికి గ్రహించుకొనుట సులభం. అందుచేతనే పూర్వకాలంనుంచి ఈ పద్ధతులు ఆచారంలో ఉన్నాయి.

కాని ఆధునిక యుగంలో ఈ పద్ధతులు అంతకంతకు వెనుకపడుతున్నాయి. ఎందుకంటే పదిమంది ఒకచోట కూడితేనే తప్ప ప్రదర్శనం వల్లకాని, ఉపన్యాసం వల్లగాని విరివిగా ప్రచారం అవ్వదు. ఆధునిక యుగంలో ప్రజలకు రకరకాలయిన వ్యాపారాలున్నాయి. పదిమంది ఒకచోట ఒక సమయంలో కూడడానికి సావకాశం తక్కువ. అందుచేత ప్రదర్శనాలు, ఉపన్యాసాల ప్రాముఖ్యత తగ్గిపోతున్నది. వాటి బదులు చదువు హెచ్చవుతున్నది.

ఎవరికి తీరికగా ఉన్నప్పుడు వారు పత్రికలు, పుస్తకాలు చదువుకోవచ్చు. ఈ అవకాశంవలెనే ఆధునిక యుగంలో గ్రంథాలయాలు, వార్తాపత్రికలు అంతకంతకు అభివృద్ధి పొందవలసివుంది. ఎంతవరకైతే ప్రదర్శనాలు ఉపన్యాసాల వలన ప్రచారము జరుగుతున్నదో అంతవరకు ఇంకా దేశం వెనకపడుతూన్నదని తెలుసుకోవాలి. ప్రజలు త్వరగా నాగరికత పొందాలంటే వాళ్ళు త్వరగా చదువుకోవడం నేర్చుకోవాలి. అందుకనే విద్యాప్రచారంలో చదవడం నేర్పడం ఒక ముఖ్యమైన శాఖ.

చదవడం చిన్నప్పుడే నేర్చుకోవడం చాలా మంచిది. ఇతర దేశాలలో, చిన్నప్పుడు చదువుకుతీరాలని రాజ శాసనాలున్నాయి. ఇండియాలో అలాంటి శాసనం లేకపోవడంచేత, పిల్లల్ని కూలికి నాలికి తల్లిదండ్రులు పంపడంచేత చదువు తక్కువ. అందుచేత పిల్లలలో విద్యాప్రచారము ఒక సమస్యక్రింద ఉండగా, వయోజనులలో కూడ విద్యాప్రచారం ఇంకో సమస్యగా ఏర్పడింది. వీరికి కూడ చదవటం నేర్పవలసి వస్తున్నది. పెద్దవారు చదువుకోవడంచేత, వీరిలో భావాలు

---

* 22 వ ఆం. దే. గ్రం. మహాసభకు అంగముగ రాజమహేంద్రవరములో 14-1-41 వ తేది జరిగిన వయోజనవిద్యా మహాసభలో చేయబడిన ప్రసంగము.

పెంపొందడమే కాకుండా, విద్యయొక్క ఆవశ్యకతను గ్రహించి వారి పిల్లల్నికూడా చదివించడం అంతకంతకు అభివృద్ధి పొందుతుంది.

వయోజనుల విద్యా విధానానికి చిన్నపిల్లల విద్యావిధానానికి తేడావుంది. చిన్న పిల్లలికి భాషే బాగా ముందు వృద్ధి పొందాలి. అందుచేత వారు చాలా మాటలు కంఠస్థం చెయ్యాలి. వారికి ఉన్న స్వల్ప అనుభవాన్నిబట్టి వారి పాఠాలలో విషయాలు కూడ కాకి, ఆవు, సూర్యుణ్ణి గురించిన పరిచయ భావాలే ఉండాలి. ప్రత్యక్షం హెచ్చుగా ఉండాలి. కథలు వారిని ఆకర్షిస్తాయి. వయోజనులలో అట్లాగాదు. వీరికి అప్పుడే చాలా భావాలు ఉన్నాయి. గ్రహింపు హెచ్చు. భాషతో పరిచయం హెచ్చు. చదవడం ఒక్కటే రావాలి. అందుచేత వారి చదువు సూత్రప్రాయంగా ఉండాలి. ఒక సూత్రం చెప్పితే దాంతో చాలా అల్లుకు పోతారు.

చిన్నపిల్లలికి క, గ గుణింతాలు వరసగా చెప్పాలి. వయోజనులకు ఒక్క గుణింతం విధానం బోధపరిస్తే తక్కినవన్నీ వ్రాసేస్తారు. తేడాలు ఉన్న "యి, యొ, యో, మొ, మో" లు వేరే చెప్పితే చాలు.

పాండిత్యానికి పుస్తకాలు కావలసివచ్చినా, భావ ప్రచారానికి వార్తాపత్రికలు ముఖ్యం. అందుచేత వయోజనవిద్య ఆదర్శం వీలయినంత త్వరలో వార్తాపత్రిక చదివించడం, అందులో విషయం అర్థం చేసికోవడం అయి వుండాలి. వార్తాపత్రిక చదవడం ఒక ఎత్తు. అందులోని విషయాలు అర్థము చేసికోవడం ఇంకొక ఎత్తు. అర్థం చేసికోడానికి కొంత దేశచరిత్ర, భూగోళపరిచయం, రాజ్యాంగ విధానాలు, ఆర్థిక పరిస్థితులు వ్యక్తుల పేర్లు కావలసి ఉంటాయి. మొదట చదువుచెప్పి తరువాత ఈ విషయాలను గూర్చి చెప్పాలంటే ఆలస్యమవుతుంది. అందుచేత వయోజనులకు చెప్పే విద్యావిధానంలో రెండూ ఒకదానివెంట ఇంకొకటి రావాలి. కుక్క, నక్క కథలు వీరికి పనికిరావు. వారికి చెప్పే మాటలే మొదటినుంచీ గంగ (నది), సహకారము (సహకారపరపతిసంఘ ఉద్యమము), ఏషియా (ఖండము), శివాజీ, ఔరంగజేబు, టాజిమహాలు, వైసురాయి, క్లైవు, ధర్మామీటరు, ఇంగ్లండు, యంత్రయుగము ఇట్లు ప్రతిమాట డిక్టేషను చెప్పడమే కాకుండా దాని అర్థముకూడ చెప్పాలి. అట్లాసు చూపించాలి. ఇట్లా చేస్తే వారి కెక్కడి కక్కడే విజ్ఞానం వృద్ధిపొంది క్రొత్త విషయాలు తెలిసికొంటూ ఉండడంచేత ఉత్సాహంగా ఉంటుంది.

ఇంకొకటి, ఆధునికయుగంలో భౌతికశాస్త్రజ్ఞానం ప్రతివారికీ కావాలి. వెనుకటి మూఢ విశ్వాసాలు పోవాలి. ఈ దృష్టి ఏర్పడటానికి భౌతికశాస్త్ర విష

యాలు వెనువెంటనే చెప్పాలి. భూగోళం తెలిసికోడానికి అట్లాసు, గ్లోబు ఎంత అవసరమో, సైన్సు విషయాలు తెలిసికోడానికి పరికరాలు (ఆపరేటస్) అంత అవసరం. కొంత జాగ్రత్తగా ఆలోచిస్తే ఖరీదైన పరికరాలవసరం లేకుండా స్వల్పపువాటితోనే ఎక్స్పరిమెంట్లు చూపించవచ్చు. స్ప్రింగు బాలెన్సుతో ఆర్కిమెడిసు సిద్ధాంతం రుజువు చేయవచ్చు. మరిన్ని ప్రజలకు సూదంటురాయి, థర్మామీటరు, ఎలక్ట్రిక్కు-సెల్లు, బరామీటరుతో పరిచయం అవసరం. అందుచేత భాండాగారాలలో పుస్తకాలు, మ్యాపులతోపాటు సైన్సు పరికరాలుకూడా వుంచాలి. గ్రంథాలయ ప్రదర్శనాలలో సైన్సు ఎక్జిబిషన్లు ఒక శాఖగా ఉండాలి.

వయోజన విద్యాప్రచారం ఫలించాలంటే వయోజనుల ఆవశ్యకాలు, వయోజనులకు బాలురకు ఉన్న తేడాలు గుర్తించాలి.

వయోజన విద్యాప్రచారం పుస్తకాలలో మూడు మచ్చుపాఠాలు*—

## మొదటిపుస్తకం

9 వ పాఠం :

# ప బ మ

కంప మంచం కడప

గంప డంబం

ఇచట కడప అచట కటకం

(కడప, కటకం ఊరులగురించి చెప్పవలెను)

20 వ పాఠం :

# ఎ ఏ

# ె ే

కె కే చె చే టె టే తె తే పె పే యె యే

గె గే జె జే డె డే దె దే బె బే రె రే

నె నే మె మే లె లే · వె వే సె సే శె శే హె హే షె షే

---

* పశ్చిమ కృష్ణా జిల్లా యువజన సంఘమువారిచే ప్రచురింపబడి వ్యాసకర్తగారు రచించిన 'మాపాఠాలు' 2 భాగములు.

| | | |
|---|---|---|
| కేక | వేసంగి | బెజవాడ |
| దేగ | వేటకాడు | బెంగాలు |
| వేప | పేపరు | తెనుగుదేశము |
| తేనె | మెయిలు | జవహరులాలునెహూరు |
| రేయి | అమెరికా | |
| డేరా | | |

అమెరికాలు రెండు. వాటి నడుమ నేల. అందు కాలువ తీసిరి. ఇదే పెనామా కాలువ. నావలకు సదుపాయము. సూయజు కాలువ, కీలుకాలువ ఇటువంటివే.

## రెండవపుస్తకం

# ట ఠ

# ట్ట క్ట ర్ట ల్ట ష్ఠ

| | | |
|---|---|---|
| పిట్ట | అష్టమి | విక్టోరియారాణి |
| చెట్టు | ఈజిప్టు | (క్రింద గీత గీసిన మాటలు |
| బెట్ట | కలెక్టరు | బోధపర్చాలి) |
| కోర్టు | పోస్టాఫీసు | |

ఇండియాలోని సరకులు ఎగుమతి చేసికొనుటకై దొరలు మొదట ఇండియాకు వచ్చిరి. వారి కంపెనీపేరు ఈస్టుఇండియా కంపెనీ. అంతకంతకు పట్టణాలు దేశాలు వారికి చెందిపోయాయి. పరిపాలన కష్టమగుటచేత 1858 లో ఇండియాను విక్టోరియారాణికి ఇచ్చివేసిరి.

# మన వయోజనవిద్య

శ్రీ మేడసాని తిరుపతిరాయుడు, గ్రంథాలయ ప్రవేశిక

ఇతరదేశాలతో పోల్చి చూస్తే మనదేశంలో చదవను వ్రాయను నేర్చినవారి సంఖ్య చాలా తక్కువ. అందువల్లనే మనకు వయోజన విద్యాప్రచార అవసరము యితరులకంటే చాలా ఎక్కువగుటయే కాక పద్ధతులలోకూడా మార్పు కావల్సివుంది. దాదాపు నూటికి 90 మంది విద్యావంతులైన యితర దేశాల్లో వయోజన విద్యాప్రచారమంతా అక్షరాభ్యాసమునుంచి ప్రచారముకాక ప్రజలకవసరమగు విజ్ఞానప్రచారముగా నున్నది. మన వయోజన విద్యాప్రచారమంతా చాలవరకు ప్రపంచజ్ఞానమే లేని ప్రజానీకములో జరగాల్సివుంది కనక మన ప్రచారకులు అక్షరాభ్యాసము మొదలుకొని నేర్పాల్సివుంటుంది. ఇతర దేశాల్లోని ప్రచారకులు ముఖ్యంగా వాళ్ళ రాజకీయసిద్ధాంతాలు తమ ప్రత్యేకోద్దేశాలు ప్రచార ఆశయాలుగా కలిగివుంటారు. అట్టి ప్రచారము కొంతవరకు చదువను వ్రాయను నేర్చిన ప్రజలలో అయితే వుపయోగిస్తుంది కాని నిరక్షరాస్యులగు ప్రజలలో కేవలం అట్టి ప్రచారంమాత్రమే సాగించిన ఫలిత ముండదు. కనక మన ప్రచారకులు అక్షరాలదగ్గరనుంచి నేర్పాలి.

సంఘంలో కూడుగుడ్డలకు యిబ్బందిలేక జీవితము గడుపుతున్న ప్రజలు విద్యావిహీనులైనప్పటికి ఎవరన్నా వుచితంగా విద్య నేర్పుతామన్నా అలక్ష్యం చేయటమే కాకుండా పైగా వారు అదొక న్యూనతగా భావిస్తారు. ఏదో ఒక విధంగా తిండికి కొదువలేక కాలం గడుపుతున్న మధ్యతరగతి వయోజనులను కూడా ఆకర్షించటం కష్టమే. ఇక పోతే మిగిలింది పాటకపుజనం మాత్రమే. వీరంతా తమ జీవితము గడుపుకోటానికి కాయకష్టము చేసి శ్రమపడవల్సి వుంటుంది.

తక్కినవారికంటే వీరికి తీరిక తక్కువైనప్పటికి చదువుకుందామనే అభిలాష వీరిలో కలిగించటం మాత్రం తేలిక. విద్యావిహీనులైన ధనవంతులను, మధ్యతరగతి ప్రజలను విద్యావంతులుగా చేయవలెనంటే ప్రభుత్వ నిర్బంధము తప్ప ప్రచారకులవల్ల కానిపని. ఇతరదేశాల ప్రభుత్వాలు అనేక విధాల వయోజన విద్యాప్రచారాన్ని ప్రోత్సహిస్తుంటే మన ప్రభుత్వము ఏ విధమైన సాయము చేయక పోగా అట్టి ప్రచారాన్నికూడా నిషేధించిందంటే ఎంతవరకు మనము ప్రభుత్వ సాయము పొందగలమో వేరే చెప్పనక్కరలేదు. యూరోపియన్ దేశాల్లో అక్కడి ప్రభుత్వాలు రాత్రిపాఠశాలలు, ఉచిత సినిమా ప్రదర్శనాలు, ప్రత్యేక పాఠశాలలు ఏర్పాటు చేయటమే కాకుండా, ప్రచారకులకు అలవెన్సులుకూడా

ఇచ్చి తోడ్పడుతున్నాయి మన ప్రచారానికి మిగిలిన సాధనాలల్లా గ్రంథాలయాలు, వుచితంగా ప్రచారానికి పూనుకొన్న వ్యక్తులుమాత్రమే.

ప్రచారకులు ఏదో తమవద్దకు వచ్చినవారికి మాత్రము నేర్పుదామనే వుద్దేశం కాక ప్రజలను ఆకర్షించటం, రెండోది వారికి చదువు నేర్పటం అనే రెండు బాధ్యతలు కలిగివుండాలి. చదువుకోవాలనే అభిలాష లేక, పైగా తీరిక లేక వున్న ప్రజల్లో ప్రచారం చేయాలంటే ఆకర్షణకు ప్రాధాన్య మివ్వకపోతే ప్రచారం సాగదు. తనకు అనుకూలంగా వున్న సమయాన్ని ప్రచారానికై వినియోగిద్దామనే వుద్దేశంకాక తాము ప్రచారం చేయదలచిన ప్రదేశాల్లోని ప్రజల తీరికసమయాన్ని అందుకొరకు వుపయోగించాలి. బళ్ళో గంట కొట్టంగానే పిల్లలంతా వచ్చినట్లు సరిగా ఏర్పరచుకొన్న టైముకు నేర్చుకొనేవారంతా రావాలంటే కష్టమైన పని. పగలు రాత్రి అనే రెండు భేదాలు తప్ప కాలప్రమాణము తెలియని సామాన్యప్రజల్లో మనం ప్రచారం చేయాల్సివుండటం మూలాన వాళ్ళు సరియైన టైముకు రాలేదని విసుక్కుంటే లాభంలేదు. అంచేత ప్రచారకుల కందరకు ఓర్పు ఎక్కువగా వుండాలి. ఒక్కొక్కప్పుడు వారు చదువుకోటానికి అవసరమగు పుస్తకాలు, పలకలు మొదలగు పరికరాలు కూడా తెచ్చుకోలేని స్థితిలో నుండవచ్చు. అట్టి సమయాల్లో ప్రచారకులే వాటిని సప్లై చేయాల్సివుంటుంది. సాధారణంగా పిల్లవాళ్ళకంటే పెద్దవాళ్ళకు జ్ఞాపకశక్తి తక్కువగా వుంటుంది కనక, నిన్న చెప్పింది ఇవ్వాళ రాలేదనే కోపము చిరాకు కలిగివుంటే ప్రయోజనం లేదు. మనము వయస్సు మీరినవారికి చదువు నేర్పాల్సివుంటుంది. వారు సహజంగా చదువుకొనేప్పుడు తమ తప్పుల చూచి సిగ్గుపడి నిరుత్సాహ పడుతుంటారు. అందువలన పెద్దవాళ్ళవిషయములో వారితప్పులు కొంతవరకు కప్పిపుచ్చి సవరించటానికి యత్నించాలి. పిల్లలకైతే ఆ సిగ్గు, నిరుత్సాహము వుండదు. పైగా పెద్దవాళ్ళు తమకంటే రెండోవాడికి బాగా వస్తుందంటే అభిమానపడి చదవటమే మానుకొంటారు. దానివలన రెండోవాడి ఆధిక్యతను చెప్పి పొగడటం కేవలం వ్యతిరేక ఫలితమిస్తుంది. వయోజనులలో చాలవరకు ఈ అభిమాన ముంటుంది. చదువుకొనేవారిలో ఒకడు చురుగ్గా నున్నప్పటికి బిడియపడేవారి ముందర అవి మరుగుపరచాలి. ప్రచారకుడుకూడా విద్యార్థులతో కలిసిమెలసి చనువుగా వుండాలి. కుల మత విభేదాలు చూపిస్తే విద్యార్థుల నాకర్షించటం కష్టం.

పిల్లలకువలే పెద్దవాళ్ళకు అక్షరాలు నేర్పి చదువు చెప్పాలంటే చాలా కష్టం. వాళ్ళకు అక్షరాలు నేర్చుకోటం ఉత్సాహము కలిగించక విసుగు పుట్టిస్తుంది. అందువలన వాళ్ళు అర్థంచేసుకోగల చిన్న చిన్న విషయాలపై వుపన్యాసాలిస్తూ వాళ్ళ నాకర్షించి క్రమేణా వాళ్ళకు అక్షరాలు నేర్పాలి. మన వుపన్యాసాలన్నీ

కొంచెం వాళ్ళకు ప్రపంచజ్ఞానం కలిగించేట్టు వుండాలి. కాని కేవలం వుపన్యాసాలతోనే వూరుకొంటే వాళ్ళు నేర్చుకొన్నది ఎక్కువకాలం నిలువదు. వాళ్ళంత వాళ్ళు పుస్తకాలు, పత్రికలు చదువుకోగల శక్తి కలుగచేయాలి. అందుకు అక్షరాలు కూడా నేర్పాల్సివుంటుంది.

అక్షరాలు నేర్పటానికి తేలికపద్ధతులంటూ పలువురు పలువిధానాలు సూచిస్తున్నారు. అందులో 'సున్నా' మీదనుంచి అక్షరాలు నేర్పటం, 'అరసున్నా' మీదనుంచి నేర్పడం, ఏదో ఒక అక్షరం నేర్పి దాన్ని వేర్వేరు విధాలుగా మార్చి వేర్వేరు అక్షరాలుగా చేయటం మొదలగు విధానాలు కలవు. ఇవన్నీ మెకానికల్ పద్ధతులు అవటంమూలాన నేర్చుకొనేవారికి యివే కష్టమేమో!

అదికాక అక్షరాలు రాయటం చేతకాకపోయినప్పటికి వాళ్ళపిల్లలు నేర్చుకోటం మూలాన చాలమంది వయోజనులకు అక్షరాలు కొంతవరకు ఒక వరుసలో చదవటం వచ్చివుంటుంది. తక్కిన పద్ధతులవల్ల మనము అక్షరాలు నేర్పటానికి పూనుకొన్నప్పుడు వారికి వచ్చిన వరుసలో యివి లేకపోటం మూలాన వారికిదంతా గొడవగాకూడా వుంటుంది. దీనివలన అక్షరాలు దిద్దించేపద్ధతే అనుకూలమని పిస్తుంది. అయినా ఈవిషయంలో మాత్రము ప్రచారకులు వారివారి అనుభవాల్ని బట్టి అనుకూలాన్నిబట్టి అక్షరాలు నేర్పేపద్ధతి నిర్ణయించుకోవాల్సి వుంటుంది.

ప్రచారకులు ప్రజల నాకర్షించటానికి దేశపటాలు, మ్యాజికులాంతరు, గ్లోబు ముఖ్యంగా కలిగివుండాలి. గ్రామఫోను, బొమ్మలుకూడా అవసరమే. చదువంటే ఏమిటో తెలియనివాణ్ణి కూడా పటము చూపిస్తూ ఫలానాదేశమనీ ఫలానానదనీ పట్టణమని చెప్పి వాటిని గురించి వాడెంతవరకు అర్థం చేసుకోగలడో గ్రహించి అంతవరకు వాటినిగురించి వాడికి చెపుతుంటే వాడు చదువుకోటానికి అభిలషిస్తాడు. ఈవిధంగా మాజిక్‌లాంతరు మొదలగువాటి సాయం మూలాన ప్రజల నాకర్షించవచ్చును. ప్రచారకుడు అవసరాన్ని గుర్తించి ప్రజలనాకర్షించటానికి సాధనాలు నిర్ణయించుకొంటే ప్రచారం తేలిగ్గా సాగుతుంది.

ప్రచారకులు తమ భావాలు ప్రజల మనసులోకి ఎక్కించి వాటిని వారిచేత ఒప్పిద్దామంటే అది ప్రచారానికి చాలా నష్టం. నేనొక కమ్యూనిస్టునైతే వీళ్ళనంతా కమ్యూనిస్టుల చేయాలంటే ఆ ప్రచారము వయోజన విద్యావ్యాప్తికి ఏ విధంగాను తోడ్పడదు. ప్రపంచపు గొడవే తెలియని మన ప్రజల్లో కొంతవరకు ప్రపంచాన్ని అర్థం చేసుకోగల మార్పు కలిగించటమే మన ప్రచార ఆశయంగా వుండాలి. కాని నాస్తికుడు నాస్తికుల్ని తయారు చేయాలనీ, శివభక్తుడు శైవ మతాన్ని వ్యాపింపచేయాలనీ, ఏదో ప్రత్యేకోద్దేశాలతో ప్రచారం మొదలు

పెడితే మనకున్న పరిస్థితుల్లో అవి వయోజనవిద్యావ్యాప్తి కే విధంగానూ సాయ పడవు. అందుచేత ప్రచారం నిష్పాక్షికంగా వుంటం చాలా అవసరం.

---

# వయోజన విద్యాప్రణాళిక *

శ్రీ గోపరాజు రామచంద్రరావు, ఎం. ఏ.

నిరక్షరాస్యతలో మునిగివున్న భారతదేశంలో వయోజనవిద్యావ్యాప్తియొక్క ఆవశ్యకతనుగూర్చి వేరే చెప్పనక్కరలేదు. కీర్తిశేషులైన గోపాలకృష్ణగోఖలే కాలంనుంచీకూడా విద్యావ్యాప్తి సంఘసమస్యగా వస్తూవున్నది. వ్యక్తులు, చిన్న చిన్న సంఘాలు, ఈవిషయమై కృషిసల్పుతూనే వున్నాయి. ఆంధ్రదేశంలో 1929 నుంచి వయోజనవిద్యాప్రచారం మొలకలెత్తుతున్నట్లు తెలుస్తుంది. ప్రజాప్రతినిధుల ప్రభుత్వవిధానాలు భారతదేశంలో ప్రవేశించుతున్నకొద్దీ దేశాభివృద్ధికి అక్షరాస్యత అవసరమని స్పష్టపడుతోంది. అంచేత దేశాభిమానులందరు తమతమ శక్తికొలది వయోజనవిద్యాప్రచారం చేస్తూనేఉన్నారు. క్రిందటిసంవత్సరం యీ ప్రచారం విరివిగా సాగింది. ఈ ఉద్యమంలో పాల్గొన్న సంఘాలయొక్క, వ్యక్తులయొక్క పని శ్లాఘనీయం. ఇట్లు అక్కడక్కడ సల్పిన కృషిని కేంద్రీకరించి వారిలో వారికి సహకారం నెలకొల్పుటవల్ల, అందరు కలిసి సంస్థగాఏర్పడి, సంఘబలంవల్ల వారిఆశయాన్ని త్వరగా నెరవేర్చుకోగలరు. ఈరోజున ఆంధ్రదేశగ్రంథాలయ సంఘ యాజమాన్యాన జరుగుచున్న ఈసమావేశం యీవిధంగా వయోజనవిద్యా వ్యాప్తికి విస్తారంగా తోడ్పడుతోంది.

ఇంతవరకు వేరువేరు స్థలాల్లో ఒక్కొక్కప్పుడు వేర్వేరు విధానాలతో మన మందరం వయోజనవిద్యకొరకు పనిచేసివున్నాం. మనకు యీవిషయమై వేరువేరు అనుభవాలుకూడా వున్నాయి ఇకమీదట మనమందరం ఒకేసంస్థకు చెంది ఒకే ఆశయంకొరకు పాటుపడాలి. కనుక ఒకవిధానం అవలంబించాలి. మనమాలోచించి దానిని నిర్ణయించుకునేముందు ఆధారంగా యీప్రణాళికను మీముందు పెట్టుచున్నాను. మొదటి మన ఆశయం ఏదో నిశ్చయంచేసుకొని, దానికి తగు విధానం నిర్ణయించుకోవాలి.

---

* 24–8–41 వ తేది తెనాలిలో జరిగిన ఆంధ్రదేశ వయోజనవిద్యా మహాసభలో చదివిన వ్యాసము.

## ఆశయం

తన సమస్యలనుగురించి తాను స్వతంత్రంగా ఆలోచించుకొనేటట్లు వయోజనులను తయారుచేయడమే యీ విద్యాప్రచారంయొక్క ఆశయమని అనవచ్చు. కాని యిట్టినిర్వచనం స్పష్టంగా వుండదు. దానిని మరింత స్పష్టంగా చేయాలంటే దానిని రెండుభాగాలుగా తీసుకోవచ్చు. (1) వార్తాపత్రికలను చదివి అర్థంచేసుకోగలుగుట. (2) శాసనసభలకు అక్షరాస్యత ఓటు హక్కును కలిగియుండుట. ఈ రెండింటివల్లా అతడు ఒకవైపు స్వతంత్రఆలోచన పెంపొందించుకొంటూ యింకొకవైపు దేశాభివృద్ధియందు తనకుగల బాధ్యతను నిర్వహించుకొనుచుండును.

ఇట్టి ఆశయాన్ని నెరవేర్చుకొనుటకు అక్షరాస్యత అవుసరమగును. అక్షరాస్యతను ప్రభుత్వశాసనం ద్వారా కలిగించవలసిందేగాని యితర సంస్థలవల్ల విశేషంగా కలుగలేదని, వినికిడివల్లనే ప్రజల్లో జ్ఞానోదయం విరివిగా కలిగించవచ్చునని కొందరి అభిప్రాయం. నిజమే. ప్రభుత్వశాసనసహాయం లేనిదే అక్షరాస్యత కలిగించుట సులభసాధ్యంకాదు. వినికిడివల్ల విరివిగా విషయజ్ఞానంకలుగును. మన దేశంలో ప్రబలుతూవున్న జాతీయోద్యమంయొక్క భావప్రచారం యీవిధంగానే జరుగుతోంది. కాని అట్టిభావాలకు స్థిరత్వమేర్పడాలంటే, అక్షరాస్యత తప్పనిసరియగుచున్నది. కనుక తగుశాసనంకొరకు ఒకవైపు ఆందోళనజరుపుచూ, ఆశాసనంకొరకు వేచియుండి కాలయాపనచేయక, యింకొకవైపు ఏస్వల్పంగానైనా అక్షరాస్యతకొరకు పాటుపడాలి.

## విధానం

పై ఆశయాన్ని నెరవేర్చుకొనుటకుగాను వయోజనవిద్య రెండువిధాలుగా వుండాలి. (1) అక్షరాస్యత (2) ఉపన్యాసాలవల్ల విషయజ్ఞానం నెలకొల్పుట. దీనికొరకై మనం ఆరువిషయాలపై ఆలోచించాలి.

(1) అక్షరాస్యత కల్పించగల్గు పుస్తకాలు (2) ఉపన్యాసవిషయాలు. (3) పాఠశాలలు పెట్టుటకుస్థలం, కాలనిర్ణయం (4) పాఠశాలకు కావలసిన పరికరాలు (5) ఉపాధ్యాయులు—వారిశిక్షణ (6) పైవిధానాన్ని అమలుపర్చుటకు కార్యనిర్వాహక సంఘం.

(1) అక్షరాస్యత కల్పించగలపుస్తకాలు:—బాలబాలికలకంటె వయోజనులకు ఎక్కువ విషయజ్ఞానం, గ్రహణశక్తి వుండుటచేత, వీరిలో అక్షరాస్యత నెలకొల్పుటకు వేరురకాలపుస్తకాలు కావలసివున్నాయి. ఈ వుద్దేశ్యాలతో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు, శ్రీ సుందరంగారు యింకాకొందరు వేరువేరు పుస్తకాలు వ్రాశారు. అక్షరాలు నేర్పుటకు వారు వేరువేరు విధానాలుకూడా అవలంబించారు. (ం) సున్నా, (ః) అరసున్నాలతో అక్ష

రాల్ని ఏర్పర్చుట, సులభమైన అక్షరాలు మొదట నేర్పుట, బొమ్మలబట్టి అక్షరాలు నేర్పుట, అక్షరాలు క్రమంగానే నేర్పుట, యిట్టి విధానాలు అవలంబింప బడ్డాయి. అనుభవాన్ని బట్టిచూడగా ఒక్కొక్క చోట ఒక్కొక్క విధానం బాగాపని చేస్తోంది. ఇదివరకు లేబరుడిపార్టుమెంటు పాఠశాలలున్న స్థలాల్లో, అక్షరాలు వ్రాయగలుగుట కష్టంగాలేదు. అక్షరాల పోలికే తెలియని కొన్ని కొన్ని సంఘాల్లో సున్నాపద్ధతి బాగావుపయోగ పడుతోంది. అంచేత యీరెండు విధానాలు ఉపాధ్యాయుడు నేర్చుకోవాలి. అక్షరాస్యత పుస్తకాల్లో వుండు పాఠాలు, మాటలు, పత్రికావిషయ జ్ఞానానికి చెందినవైతే బాగుండునని తోస్తోంది.

(2) ఉపన్యాసవిషయాలు:—వయోజన విద్యాప్రచారం, ఉపన్యాసాలయొక్క వుపయోగం చాలా విస్తారంగావుంది. అంచేత కనీసం 40 ఉపన్యాసాలకైనా విషయాలు నిర్ణయించాలి. ఇందుకుగాను (శ్రీ) శనివారపు సుబ్బారావుగారు వ్రాసిన 'వయోజనవిద్య' అను పుస్తకం సహాయంగా వుండును. ఇందులో వారిచ్చిన విషయాలు విస్తారంగా ఆర్థిక, రాజకీయ, సాంఘికవిషయాలకే చెందివున్నాయి. కనుక వాటికి భూగోళశాస్త్రం, ప్రపంచ చరిత్ర, భౌతికవిజ్ఞానాలకు చెందిన విషయాలు కూడా చేర్చాలి. ఒక్కొక్క తరగతికాలం 4 నెలలు వుంచుటమంచిది. దానికి తగినట్లు వుపన్యాసాలుకూడా 50 కి మించకుండా వుంటం మంచిది.

(3) పాఠశాలలు పెట్టుటకు స్థలం, కాలనిర్ణయం:— మాగాణిఊళ్లలో ఆగష్టు మొదలు నవంబరువరకు వయోజనులకు తీరికసమయం. పారిశ్రామిక ప్రదేశాల్లో రాత్రులు 7 గంటలు అయినతరువాత తీరికవుండును. మెరకపంటలున్న ప్రాంతాల్లో కూడా రాత్రుల్లు తీరికవుండును. అంచేత ఆయాప్రాంతాలకు తగినట్లుగా పగలుగాని రాత్రిగాని పాఠశాలలు జరపవచ్చు. ప్రతిరోజు $1\frac{1}{2}$ గంట లేక 2 గంటలు విద్య గరపవచ్చును. స్థలం, రాత్రుల్లయితే ఒరుపురోజుల్లో బహిరంగంగా పాఠశాల జరపవచ్చును. సాధ్యమైనంతమట్టుకు అందుచాటులో స్థలం వుంచుటమంచిది. గ్రామ పుస్తకభాండాగారభవనాల్లోగాని, బోర్డుప్రాథమిక పాఠశాలా భవనాల్లోగాని, గ్రామ చావిళ్లలోగాని వారివారి అనుమతిపొంది నడుపవచ్చును.

(4) పాఠశాల పరికరాలు:- అక్షరాస్యతకు బ్లాకుబోర్డు, పలకలు, పుస్తకాలు, దీపాలు ముఖ్యంగా కావాలి. ఉపన్యాసాలకు మ్యాపులు, గ్లోబు, మాగ్నెటు, ఉష్ణమానిని మొదలగు కొన్ని పరికరాలు అవుసరం. వీటికి కావలసిన ధనాన్ని ముందు గ్రామప్రజలనుండి విరాళాలుగా సంపాదించాలి. ఉత్సాహం పెంపొందిన కొద్దీ విద్యార్థులే తమ తమ పుస్తకాలు, పలకలు జతపర్చుకుంటారు. అంతకంతకూ పంచాయతీబోర్డు, సహకారసంఘాలు, జిల్లాబోర్డునుంచి విరాళాలు పొందవచ్చును. గవర్నమెంటు గ్రాంటుకూడ పొందుటకు అవకాశాలు కలవు.

(5) ఉపాధ్యాయులు:- ఏ విద్యావిధానంలోనైనా, ఉపాధ్యాయుడు చాలా ముఖ్యం. విద్యార్థుల్లో విజ్ఞానం పెంపొందించుటకన్న, ఉత్సాహం కల్పించుటే యితని ముఖ్యమైన పని. ఉపాధ్యాయునికి రెండు యోగ్యతలు అవసరం.

(1) ఉత్సాహం పుట్టించగల్గుట. దీనికని అతనిలో కార్యదీక్ష కావలసియుండుటే గాక, విద్యార్థులతో కలసి మెలసి వుండుటకు ఏ విధమైన సంకోచం వుండకూడదు. అనగా అతడు కులతత్వ భేదాలను పాటించరాదు. మరియు నాస్తిక దృక్పథం ఇందుకు తోడు కాగలదు. (2) ప్రస్తుతం సామాన్య పాఠశాలల్లోవున్న విద్య విజ్ఞానాన్ని యిచ్చుటలేదు. అంచేత వయోజన విద్యాప్రచారానికై ఉపాధ్యాయులుగా నుండగోరువారు కొంత ప్రత్యేక శిక్షణ పొందుట అవసరంగా తోస్తోంది. దానిలో అక్షరాస్యత గరపు విధానాలు, ప్రత్యేక వుపన్యాసాలు యిచ్చుటకు విషయాలు నేర్పాలి.

(6) కార్యనిర్వాహకసంఘం:- పై విధానాన్నంతటిని జరిగించుటకు ఒక కార్య నిర్వాహకసంఘం ఏర్పడాలి. ఆ సంఘంలో క్రింద నుదహరింపబడిన బాధ్యతలతో 5 గురు సభ్యులుండాలి:—

(1) అక్షరాస్యతకొరకు.
(2) ఉపన్యాసాలకొరకు.
(3) స్కూళ్ల నిర్మాణాలకొరకు.
(4) ఆఫీసుకార్యదర్శి.
(5) ఆకర్షణ విధానాలను నెలకొల్పుట. (పై ఉపన్యాసములు, పాటలు, ప్రదర్శనాలు, విహారాలు జరిగించుటకు)

హిస్టరీ, సైన్సు, జాగ్రఫీ మొదలైన విషయాలగురించి పాటలువ్రాయించి ప్రచారంలోనికి తీసుకురావాలి. అక్షరాస్యతకు, ఉపన్యాసాలకు, ఉపాధ్యాయుల శిక్షణకు తగుపుస్తకాలను పాఠశాలలను నిర్ణయించుట, ఉపన్యాసాలకు కావలసిన పరికరాల్ని సేకరించుట యీ సంఘంయొక్కపని. మరియు తరగతిఅనంతరం శాసన సభ ఓటర్లుగా విద్యార్థులను చేర్చవలెను. ప్రస్తుతపరిస్థితుల్లో అన్నింటికన్నా ముందు యీసంఘం ఉపసంఘాల్ని నియమించి ప్రభుత్వనిషేధాన్ని తొలగించుకొనుట మిక్కిలి అవసరం.

వయోజన విద్యాప్రచారానికి గ్రంథాలయాలు అండగావుండును గనుక వారు గ్రంథాలయాల్లో వయోజన విద్యాపాఠశాలలు పెట్టుటకు అవకాశాలు యివ్వవలె ననియు, వారు భౌతికశాస్త్రపరికరాలు, మ్యాపులు, విజ్ఞానవిషయిక పుస్తకాలు పుస్తకభాండాగారాల్లో వుంచవలయుననియు కోరుచున్నాను.

---

# వివిధదేశాల్లో వయోజనవిద్యాప్రచారము

శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మ, ఎం. ఏ.

గుంటూరు హిందూ కాలేజి ఆంధ్రోపన్యాసకులు

ఏ దేశమయినను నాగరికదేశ మనిపించుకొనవలెనన్న ఆ దేశమందలి జనులందరును చదువుకొనిన వారు కావలెను. అట్లు చదువుకొన్నవారి సంఖ్య ఇతర దేశములలో నూటికి నూరు కొన్నిచోట్ల, నూటికి 97, 98, 99 కొన్నిచోట్ల ఉన్నది. దీనికి అనగా వయోజన విద్యావ్యాప్తికి సాధనములు ముఖ్యముగా వయోజన పాఠశాలలు, గ్రంథాలయములు. చదువుకొన్నవాళ్లు చదువు నభివృద్ధి చేయుటకు గ్రంథాలయము లెక్కువగ ఉపయోగించును. అసలు చదువురానివారికి కూడ ఈ గ్రంథాలయములె చదువు చెప్పించి వారిని విద్యనేర్చిన వారుగ చేయవచ్చును. గ్రంథాలయసంస్థ చేయజాలని సత్కార్యము లేదు. జీతమిచ్చిన గ్రంథభాండారి ఉన్న ఈపని మరింత సుముఖముగ జరుగును. అట్టివారు లేనినాడు గ్రంథాలయ కార్యములు సక్రమముగ జరుగుననుట అనుమానాస్పదము.

ఈ వయోజనవిద్య అనేదాన్ని నిర్వచించే ముందు వయోజనులంటే ఎవరనే ప్రశ్నకు సమాధానము చెప్పాలి. వయోజనులంటే బాల్యదశ అనగా 18 సంవత్సరములు దాటినవారు (నలభైయేళ్ల పయిబడనివారని స్థూలంగా అనుకోవచ్చును). చిన్నప్పుడు విద్యనేర్వక ప్రపంచజ్ఞానము తెలియనివారు (వృద్ధాప్యంరానివారు) వ్రాత చదువు తెలియనివారు ఇటువంటివాళ్లు మన దేశంలో ఎక్కువ ఉండడంచేతనే మనదేశ మిట్టి దీనస్థితిలో ఉంది. ఇట్టి వయోజనులకు చదువను వ్రాయను చెప్పేవారికి లోకజ్ఞానం అలవడే పద్ధతిని బోధించి, వారికి మనస్సు కెక్కేటట్లు చేసి వారి నిరక్షరాస్యతను నిర్మూలించడమే వయోజనవిద్య. (ఈ విద్యను గాంధిగారిట్లు నిర్వచించి దాని ఆవశ్యకతను నిరూపించి చెప్పినారు. సి. రాజగోపాలాచారి, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతులు వారికి చక్కని పాఠ్యపుస్తకాలను రచించారు.) ముఖ్యమైనపద్ధతి ఏమిటంటే వయోజనులకు వ్రాయడం చదవడం నేర్పితే సులువుగా వారు లోకజ్ఞానాన్ని సంపాదించుకోటానికి వీలయిన పత్రికలు మున్నగునవి వాళ్ళే చదువుకుంటారు. కావలసిన ఉపన్యాసాలిస్తూ ఉండవచ్చును. ఏతావాతా తేలిందేమిటంటే వాళ్లకు ముఖ్యం చదవడం వ్రాయడం నేర్పాలన్నమాట.

ప్రజాప్రతినిధి పరిషత్తు అనిఅంటున్నారే మనకు గమ్యస్థానము అట్టి ప్రతినిధులను ఎన్నుకొనే జనులకు వాటివిలువ తెలియవలెగదా! అట్టి విషయమును తెలిసికొనుటకే జనుడు చదువను వ్రాయను సమర్థుడుగ నుండవలెనుగదా! అప్పుడుగదా సరియైన ప్రతినిధి నెన్నుకొనగలడు. అట్టి ప్రజాప్రతినిధి పరిషత్తుగదా మనకు స్వరాజ్యాన్ని నిర్వచించగలదు.

## పాశ్చాత్య సీమలు

వయోజనవిద్యను అభివృద్ధిచేసే దేశములు పాశ్చాత్యదేశములు. అందును ముఖ్యములు డెన్మార్కు, జర్మనీ, ఇంగ్లండు, స్కాట్లండు, నార్వే, స్వీడను, ఫ్రాన్సు, కనడా, రష్యా మొదలైనదేశాలలో ఈ ఉద్యమం అభివృద్ధిచెందడానికి కారణములు అచ్చటి 'Continuation Schools' స్థాపన. ఆ స్కూళ్ళలో వర్తకంచేసుకునేపద్ధతి, వృత్తులుచేసుకొనే విధానము నేర్పుతారు. చదవడం వ్రాయడంతోపాటు ఇవన్నీ ఉచితంగా బోధిస్తారు. చుట్టుపట్లనున్న గ్రామాల్లోని స్త్రీపురుషులు యావన్మంది 18 ఏళ్ళు పయిబడినవారు చదివితీరాలని నిర్బంధంకూడా ఉంది. దీన్నే Compulsory Adult Education అంటారు.

వయోజనవిద్యను వ్యాపింపచేయడానికి మొట్టమొదటగా కృషి చేసినదేశము డెన్మార్కు. అక్కడ గ్రంథాలయోద్యమమేమిటి, ఇతరవిద్యాసంస్థ ఏమిటి అభివృద్ధికిరావడం అతిసులభం. అందుకనే 100 కి 99 మంది చదువుకున్నవాళ్లున్నారు ఆదేశంలో. పాడిపంటలమహాలక్ష్మితోపాటు సరస్వతికి కూడ స్థానముండక్కడ— 1844 సంవత్సరములో వ్యవసాయదారుల పిల్లలకోసము మొదటి 'ఫోక్ హాక్ షూలె' (Folk hock Schule) ను స్థాపించినారు. మొదట్లో ఈబడి మతసంస్థగా ఉండేది. జర్మనీ మొ॥ ఇతర పాశ్చాత్యదేశాల్లోవలె జనబాహుళ్యమీ సంస్థను ఆదరించుటచే అధికసంఖ్యాకములైన సంస్థల ఉత్పత్తికి ఆధారమేర్పడెను. ప్రజాదరణ ఎంతో ప్రభుత్వపోషణ అంత ఈసంస్థలకు దొరక మొదలిడెను. 1918 సం॥రమున డెన్మార్కులో 6,640 విద్యార్థులతో 63 బడులుండెడివి. ఇందులో శీతకాలములో మగవారికి అయిదునెలలున్ను, స్త్రీలకు వేసవిలో నాలుగునెలలున్ను చదువుచెప్పేవారు. వ్యవసాయానికి సంబంధించిన విద్యాబోధ ఎక్కువ— తెలివితేటలతో చదువుకొని కృషిలోకి పనికి వచ్చేవాళ్ళని పై చదువులకు వ్యవసాయకళాశాలకు పంపేఏర్పాట్లు కలవు. అల్లాగే కార్మికవిద్య మేలని వాటినిగురించి చదివేవాళ్ళకికూడ ప్రోత్సాహమివ్వడం, ఆయా వృత్తివిద్యలలో రగడదేర డానికి కావలసినంత సామాన్య (General) విద్య వాళ్ళకిస్తుండేవారు. చిన్నప్పుడు చదువుకోనివాళ్లు యావజ్జీవము విద్యావిహీనులుగా నుండనక్కరలేకుండా మంచిపౌరులనుగా విద్యనేర్పినవారినిగా తయారుచేయడమే వీని పరమాశయము. ఈవిద్యాలయాలు సంవత్సరానికి అయిదునెలలు మొగవాళ్లకి, నాలుగునెలలు ఆడవాళ్ళకి స్థాపించడంలో ఉద్దేశములు వారివారి కులవృత్తులకు వ్యవసాయాదికృషులకు అడ్డులేకుండా ఉండేటందుకే— అల్లే భారతదేశములోకూడ 6 నెలలు వ్యవసాయసమయం వదిలి తతిమా ఆరునెలలూ అన్నిగ్రామాల్లోను ఈ బడులు పెట్టవచ్చును. డెన్మార్కులో ఎవళ్లవృత్తి వాళ్లకు నేర్పేఏర్పాటుకూడా ఉంది. ఈబళ్ళల్లో (Folk hock Schule) ఫోక్ హాక్ షూలె వయోజనులకు పాఠశాలల నేర్పాటుచేసేపద్ధతి మొదట డెన్మార్కులో, తరువాతనే జర్మనీలోగాని, ఇంగ్లండులోగాని ఇతర పాశ్చాత్యదేశాల్లోగాని ఆరంభమయింది.

1879 సంవత్సరమున ఇటువంటి పాఠశాలలకు ప్రారంభోత్సవంచేశారు జర్మనులు. తదాది ఈ బడులసంఖ్య దినదినాభివృద్ధి చెందింది. ఇటువంటిపాఠశాలలు లేని గ్రామాలులేవు. డెన్మార్కులోవలె వ్యవసాయవిద్య ఎక్కువగా చెప్పుతారు ఇక్కడకూడ. డెన్మార్కు మొ॥ దేశాల్లోని Continuation Schools లేక Folk Schools లో వలె ఇక్కడకూడ నిర్బంధముగ 14 సంవత్సరములకు 17 సంవత్సరములకు మధ్యనున్నవారీ బడులకు పోయి తీరవలెను— తక్కినవారికినిర్బంధములేదు. వారికి ఐచ్ఛికము.

పట్టణములలోని బడులు వివిధములు. కొన్ని క్లబ్బులుగా అనేకములయిన సౌకర్యములు కలిగి ఉంటవి. చాలమట్టుకు ప్రయివేటు పాఠశాలలుగాఉంటవి. క్లబ్బులుగా ఉండేపాఠశాలలకు యూగెండేషైమ్ (yugendsheim) అనగా "యౌవనులగృహములు" అని పేరు. ఫ్యాక్టొరీలలో పనిచేసే యౌవనుల కీపాఠశాలాధికారులు వివాహాలుచేసి పయి వసతిగృహములలో వసతులిచ్చి సాయంత్రము ఉపన్యాసాలిస్తారు. మంచిమంచి బోధలుచేసి సన్మార్గులుగా చేస్తారు. వారు విద్యాభివృద్ధి చేసికొని చక్కని గేస్తులవుతారు. బెర్లినుపట్టణములో ఇల్లాంటి ప్రయివేటుసంఘములు ఆరున్నొక్కటిఉన్నవి. ఆపట్టణము ప్రజలసంఖ్య 20 లక్షల పయిబడిఉంది. ఈపాఠశాల పరిపాలనానిర్మాణ మిట్టిది. సంఘమునకు సంవత్సరమునకు 2 షిల్లింగులు చెల్లించేవారు సభ్యులు—వారిచే ఎన్నుకొనబడిన పరిపాలకవర్గ సంఘము యాజమాన్యము వహిస్తుంది. చిన్న, పెద్దసంఘములు సాలుకు 15 షిల్లింగులు 20 షిల్లింగులు చెల్లించుకొని సభ్యులవవచ్చును. ఈసంఘమునకు బెర్లినుమ్యునిసిపాలిటీవారు మొత్తముఖర్చులో 100 కి నాలుగుచొప్పున విరాళములిచ్చి పోషిస్తారు.

ఖర్చులో నూటికి రెండువంతులు చందాలు వసూలవుతాయి నూటికి 94 వంతుల ఖర్చు సభ్యులచందాలవల్లను, విద్యార్థుల జీతములవల్లను వసూలవుతుంది. బెర్లిను పురపాలకసంఘమువారు తమ పాఠశాలాగృహములను, దీపములఖర్చు, సిబ్బందిఖర్చు ఉచితముగా ఇస్తారు. ఈపాఠశాలలు మ్యునిసిపలుపాఠశాల ప్రధానోపాధ్యాయుల తణిఖీలో ఉంటాయి. ఆహెడ్మాష్టరులే ప్రొద్దస్తమును తమపిల్లలకు పాఠాలుచెప్పుకొని సాయంకాలసమయాల్లో ఇక్కడ ఉపన్యాసాలిస్తారు. ఈ సంఘమునడిపే బడులలో 20,545 విద్యార్థులు చదువుకొంటున్నారు. యుద్ధసమయములలో కూడ ఈబడులకు పోయేవాళ్ళసంఖ్య ఎక్కువగానే ఉండేడిది. ఈసంఘమువారు సమర్థులైనవారిని విశ్వవిద్యాలయాధ్యాపకవర్గమునుంచి, ఉన్నత పాఠశాలోపాధ్యాయులనుండి ఎన్ని వారి పాఠశాలలలో ఉపాధ్యాయులుగా నియమించేవారు. వ్యవసాయవిద్య, వాణిజ్యవిద్య, కార్మికవిద్యకు తగిన కృషికులు వర్తకులు, ఇంజనీయర్లు ఉపాధ్యాయులుగ ఉండేవారు.

ఈ పాఠశాలల కీ క్రిందివయస్సులవారు ఆ యా వృత్తులవారు విద్యార్థులుగా ఉన్నారు.

| | | |
|---|---|---|
| 20 ఏళ్ళ లోపువారు 100 కి 13 గురు | దుకాణాలమీద ఫ్యాక్టొరీలమీద పనిచేసేవారు | 51 . 8% |
| 21 నుండి 30 ఏళ్ళవారు 100 కి 41 మంది | ప్రభుత్వోద్యోగులు | 14 . 4% |
| 31 నుండి 40 ఏళ్ళవారు 100 కి 23 మంది | కూలివాళ్ళు | 11 . 6% |
| | ఇంజనీర్లు 6% సామాన్యవృత్తులవారు | 6% |
| | ఉపాధ్యాయులు | 10 . 2% |

ఈ పాఠశాలలలో పరీక్షలుచేసి కావలసినవారికి సర్టిఫికేట్లు ఇస్తారు. ఉన్నతపాఠశాలాపరీక్షకు పోదలచినవారికి ప్రయివేటుగా చదువుచెప్పుతారు ఇక్కడి ఉపాధ్యాయులు. విద్యాశాఖమంత్రి ప్రత్యేకముగ "తెలివితేటలపరీక్ష" అనేదానిని ఏర్పాటుచేస్తాడు— ఈపరీక్ష అక్కడి "అబిట్యూరియెంటెన్‌పరీక్షకు" సమానము. ఈ ప్రయివేటువిద్యార్థులకు ప్రతి శనివారముకూడ పరీక్షలుజరుగుతూ ఉంటాయి. అబిట్యూరియెంటెన్ పరీక్షప్యాసయినవారు వాణిజ్యకళాశాల ప్రవేశార్హులు.

ఇంగ్లండులో ఈఉద్యమము University Extension Lecturs గా ఆరంభించారు. విశ్వవిద్యాలయాలలోని పండితులు తమ పరిశోధనాఫలితాలను పాండిత్యమును పామరులకుకూడ పంచియిచ్చుటకు ఈపద్ధతి ఏర్పడినది. ఈపద్ధతిని 1871 సంవత్సరమున కేంబ్రిడ్జిలో ఆరంభించినారు. దానిని ఇతర విశ్వవిద్యాలయాలవారు అనుకరించ మొదలెట్టారు. క్రమాభివృద్ధి జరిగి అన్నిచోట్ల ఈ పద్ధతి అమలులోఉంది. ఎక్కువగా కార్మికులు కర్షకులు ఉండే పట్టణాలలో ఈప్రచారము బాగా జరుగుతోంది. విశ్వవిద్యాలయాల్లో విద్యార్థుల సంఖ్య నెక్కువ చేర్చుకోవడమువల్ల విద్యలో అభివృద్ధి కనబడదనిన్నీ అక్కడి ప్రొఫెసర్లు తమ అభిమానవిషయాలను ప్రజలలో ప్రబోధించిననాడే వాని ప్రయోజన మధికమగుననిన్నీ హోల్డెనుగారి అభిప్రాయము— ఆవిధంగానే విశ్వవిద్యాలయములవారు జరుపుతున్నారు. అట్లే భారతదేశములోకూడ విశ్వవిద్యాలయాలవల్ల ఈపని జరుగునని పలువుర ఆశయాలుకాని ఎక్కువ ఆశాజనకముగ అదిలేదు. ఇప్పుడు సి. ఆర్. రెడ్డిగారి అభిప్రాయమిట్లే 'వయోజనవిద్య వ్యాప్తి చేయవచ్చునని. స్వీడన్, నార్వే మొదలగు దేశాలవారుకూడ ప్రస్తుతము స్కూళ్ళ అభివృద్ధికి పాటుపడుతూన్నారు. ప్రభుత్వములు వీటిని పోషిస్తూఉన్నాయి.

## హిందూదేశం

మనదేశములో విద్యాభివృద్ధికి కారణభూతాలయిన వయోజన విద్యావ్యాప్తి పాఠశాలలుగాని, గ్రంథాలయోద్యమముగాని అంతగా అభివృద్ధి చెందలేదు. వేదకాలమునుండి విదేశప్రభుత్వము వచ్చేవరకు గ్రంథాలయోద్యమము ఆదరింపబడేటట్లే వేదాధికారములేనివారికి మన పండితులు తమ పాండిత్యాన్ని పురాణాలవల్ల, భాగవతులు నాటకాలవల్ల, పాటగాళ్లు తమపాటలవల్ల, తత్వాలవల్ల,

పగటివేషాలవల్ల బోధచేస్తూ విజ్ఞానవంతులను చేసేవారు. పాశ్చాత్యపరిపాలనలో పైవానికి ఆదరణలేక పోవడంవల్ల విద్యావ్యాప్తి అరికట్టింది. మెకాలే కాలంలో 100 కి 5 గురు చదువుకొనేవాళ్లుంటే ఇప్పటికి 9.4% చదువుకొనే వాళ్ళసంఖ్య పెంచామని ప్రగల్భాలు చెప్పుతారు ప్రభుత్వం. ఇతర దేశాలలో చదువుకొన్నవారి సంఖ్యచూస్తే ఎంత అడుగునఉన్నామో తెలుస్తుంది. గ్రంథాలయాలకు గ్రాంటులులేవు. వయోజనవిద్య సంస్థలకు విరాళాలులేవు. ఎల్లా అభివృద్ధిఅవుతుంది విద్యనేర్చిన వారిసంఖ్య ? మెకాలె పైగా విద్యార్థులను సంస్కృతపద్ధతివిద్య నడుగంటించి కొద్దిగా తయారు చేస్తే వాళ్ళవల్ల పాశ్చాత్యవిద్య వ్యాప్తి అవుతుందన్నాడు. (Filteration theory) వడపోతపద్ధతి అంటారు దీన్నే. కాని గోపాలకృష్ణగోఖలే వంటివాళ్లుమాత్రము ఈ సమస్యలనుగూర్చి శ్రమ తీసుకోక పోలేదు. Besant Home Rule League రోజుల్లో గ్రంథాలయాలకి కాస్తఆదరణ ఎల్లాకలిగిందో అల్లాగే గోఖలేకాలంలో వయోజనవిద్యా సమస్య, నిర్బంధ ప్రాథమికవిద్యా సమస్య లేవదీయ బడ్డాయి. ఆ మహానుభావుడు అస్సెంబ్లీలో ఇటువంటి తీర్మానాలను ప్యాసుచేయించాడు. కాని ఆచరణలోపెట్టి ఉద్యమాన్ని అభివృద్ధిచేయడానికి ప్రభుత్వము ప్రజలుకూడ తోడ్పడాలి.

ఈవిధంగా ప్రభుత్వమువారు తోడ్పడినసంస్థలు ఇండియాలోకల్లా బరోడాసంస్థానమె మొదటిది. గ్రంథాలయోద్యమానికీ వయోజనవిద్యకు ఆ మహారాజు ఖర్చుపెట్టినంత ఎవరును ఖర్చుపెట్టలేదు. అమెరికానుండి ప్రవీణులను తెప్పించి గ్రంథాలయోద్యమాభివృద్ధికి తోడ్పడి సంచార గ్రంథాలయములను స్థాపించి, జిల్లా, తాలూకా గ్రంథాలయములను పెట్టి ఇతరప్రోత్సాహ కరములయిన పనులనుచేసి అనేకులను విద్యనేర్చునట్లు చేసినాడు. అట్లే వయోజన విద్యావ్యాప్తికి తోడ్పడెను. నిర్బంధప్రాథమిక విద్య జయప్రదంగా సాగించుచున్నాడు. అతడే విద్వత్ప్రభువనదగును. సాండూరు (Sandur) ప్రభువుకూడ తనసంస్థానంలో వయోజనవిద్యను నిర్బంధము చేస్తున్నానని మొన్న ఆమధ్య ప్రచురము చేశాడు. ఇతరసంస్థానాల్లో అంతకంతే.

## వివిధరాష్ట్రాలు

ఇక మనరాష్ట్రములలో ఈపని ఎంతవరకు జరుగుతున్నదీ విచారిద్దాం. అన్ని మతసాంఘిక రాజకీయ ఉద్యమాలతోపాటు విద్యా వ్యాపనవిషయంలోకూడ బెంగాలురాష్ట్రానిదే మొదటి ప్రయత్నము. అక్కడగల గ్రామ సబురిజిస్ట్రారులను వాళ్ళకుగల తీరికకాలములలో వయోజన విద్యావ్యాప్తికి నియమించారు. వయోజనులకు నిత్యజీవనంలో కావలసిన విజ్ఞానాన్ని బోధిస్తారు. కర్షకులకు కార్మికులకు కావలసిన విషయములను ఉపన్యసిస్తారు. ఆరోగ్యము, వృత్తులకు కావలసినచదువు, సహకారమును గూర్చి, లోకజ్ఞానము, పశుపాలన, వాణిజ్యాదులనుగూర్చిన విషయము లెక్కువగ ఉంటాయి. దినపత్రికలను చదివి లోకవార్తలను తెల్పుడుచేస్తారు. ఏ శాఖలోఉండే ఉద్యోగులు ఆయాశాఖల ఉపయోగమును ప్రజలేవిధముగ గ్రహించవలెనో, తమనుండి ఎట్లు పనిగొనవలెనో తెల్పుచు వానిని గూర్చి ఉపన్యసిస్తారు. మాజిక్‌లాంతర్ల సహాయంతో ఉచితంగా 1939 అక్టోబరులో అమృతబజారు పత్రికా సంపాదకులు గ్రామాలకు వెళ్ళి వయోజన విద్యావ్యాప్తికి పూనుకున్న వంద వంగయువకుల నుద్బోధించి పంపారు. అక్కడనున్న Calcutta University Institute of Adult Education Committee వారిచే ఈ పైసభ ఘోషుగారి అధ్యక్షతను ఏర్పాటు చేయబడెను. ఇట్లే యువకుల నెన్ని పంపి, ప్రబోధము చేయించి, తరగతుల నేర్పాటుచేయించి ప్రొఫెసర్ల సాయమున దీన్ని నిర్విఘ్నముగా కొనసాగిస్తోందీ కలకత్తా విశ్వవిద్యాలయమందలి ఈ ఉపసంఘము.

పంజాబు విద్యామంత్రిగారగు మియాన్ అబ్దుల్ హైగారు ఈ సమస్య పట్ల శ్రద్ధవహించి ముల్తాన్ జిల్లా మాక్దుంలషీద్ మున్నగుచోట్ల ప్రబోధములు చేసి ముల్తాన్ జైళ్ళలో వారియందలి నిరక్షరాస్యతను నిర్మూలించుటకు కృషిచేయుచున్నారు.

సంయుక్తరాష్ట్రంలోని స్కీము ఉత్తమమైనది. రాష్ట్రంలోని స్థానికసంస్థల పోషణలోనున్న లక్షమంది ఉపాధ్యాయులను వారి వారి గ్రామములలో వయోజనవిద్యావ్యాప్తి చేయవలసినదిగా ఆయా స్థానికసంస్థలద్వారా తాఖీదులుపంపి, ప్రతిఫలము మట్టుచెప్పడం వారు చూపే శ్రద్ధమీద, తయారుచేసే అక్షరాస్యుల సంఖ్యమీద ఆధారపడి ఉంటుందని, స్పర్థతో పనిచేసేందుకు పాఠశాలోపాధ్యాయుల ప్రోత్సాహపెట్టారు. ఇతరులు గౌరవోద్యోగులుగా దీనిలో పనిచేసి, 1 అక్షరాస్యుని తయారుచేస్తే రు 1 ఇస్తామన్నారు. 1939 సంవత్సరపు బడ్జెటులో 2½ లక్షలు వయోజనవిద్యకొఱకు ప్రత్యేకించారు. ఈ ఉద్యమాన్ని నడిపేటందుకు యన్. యన్. చతుర్వేదిఅనే ఆయన ప్రత్యేకోద్యోగిగ నియమింపబడ్డాడు. గ్రామాల్లో 750 సంచార గ్రంథాలయాలు 3600 పఠన మందిరాలు ప్రారంభించి అందులో 1 హిందీ 1 ఉర్దూ వారపత్రికలు, మరికొన్ని సంచికలు పఠనాలయానికిగా 2000 పుస్తకాలు గ్రంథాలయానికి ఇవ్వడానికి ఏర్పాటు— జనసామాన్యంలో 'పుస్తకాలు విరివిగా చదవండి' అని ఉన్న కరపత్రాలు పంచుతున్నారు. పోష్టరుకమిటీపెట్టి ఉత్తమ జీవితపద్ధతి, విద్యాప్రచారము గావించే పోష్టర్లు తయారు చేయిస్తున్నారు. సులభమయిన ప్రజాభాషలో పుస్తకాలు వ్రాయించి బహుమానాలు ఇస్తున్నారు. 1000 రామాయణ ప్రతులను పదిఏళ్ళవరకు ఇవ్వడానికి ఛటారినవాబు వాగ్దానం చేశాడు. ఉర్దూశతకాలు పంచిపెట్టారు. ఈవిధంగా ప్రభుత్వము, విద్యాధికులు, నవాబులు ఈ ఉద్యమానికి ప్రోత్సాహమిస్తున్నారు.

సింధులో 1500 వయోజన పాఠశాలలు పెట్టగా 1000 ఉపాధ్యాయులు స్వచ్ఛంద సేవకోద్యోగులుగా చేరారు. రాత్రిపాఠశాలకు 10000 పలకలు 20000 పుస్తకాలు 20 వేల లాంతర్లు సప్లయి చేశారు. గవర్నమెంటు ఆఫీసులలో నిరక్షరాస్యు లందరు 6 నెలలలో అక్షరాస్యు లవాలని, జైళ్ళ డైరక్టరులకు, పోలీసు సూపరెండెంటులకు వారివద్దనున్న నిరక్షరాస్యులను అక్షరాస్యులనుగా 6 నెలలో చేయాలని కోరబడ్డారు. స్థానికసంస్థలు సాయంచేశాయి.

మధ్యరాష్ట్ర బీరారు రాష్ట్రాల ప్రభుత్వమువారు స్థానికసంస్థల తోడ్పాటుతో వయోజనపాఠశాలల నేర్పాటుచేశారు. వేసవి వర్షాకాలములలో ఒక 5 నెలలు ఈ పాఠశాలలు పనిచేయవు. డిప్యూటీ ఇన్స్పెక్టరు సిఫార్సుపై ప్రభుత్వవిరాళాలు ఆధారపడి ఉన్నాయి.

ఒరిస్సా ప్రభుత్వము, విద్యాశాఖమంత్రి అధ్వర్యమున రాష్ట్రీయ విద్యాకమిటీ ఏర్పాటయి అక్షరాస్యతా ప్రచారమునుగూర్చి చర్చించి కేంద్రములను స్థాపించి పుస్తకాలకు, పలకలకు, లైట్లకు, పత్రికలకు విరాళముల ప్రభుత్వము ఇచ్చారు. ప్రత్యేక ఉద్యోగి కలడు. లైబ్రరీలపెట్టే ఆలోచన ఉంది. 1939 అక్టోబరు 5 వ తేదీన అఖిల ఉత్కళ నిరక్షరాస్య దినమును జరిపి ప్రదర్శనములు గావించి సభలు జేసి ప్రచారముల చేశారు.

అస్సాంలో కాంగ్రెసు కోయలిషనుపార్టీ ఉపసంఘము కొన్ని సూచనలలో ప్రతి సబ్ డివిజన్ లోను కేంద్రములుపెట్టి వయోజన విద్యాప్రచారమునకు తీర్మానించిరి. అస్సాంప్రభుత్వము దానిని 1940 లో ఆచరణలోపెట్టారు.

బొంబాయిరాష్ట్రములో వయోజన విద్యావ్యాపనకు త్రైవార్షిక ప్రణాళిక కావాలని ప్రభుత్వము వారు స్థానికరాష్ట్ర సంఘములను కోరినారు. విద్యార్థులు గుజరాతులోకూడి ఇందుకై శ్రద్ధచేయాలని తీర్మానాలను చేశారు. ప్రభుత్వము బొంబాయినగరమునకు అక్షరాస్యత ఉద్యమతణిఖీదారు నేర్పాటుచేశారు. 16 రోజులలో 10 వేలమందికి సులభశైలి పుస్తకాలు పెట్టించారు. (నిరక్షరాస్యత అసలు పుట్టకుండచేయవచ్చునని రాష్ట్రీయసంఘము కార్యదర్శి పట్టుదల) వీరిలో మధ్యవయస్సువారు, ముసలివారు ఉన్నారు. భయ్యాకులస్థు లెక్కువ. ప్రభుత్వము గ్రంథాలయోద్యమాభివృద్ధికి 50 వేల రూపాయల వాగ్దానముచేసింది. సర్. సి. వి. మెహతాగారు గుజరాతుగ్రంథాలయోద్యమానికి పది

వేలరూపాయల విరాళమిచ్చారు. బొంబాయి ప్రభుత్వము, బీహారుప్రభుత్వము సుమారు మూడు సంవత్సరములుగా ఈ వయోజనవిద్యావ్యాప్తికి అమోఘంగా చేస్తున్నపనిచూస్తే ఆశ్చర్యచకితులయి యితరరాష్ట్రాలవారంతా వారిని అనుకరించవలసినదే.

బీహారు విద్యాశాఖమంత్రి మహమ్మద్ సయ్యద్ సాహేబుగారిదే అగ్రస్థానము ఈఉద్యమములో. వారి నిరంతర సేవాపరాయణత్వమువల్ల ఆ రాష్ట్రములో విద్యలేనివారు అరుదు. బి. జి. ఖేరుగారు (బొంబాయి మంత్రి) కూడ మహమ్మద్‌గారి సైదోడే— బీహారు విద్యాశాఖమంత్రి ప్రోత్సాహముతో ఉపాధ్యాయులు, విద్యార్థులు ఇందుకు నడుముకట్టారు. 1938 ఏప్రియల్ 28 ప్రారంభించి ఎన్నో కేంద్రాలు పెట్టి పుస్తకాలు, ఛార్టులు, ధర్మంగా సప్లయిచేశారు. స్థానికసంస్థలు ఆగంతుక వ్యయాలను, ప్రభుత్వం 80 వేల రూపాయలు, పౌరసంఘాలు తమ పరిశ్రమను ఇందుకు సమర్పించాయి. ప్రత్యేకఉద్యోగికి సాయముచేయుటకు విద్యాశాఖోద్యోగులు నియమింపబడ్డారు. 5 నెలలలో 3 లక్షలు అక్షరాస్యులయినారు. హరిజనులలో 100 కి 30 మంది, మహమ్మదీయులు 100 కి 20 మంది, స్త్రీలు అక్షరాస్యులయేటట్టు చేస్తే మాసానికి రు 10000 లు ఇస్తామన్నారు. జైళ్ళలో ఈఉద్యమం అభివృద్ధిచెందుతున్నది. గ్రంథాలయాలు, పఠనాలయాలు పెట్టి ప్రతివ్యక్తి నుండి చందాలున్ను ప్రభుత్వం 2 లక్షలు గ్రాంటుయిచ్చారని దీనిఫలితంగా 6 లక్షలకు అక్షరజ్ఞానం కలిగినట్టు తెలుస్తోంది.

మద్రాసులో గ్రంథాలయోద్యమానికి వయోజనవిద్యావ్యాప్తికి చక్కనికృషి జరిగినరోజులు కొన్ని ఉన్నాయి. అప్పట్లో గ్రంథాలయోద్యమానికి సాలుకు 50 వేల విరాళము లిచ్చారు. 20, 17, 10, 5 వేలలోకి కృశించి ఇప్పుడది పూజ్యమయినది. ఆరోజులు 1920 ప్రాంతమువి. 1923 ప్రాంతములో మద్రాసు విశ్వవిద్యాలయమువారు వయోజన విద్యావ్యాప్తికి కొన్ని Extension-lectures ఏర్పాటుచేశారు. కేంబ్రిడ్జి మొ॥ చోట్ల ఇట్టి పద్ధతే ఉన్నది. కేంబ్రిడ్జి విద్యార్థి కట్ట మంచివారి పాలనలోకూడ ఆంధ్రవిశ్వవిద్యాలయ మీపనికి పూనినది. ఈ ఉపన్యాసాలు కొన్ని కొన్ని పట్టణాల్లోను పెద్దగ్రామాల్లోను ఏర్పాటులు అవుతవి. ఈ ఉపన్యాసాలవల్ల ఉపయోగము బహు తక్కువని చెప్పవచ్చును. కాలేజి లెక్చరర్లను పిల్లలను తీసికొని సెలవులలో గ్రామాలకుపోయి అక్కడ ఉపన్యాసాలిచ్చిన కొంతమంది పని జరపవచ్చునుకాని ఆమాత్రపువారు మేష్టర్లలో లేరు. విద్యార్థుల లోను మృగ్యమే. కాని విద్యార్థిసంఘాలు ప్రస్తుతము పనికిపూనుకొనుట ముదావహము.

మన రాష్ట్రీయప్రభుత్వ మీ విషయములలో చేసిన ఉపకారము సున్న. సి. రాజగోపాలాచారి, ఎ. కాళేశ్వరరావుగారలు వయోజనవిద్య కుపకరించే గ్రంథాలువ్రాశారు కాని స్థానికసంస్థలే ఎక్కువ సాయముచేయగలవనే సమాధానాలతో కాలక్షేపంచేశారు. ప్రభుత్వంమాత్రము కొన్ని ట్రెయినింగు పాఠశాలలలో రాత్రిళ్ళు ఈ పాఠశాలలు పెట్టించి పనిచేయుచున్నది. కొందరు దేశోపకారపారీణులు సొంతముగ పెట్టినీన్ని కొన్ని సంస్థల యాజమాన్యమున వీనినిజరిపినీన్ని కొన్నిగ్రంథాలయములు వీనినినడిపినీన్ని పుణ్యము కట్టుకుంటున్నాయి. ఆంధ్రదేశములో ఈ ఉద్యమప్రచారము విషయములో ఎక్కువగా పనిజరిగింది. శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి అధ్యక్షతను చాగల్లులో ఆంధ్రదేశ వయోజన విద్యాసభ సమావేశమై సంఘ మేర్పరచబడింది. తాడేపల్లిగూడెంలో గ్రామపునర్నిర్మాణ పాఠశాలలు, నిడుబ్రోలు వగైరాచోట్ల వసంత విద్యాలయాలు ప్రారంభింపబడి పనిచేసినవి. ప్రత్యేకవ్యక్తులు తమ సరళమైన రచనలచేత, సుబోధకములయిన ఉపన్యాసములచేత సేవచేయుచు విద్యావ్యాప్తి చేస్తున్నారు. మద్రాసు వై. యం. సి. ఎ., మద్రాసు, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘములు — రెండవదాని శాఖలు మ్యాజికులాంతర్లతో నైతిక, సాంఘిక, చారిత్రక, రాజకీయ, ఆర్థిక, ఆరోగ్య, మతవిషయాదులపై సుబోధములు చేస్తున్నారు. మద్రాసులో అమ్ముస్వామినాథన్ సతివంటివాళ్ళు అక్కడ సభలుపెట్టించారు.

## తెలిసికోదగ్గ కొన్ని సంగతులు

1938 సంవత్సరములో మనదేశంలో వయోజన విద్యాసంఘము స్థాపనజరిగినది. ఈ హిందూదేశ వయోజన విద్యాసంఘము (Indian Adult Education Association) కొన్ని దేశాభ్యుదయకరములైన కార్యములకు పూనుకొన్నది. ధనముకొరకు ప్రయత్నములు జరుగుతున్నాయి. దేశస్థులకు చదువను వ్రాయను నేర్పటానికిన్నీ, వ్యవసాయాది విషయముల బోధించుటకున్ను జరుగుతున్న కృషిలో ముఖ్యమైనది రేడియోద్వారా వ్యవసాయ ప్రసంగముల నేర్పాటుచేయుట. ఇప్పుడు మద్రాసు రేడియోలో అనుదినము అర్ధగంట వ్యవసాయపద్ధతులపై ప్రసంగం జరుగుతుంది. ఇటువంటి ఉపయోగకరములైన ప్రసంగములు ప్రతిరేడియో స్టేషనునుండి పంపబడుటకు యత్నిస్తున్నారు.

జర్మనీదేశంలోని సంవత్సరంలో అయిదునెలలు, నాలుగునెలలు ఈ పాఠశాలలు పనిచేస్తాయి. అల్లాగే మనదేశంలో ఊడ్పులు, కోతలు, కుప్పనూర్పులు మొదలగువాటికి 6 నెలలు మినహాయించి తతిమ్మ అర్ధసంవత్సరములో ఈపాఠశాలలు ముమ్మరంగా పని చేసేటట్లు ప్రజలు ప్రభుత్వం తలుచుకోవాలి. వీరాళాలుఇచ్చి వృద్ధిచేయవలసినది ప్రభుత్వము. దాని ఉపయోగాన్ని గుర్తించి బద్ధకించకుండా చదువునేర్చుకొని యథాశక్తిగ చందాలిచ్చి ఆదరించవలసినది ప్రజాసంఘము.

వేరేపాఠశాలలు స్థాపించబడనక్కరలేదు. గ్రంథాలయములను, గ్రామపాఠశాలలను దీనికుపయోగించి వేతనమిచ్చిన గ్రంథభాండారులను, ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులను, ఈ పాఠశాలలలో పనికూడ చూడమనవచ్చును. జర్మనీలో ఇట్లే పాలింపబడుచున్నవి. పరిస్థితులనుబట్టి స్వల్పవేతనముల నిచ్చుటమేలు.

జర్మనీ, డెన్మార్కు మున్నగుదేశములలో అవలంబింపబడుతూన్న పద్ధతి మనకును అవశ్యాచరణీయము. వారు సామాన్యవిద్య నేర్పి ఏదో ఒకవృత్తి విద్య పారిశ్రామిక విద్య నేర్పుతారు. అల్లాగే మనము ప్రణాళికలను ఏర్పాటుచేసికోవచ్చును. ఈప్రణాళిక గాంధిగారి వార్ధావిధానానికి సన్నిహిత సంబంధి అవుతుందికూడ. ముఖ్యంగా వయోజనులకు మనస్తత్వమును గ్రహించి బోధించే ఉపాధ్యాయులు కావలెను. వారికి సులువుగా బోధించే పాఠ్యపుస్తకములు, పరికరములు, ప్రదర్శన సామానులు కావాలి. వయోజనులకు ఏమియు నొప్పికల్గించు మాటల ననకూడదు. విషయమును అనేక పర్యాయములు చెప్పరాదు. ఇట్టిపద్ధతులను పాటించి నడపిన మనదేశమున ఈ ఉద్యమము దిగ్విజయము కాకమానదు.

ఈమధ్య ఆంధ్రదేశగ్రంథాలయ సంఘమువారు 22వ ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభలో ఏర్పాటు చేసిన వయోజన మహాసభవల్లను, 1941 అగష్టు 24 వ తేదీని ప్రత్యేకముగా శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను మాజీ మద్రాసుమంత్రి డాక్టరు పి. సుబ్బరాయను గారిచే ప్రారంభింపబడిన ఆంధ్రదేశ వయోజనవిద్యా మహాసభవల్లను ఈ ఉద్యమమునందు ఆంధ్రులు ఎంత ఉత్సాహము శ్రద్ధాభక్తులు చూపుచున్నది విదితమగును. ఇంకను శ్రీ గోపరాజు రామచంద్రరావు, పాతూరి నాగభూషణం గార్లవంటి కొందఱు సంఘసేవా పరాయణులు వయోజనవిద్యాలయముల నేర్పాటుచేయించి, వయోజన విద్యామహాసభలను జరిపించి చేయుచున్న సేవ ప్రశంసనీయము. విద్యార్థిసంఘములీ విషయమై చూపుచున్న పూనిక చిరస్థాయియై ఉద్యమమునకు మేలు కలుగగలదనియు, ఈ విజ్ఞానవ్యాప్తి ప్రయత్నమునకు గొప్ప భవిష్యత్తు కలుగగలదనియు భావింపవచ్చును.

# వయోజనవిద్య : గ్రంథాలయములు *

జనసామాన్యములో విజ్ఞానవ్యాప్తిని గావించు సాధనములలో గ్రంథాలయములు ప్రధానస్థానము నాక్రమించుచున్నవి.

గ్రంథాలయములు రెండురకములు. తరతరాలుగా రాజాస్థానములయు, మఠాధిపతులయు గర్వమునకు కారణభూతమైనవి మొదటితరగతికి చెందినవి. వీని యాశయము పుస్తకముల సేకరించి భద్రపఱచుట. విజ్ఞానప్రచారమునకు పూను కొన్నవి రెండవతెగకు చెందినవి. పాశ్చాత్యనాగరకతాఫలితము లనదగు నేటి గ్రంథాలయములు అల్పారంభములు గలవయ్యు దినదినాభివృద్ధి నందుచు సాంఘిక జీవితమున కెంతయు నుపయోగపడుచున్నవి. వీనికి వయోజనవిద్యతో మిగుల సన్నిహితసంబంధము గలదు.

కాలగతి ననుసరించిన మార్పులలో గ్రామికజనముయొక్క విద్యాభిలాష యొకటి. ఇంగ్లాండు మొదలగుదేశములలో పారిశ్రామిక విప్లవఫలితముగ వ్యక్తి గత ఆర్థికస్వాతంత్ర్యసూత్రము బలపడి దీనితో శ్రమజీవులకు విద్యయొక్క ఆవశ్య కత గుర్తింపబడెను. ఈవిద్యను వారి కందుబాటులోనుంచుట కేర్పడినవే అచ్చటి సంచారగ్రంథాలయములు, చందాలపై నడుపబడిన పుస్తకాలయములు, కర్మ కరుల సమితులు మున్నగునవి. ఈవిధముగ ప్రజాసామాన్యముయొక్క విద్యాభి లాషా ఫలితముగ గ్రంథాలయము లేర్పడుటయేగాక వీని యభివృద్ధియు వారి అభి లాషయొక్క పెంపుమీదనే ఆధారపడియుండుటను ఆయాదేశముల చరిత్రలు చాటుచున్నవి.

కాన వయోజనవిద్యయొక్క మొదటిఫలితములలో గ్రంథాలయము లెట్లు ప్రధానమైనవో దీనినిబట్టి మనము గ్రహించగలము. ఇట్లు వయోజనవిద్యా ప్రచారసాధనముగా మొదట నేర్పడిన గ్రంథాలయములు క్రమముగ తమ యాశ యమును విస్తరించుకొనినవి. అచ్చులోనున్న అన్నిరకముల ప్రచురణములను సేక రించి సంఘములోని ప్రతియొక్కరి అవసరములను తీర్చుటకివి పూనినవి. నాగరక సంఘములో నేటి గ్రంథాలయములు బహుళముగను, విస్తారముగను ఉపకరించు చున్నవి. ఇవి సమస్త భౌతికవిద్యలకు, కళలకు సంబంధించిన ప్రాథమికవిజ్ఞానమును ప్రసాదించుటనుండి, మానవులకుండు అన్నిరకముల మనోరోగముల మాన్పు సమర్థ తను కలిగియున్నవి.

---

* ది మోడరన్ లైబ్రేరియన్ 11 వ సంపుటము 2 వ సంచికలోని సోహన్‌సింగుగారి వ్యాసము ననుసరించి వ్రాయబడినది.

వయోజన విద్యాప్రచారసాధనములలో గ్రంథాలయములు ప్రధానస్థాన మాక్రమించుచున్నను ఈ సాధనముల సంఖ్యయు క్రమముగ పెరిగినది. పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయములు పౌరవిద్యకు కొంత ప్రోత్సాహమును కలిగించుచున్నవి. ప్రజలలో వినోదము, విద్యావ్యాసంగము కలిగించునిమిత్త మేర్పడిన సినీమాలు, పత్రికలు, రేడియోలు, తమ తమ విధులనుగూర్చిన పునర్విచారణకు పూనుకొన్నవి. వస్తుప్రదర్శనశాలలు విద్యాసాధనములుగ తమ ధర్మము నెక్కువశ్రద్ధతో పరిపాలించుచున్నవి. అమెరికాలోని 'పబ్లిక్‌ఫోరము' లవంటి నూతన సాధనములును కొన్ని బయలుదేరినవి. గ్రంథాలయాశయములో కలిగినమార్పు, వయోజనవిద్యాప్రచారసాధనాల పెంపు గ్రంథాలయములకు వయోజనవిద్యకు గల సంబంధములో క్రొత్తమార్పుకు కారణమైనవి. అమెరికాలో గ్రంథాలయోద్యమము, వయోజన విద్యాప్రచారకార్యక్రమము— రెండును అమిత ధనవ్యయముతో పెంపొందినవి. క్రిందివిషయములు అమెరికనులు వయోజనవిద్యాప్రచారమునకై తమ గ్రంథాలయముల నెట్లుపయోగించిరో తెలుపగలవు.

వయోజనవిద్య యన నేమి? దీని యుద్దేశము లేవి? వీనిని గ్రంథాలయములెట్లు నెరవేర్చగలవు? అను విషయములగూర్చి ముందు విచారింతము. వయసుమీరిన వారికి కావలసిన విద్య వయోజనవిద్య. వీరికి పాఠశాలలలో పిల్లలకు చెప్పబడు చదువుకూడ ఒక్కొక్కప్పు డవసరమగును. దీని అవసరము మనదేశమున మిక్కుటముగ నున్నను నాగరక సంఘములోని మానవమాత్రులు తెలిసికోవలసిన సంగతులను గూర్చి మనము ముందు చర్చింతము. అప్పుడు వయోజనవిద్యయొక్క ఆదర్శము మనకు బోధపడగలదు. మనుజులు తమ సామాజికజీవనమును శక్తివంతముగ గడుపగలిగిన సమర్థత గలిగియుండు టవసరము. దీనికి మించినజ్ఞానము . వారి వృత్తికిగాని, అభిమాన విషయమునకుగాని సంబంధించిన దగును. ఇంతమాత్రము కూడ వారు తెలిసికొనకుండుట దురదృష్టమని చెప్పక తప్పదు.

సంఘజీవనమును సమర్థతతో గడుపుట కనువైన విద్యనుగూర్చియు దీనిని ప్రసాదించుటలో గ్రంథాలయములకు గల స్థానమునుగూర్చియు విచారింతము.

1. వ్రాత, చదువు, సామాన్యగణితము సమాజములోని ప్రతి మానవుడు మొదట నేర్వవలెను. వీనికి దూరుడగువాడు ఆధునిక నాగరకతాఫలితములను వేనినిగాని పొందజాలడు. ఈ వ్రాతచదువులు పసితనమున పాఠశాలలలో నేర్వవలసియుండును. ఈ అవకాశము నప్పుడు పొందియుండని పెద్దవారలకు ముందు వీనిని నేర్పుటవసరము. నిజమున కిది గ్రంథాలయ కార్యక్రమములోని భాగముగా నెంచబడకున్నను 100 కి 90 మందికి పైగా నిరక్షరాస్యులుగల మన దేశములో ఈపనిని రాత్రిపాఠశాలలద్వారాను, వయోజన పాఠశాలలమూలముననను సాగించక వీలు

లేదు. చాలకాలముగ ఆంధ్రదేశములోని గ్రంథాలయములు కొన్ని ఈపనిని నెరవేర్చుచునే యున్నవి. ఈవిషయమై యింతటితో నూరకున్నచో ప్రయోజనము లేదు. పిన్నలుగాని పెద్దలుగాని నేర్చిన వ్రాతచదువులు వాడుకలో లేనియెడల కొంత కాలమునకు మరల వారు పూర్వస్థితికివచ్చుట సంభవము. కాన వారు సాధించిన అక్షరాస్యతను నిలబెట్టుకొనుటకు నిరంతర గ్రంథపఠనము మిగుల నవసరము. దీనికి కావలసిన గ్రంథములను చౌకగను సులభముగను వారికందజేయుటకు గ్రంథాలయములు కావలెను. ఎవ్వరుగాని విడివిడిగా ప్రతి క్రొత్తపుస్తకమును కొనుటసాధ్యముకాదుగదా ! ప్రాతపుస్తకములే మరల మరల తిరుగవేయుటయు పొసగదు. నిరంతర పఠనములేకున్న కొంతకాలమునకు అక్షరాస్యులు సహితము నిరక్షరాస్యులగుదురు. కాన ఈచిక్కులను తొలగించుటకు ప్రతియొక్కరికి గ్రంథాలయ మందు బాటులో నుండవలయును.

2. తాను నివసించుభూమిని గూర్చిన జ్ఞానము- అనగా దేశభూగోళమును ప్రతి మనుజుడు నేర్వవలెను. పాఠశాలలలో బోధింపబడుటయేగాక, మన నిత్యజీవితములోను దేశ భూగోళవిషయములు తఱచుగ మనకు తెలియుచుండును. అయినను కాలానుసరణముగ కలుగు మార్పులతో పై విషయములలోను కొన్నిమార్పు లప్పుడప్పుడు కలుగుచుండును. వీనిని పత్రికలు మున్నగువానిద్వారా మనము తెలిసికొనగలము. నేటి సంఘములోని వయోజనులలో చాలభాగము ప్రస్తుతప్రణాళిక ననుసరించి పాఠశాలలలో చదివినవారు కానందునను, క్రొత్తగ అక్షరాస్యులగువారికిని ఈ భూగోళవిషయ మవసరము గనుకను, వీరి కిందునిమిత్తము కావలసిన పుస్తకములు మున్నగు పరికరముల నందజేయుచు గ్రంథాలయములు చాలగ తోడ్పడగలవు.

3. స్వజనమునుగూర్చిన జ్ఞానముకూడ విద్యయొక్క ప్రధానాశయములలో నొకటి. దీనిని మూడు భాగములుగ విడదీయవచ్చును.

(అ) దేశచరిత్ర:— దీనిని తెలిసికొనుటమూలమున మనుజులు సంకుచితమగు స్వార్థదృష్టినుండి విడివడి విశాలాశయములగు ఐకమత్యము, దేశభక్తి మున్నగు గుణముల నలవఱచుకొనగలరు.

(ఆ) సాంఘికజీవితమునకు పునాదులనదగిన వివిధసంస్థలను గూర్చిన విజ్ఞానము:— వీనిలో ప్రభుత్వమునకు సంబంధించిన విషయము ప్రధానమైనది. పౌరవిద్యయు వయోజనులు నేర్వదగిన అంశమే. దీనికి వారివయస్సు చాల అనుకూలమైనది.

(ఇ) ఆర్థికసంబంధములు:- సంఘముయొక్క ఆర్థికనిర్మాణము, ఇచ్చి పుచ్చుకొనుటలు మున్నుగాగల జీవితసమస్యలు పసివారల కర్థముగావు. ఇవి పెద్దవారి కవసరము. వీనిని వారు సులభముగ గ్రహించగలరు.

దేశచరిత్ర, రాజకీయార్థికములనుగూర్చి తెలియగోరువారలకు గ్రంథాలయము లెక్కువగ నుపకరించును. వీనికి సంబంధించిన వివిధసమస్యలను గూర్చి తెలియ గోరువారి కనుకూలమగు గ్రంథములను గ్రంథభాండాగారి సూచించును. ఇట్టి విజ్ఞానసముపార్జనమునకై పూనిన మతాలవారికి వివిధవిషయములకు సంబంధించిన పుస్తకముల జాబితాల ఆయావర్గముల కనుకూలముగ నీతడు సిద్ధపఱచును.

4. ప్రతిమానవునకు తన ఆరోగ్యమును, శక్తిని వృద్ధిచేసికొనుట కనుకూలమగు జ్ఞానము ముఖ్యముగ కావలెను. శరీరశాస్త్రము, ఆరోగ్యవిషయములతో పాటు వివాహము, శిశుశిక్షణకు సంబంధించిన విషయములు కూడ పెద్దవార లకు తెలిసియుండవలెను. ఇందు మొదటిరెండంశములను గూర్చిన ప్రాథమిక జ్ఞానము పాఠశాలలలో బోధింపబడుచున్నను కడపటి రెండువిషయములను గూర్చి తెలియగోరువారికి స్వయంపఠనమే శరణ్యము. ఇక ఈ స్వయంపఠన విధానమున గ్రంథాలయ ప్రాముఖ్యమును తిరిగితిరిగి చెప్పనక్కరలేదుగదా!

5. వృత్తికిసంబంధించిన జ్ఞానసముపార్జనమును విద్యయొక్క ప్రధానాశయము లలో నొకటి. ఇందువిషయమైన ప్రాథమికజ్ఞానమును నేర్పుటకు ప్రత్యేక పాఠ శాలలు, కళాశాలలు- వీనియందలి గ్రంథాలయములు తోడ్పడుచున్నవి. ఒకవృత్తికి సంబంధించిన ప్రాథమికజ్ఞానమును ప్రసాదించుటకంటె ఆయావృత్తుల వారు తమతమ పనుల నెక్కువ సమర్థతతో నిర్వహించునట్లు చేయుటలో నేటి గ్రంథాలయము లెంతయు నుపకరించును. అయితే వీనిలో ఆయావృత్తులకు సంబంధించిన గ్రంథములు పూర్తిగా నుండవలెను. నేటి ఆర్థికవిధాన కారణముగ తఱచు అనేకులకు సంభవించు నిరుద్యోగ బాధనుండి వారిని కాపాడుటయే గాక, నూతన వృత్తులలో వారిని ప్రవేశపెట్టుట కనుకూలమగు విజ్ఞానమును జనులకందిం చుటకై పాశ్చాత్య సీమలందలి గ్రంథాలయములు చేయు కృషి వర్ణనాతీతము.

గృహనిర్వాహకత్వము, శిశుపోషణ ప్రత్యేకము స్త్రీల విధులుగ పరిగణింప బడుచున్నవి. ఇంగ్లండు అమెరికాదేశము లందలి తల్లిదండ్రుల సంఘములు స్త్రీలకు పై విధులను గూర్చి బోధించుటకు పూనుకొన్నవి. ఇందు కీ సంఘముల వా రుపయోగించు సాధనములలో గ్రంథాలయములు ప్రధాన స్థానము నాక్ర మించుచున్నవి. అమెరికాలోని చాల గ్రంథాలయముల నీ సంఘములు గుర్తించి ఉపయోగించుకొనుచున్నవి.

6. నేటి నాగరకతకు ప్రధాన కారణమైన వైజ్ఞానికశాస్త్ర (సైన్సు) పరిచయము ప్రతి మనుజునకును అవసరము. ముఖ్యమగు వైజ్ఞానిక సిద్ధాంతములు, వాని యుపయోగ ప్రయోగములనుగూర్చి తెలుపుట వయోజనవిద్యలో నొక అంగము. వీనిప్రచారము విషయమై సినీమా రేడియోలతోపాటు పత్రికలు సహితము పని

చేయుచున్నవి. సైన్సుకు సంబంధించిన చదువదగిన ప్రచురణముల నన్నిటిని సేకరించి యుంచుట గ్రంథాలయముల పని. విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితములను ప్రజాసామాన్యమున కందుబాటులో నుంచుపనికి సమర్థులు పూనుచో వాని ప్రచారమును గ్రంథాలయములు సాగించును.

7. ప్రపంచభూగోళము, ప్రపంచ చరిత్రల పరిచయము నేడందఱజనుల కవసరమని వేరుగ చెప్పనక్కరలేదు. ఈ పరిచయమును కూలంకషముగ గలిగించుటకు గ్రంథాలయములు కృషిచేయవచ్చును.

పైన చెప్పిన ప్రయోజనముల పొందగోరు వ్యక్తులకు గ్రంథాలయము లెట్లు తోడ్పడునది తెలిసికొంటిమి. ఇప్పుడు వయోజనవిద్యా ప్రచారకుల కివి యెట్లుపయోగపడునో విచారింతము. దీనికిముందు నేటి గ్రంథాలయముయొక్క వ్యాప్తిని మనము గ్రహించవలెను. పెద్దపుస్తకములేగాక పత్రికలు, కరపత్రములు, చిన్న పుస్తకములు, వ్యాసముల కత్తిరింపులు, చిత్రరువులు, సినిమాఫిలిములు, గ్రామఫోనురికార్డులు మున్నగు సాధనములనన్నిటిని ఆధునిక గ్రంథాలయములు సేకరించి వీనిని ప్రచారములోనికి తెచ్చుచున్నవి.

గ్రంథాలయము లెచ్చటనున్నను వయోజనవిద్యను నేరుగ ప్రోత్సహించుటకై క్రిందివిధానము లుపకరించుచున్నవి.

1. వ్యక్తిగతసలహాలు: వివిధ విషయములనుగూర్చి తెలియగోరువారికి గ్రంథాలయములలో సలహానిచ్చు యేర్పాటొకటి. ఆ యా వ్యక్తుల అభిమానవిషయములకు సంబంధించిన గ్రంథాలయోపకరణముల జాబితాల తయారుచేయుట రెండవది. ఎక్కువ ప్రయోజనకరముగ నుండునిమిత్త మీ జాబితాలలో నుదహరింపబడిన గ్రంథములు మున్నగు పరికరములగూర్చిన వివరములుకూడ చేర్చబడును. గ్రంథాలయములలో గల పుస్తకములు మున్నగువానిని పాఠకుల యోగ్యతల కనుకూలించు క్రమమున వ్రాసియుంచుట మరొకటి.

2. వయోజన విద్యాప్రచార కార్యక్రమములో గ్రంథాలయము ప్రముఖపాత్రగ నున్నందున ఇందునిమిత్తము పనిచేయు అన్నిసంస్థల కార్యక్రమము నిది సమన్వయ పఱచగలదు. ఒక్కొక్కసమాజము లేక వర్గమునకు సంబంధించిన ఇట్టి సంస్థలసూచికను తయారుచేయుటయేగాక గ్రంథాలయములు వీని కార్యక్రమమును వెల్లడిపఱచుచు వీనికి సభ్యులను జేర్చుటకై తీవ్రమైన కృషి చేయవచ్చును.

3. గ్రంథాలయములు వయోజన విద్యాప్రచారకులతో సహకారము నెఱపుచు, వారి ఉద్యమపద్ధతుల నెఱుగుచు, తమకడనున్న వయోజన విద్యాప్రచార

మునకు పనికివచ్చు పరికరములనుగూర్చి వారికి తెలియజేయుచు, వీనిని బోధనా సమయమున వారుపయోగించు కొనునట్లు చెప్పుచు, తమ ప్రచారమున కనుకూలించు ఉచిత వాఙ్మయముయొక్క భోగట్టాను వారి కందజేయుచు వర్తిల్ల గలవు. మఱియు ప్రయోజనుల నిమిత్తమేర్పడు తరగతులలో వారికి తగిన గ్రంథము లనుగూర్చిన ఉపన్యాసములద్వారా గ్రంథభాండాగారులు నేరుగ వయోజనవిద్యా ప్రచారమున పాల్గొనవచ్చును.

4. వయోజనులలో విజ్ఞాన వ్యాపనము గావించుట కేర్పడు ఉపన్యాసములు, చర్చలు మున్నగువాని యేర్పాటుకు గ్రంథాయములు తమ భవనములలో తావు నొసంగవచ్చును. ఈ భవనములలో వయోజనవిద్యా ప్రచారక సంఘముల కార్య స్థానముల నుంచుటయు మేలే.

5. ఈడువచ్చిన ప్రతి యొక్కడును తన కనుకూలమగు వృత్తిని నిర్ణయించుకొని జీవయాత్ర గడపుటకు సాయపడు నిమిత్తము వివిధవృత్తులు— వానికిగల అవకాశ ములకు సంబంధించిన వాఙ్మయముయొక్క సూచికలను తయారుచేసి యుంచుట ఇతర దేశములందలి గ్రంథాలయములు చేయుచున్న పనియే.

మన మిప్పుడొక గొప్ప సంకటములో నున్నాము. నిరాశ, దుఃఖము మనల నావరించినవి. ఏమిచేయుటకును తోచని ఈ సమయములో సహితము నిశ్చయా త్ములు కొందఱు ఏదేని నొక కార్యమును నిర్వహింప జూచుచున్నారు. కాని పూర్వాచారములు వీరికి ప్రబలాటంకములుగ నున్నవి. నూతన విజ్ఞానముకొఱకు, ఒక వినూత్న సత్యముకొఱకు వీరు కృషిచేయుచున్నారు గాని ఇది వారి కెచ్చటను లభించుటలేదు. 'సమాధానము, సహనము, సహకారము'— ఇవి మానవకోటి కంతటికిని అవసరమని మహాపురుషుల యుపదేశము. మానవసంఘమునకు కావల సిన పై మూడు విషయముల నందరికి బోధచేయవలసిన విధి మనపై గలదు. ఈ విధిని నెఱవేర్చుటకై —జనులకు నూతన చైతన్యమును, నూతన విజ్ఞానమును ప్రసాదించుటకై గ్రంథాలయములు కృషిచేయవలసి యున్నది.

# పెద్దల చదువు

## శ్రీ వడ్లమూడి వేంకటరత్నము, ఉభయభాషాప్రవీణ

పెద్దల చదువు విషయమై యిప్పుడు మన దేశమున ఆందోళనము జరుగుచుండుట ప్రశంసార్హము. నూటికి తొంబదిమంది విద్యాగంధమెరుగని దేశ మభివృద్ధిచెందుట కలలోనివార్త. ఇపుడు పాఠశాలలలో చదువుచున్న విద్యార్థుల శాతమును తక్కువగా నుండుటకు పెద్దలచదువులేమియే ప్రధానకారణము. కనుక నేటి బాలబాలికలు విద్యావంతులగు పౌరులు కాగల్గుటకుగానీ, ప్రస్తుతము దేశము తనలోటుపాట్లను దిద్దుకొని, అభివృద్ధిమార్గమున పయనించి ఉన్నతిశిఖరము నధిగమించి కలకలలాడుచు విరాజిల్లుటకుగానీ పెద్దలు— తక్షణము– విద్యావంతులగుట అత్యావశ్యకము.

ఈ విద్యను మనము రెండుభాగములుగ విభజింపవచ్చును. చదువు వ్రాతలతో కూడిన మార్గమొకటి. చదువు వ్రాతలకు సంబంధములేని వినికిడిమార్గమొకటి. మనకీరెండుమార్గములును ప్రస్తుతమనుసరణీయములే యగుచున్నవి. మనము ఎంతప్రయత్నము చేసినను చదువు వ్రాతల కలవాటుపడలేని సామాన్యజనులు – ప్రస్తుత స్థితిగతులనుబట్టి— పెక్కురుందురని యూహించుట సాహసముకాదు. మరి వారిని ఊరక విడిచిపెట్టివేయవలసినదేనా? వారి విషయమై విద్యావంతులు, దేశసేవకులు నిర్వహింపవలసిన ధర్మము లేదా? ఉన్నది; లేకేమి? ఎంతయో యున్నది. వారికి చదువు వ్రాతలు తెలియకున్నను కొంత జ్ఞానమున్నది. ఉండకతప్పదు. పుస్తకములు చదువకున్నను, విశేషములగు భావములు లేకున్నను ప్రపంచమున నింతకాలము గడియించిన అనుభవపూర్వకమగు జ్ఞానము వారిని తమ భవిష్యత్కార్య నిర్వహణమునకు కొంతవర కర్హులుగా జేయుచున్నది. కాని, అది చాల మితముగా నుండుటచే సర్వమానవ సంఘమును తన సోదరులుగ, భారతదేశమును తన గృహసీమగ, విశాల ప్రపంచమును తన గ్రామముగ భావింపవలసిన నేటి కాలమున నది మిక్కిలి కొఱత యగుచున్నది. కనుక వారిని అధునాతన కాలమున కర్హులుగ జేయుటకు విద్యావంతులు చేయదగిన పని యనంతముగ నున్నది. వారికున్న ఆ స్వల్పజ్ఞానము, ధర్మమను పేరితో- ఆచార రూపముగ పాదుకొనియున్న సాంఘిక దోషములను దిద్దుకొని సంఘమును పుష్టిమంతముగ జేసికొని సుఖించుటకు చాలదు. తనకు సంబంధము లేదని తప్పించుకొని పోవుచున్న రాజకీయలోపములను సవరించుకొని తనకున్న యథార్థమగు అధికారమును చక్కగా నెఱపుటకు కొఱతయగును. తన కర్మమని భావించుచు దేవునిమీదనో, పూర్వజన్మము మీదనో భారమువైచి తా నష్టకష్టములు గుడుచుచుండు దారిద్ర్యమును తొలగించుటకు తాను చేపట్టవలసిన కర్తవ్యమును నిర్ణయించుకొనుటకు, దానిని లెస్సగ నిర్వహించుటకు పనికిరాదు. మతములను పేరితో తన్ను గట్టిగ కట్టివైచుచున్న పాశములను త్రెంచుకొని స్వతంత్రముగ ఒక్కసారి ఉచ్ఛ్వాసనిశ్వాసములు జరుపుకొనుటకు తక్కువయగును. ఇంతయేల! తాను మనసార ప్రేమించు ప్రియకామిని, తనరక్తమును జీవిత సర్వస్వమును ఒడ్డి తనప్రాణములకు ప్రాణములుగా చూచుకొనుచుండు ముద్దుబిడ్డలు, ఆరోగ్యముగ చిరకాలము జీవింపవలయునని యెంత వాంఛించుచున్నను ఆ మార్గమునైన బాగుగ నెఱుంగుటకు చాల వెనుకపడును. ఇట్లే ఆతడనుభవింపవలసిన సుఖములకుగానీ, ఆతడాచరింపవలసిన ధర్మములకు గానీ ఆస్వల్పజ్ఞానము సహాయము చేయలేదు. కనుక అట్టివారి నెల్లరను విజ్ఞానవంతులుగా జేయుటకు విజ్ఞానులు ప్రయత్నింపవలసియున్నది. ప్రతివాడును తనశక్తికొలది చేయూత నీయవలసియున్నది. ఇదియంతయు చదువులోనిదేగాని దానికి భిన్నముగాదు. ఇందులకు ఏయే విషయములను బోధింపవలయును అనుట ఈ వ్యాసప్రధానోద్దేశము గాదు; కాని యీ విషయముల నొకకొంత తెలిసికొనుటకు శ్రీయుతులు శనివారపు సుబ్బారావుగారు వ్రాసిన 'వయోజనవిద్య' అను చిన్నిపుస్తకములు కొంతవఱకు తోడ్పడగలవని చెప్పుట అప్రస్తుతము

గాదు. వాని సహాయమున మన శక్తి సామర్థ్యముల ననుసరించి, పరిస్థితుల ననుసరించి మనమొక పాఠ్యక్రమము నేర్పఱచుకొనవచ్చును. దాని నవలంబింపవచ్చును. దీనికి తోడుగ చిరకాలమునుండి మన కాచారముగ వచ్చుచున్న పురాణ పఠనము, హరికథా కాలక్షేపము, వీథినాటకములు, బొమ్మలాటలు, వీరగాథలు మొదలగు జాతీయ పద్ధతులను స్వీకరించుట ప్రశస్తము. జ్ఞానమునకు జ్ఞానము, సంతోషమునకు సంతోషము అందువలన గలుగుచుండును. వినికిడి విద్యకు ఇవి ప్రధాన సాధనములు. ఉపన్యాసములు, పత్రికా పఠనము, లాంతరుపన్యాసములు మున్నగునవి అవశ్య మనుసరణీయములు. ఇందువలన చదువు వ్రాతలు లేకున్నను పౌరులను విద్యావంతులుగ జేయవచ్చును. మంచి చెడ్డలను విమర్శించుకొను సామర్థ్యమును కలిగింపవలయును; వివిధములగు భావములను వారికి బోధింపవలయును. వానిని సమన్వయము చేసికొనుట కవకాశము గల్గింపవలయును. వారు సరియగు త్రోవను ఆలోచించుకొనుటకు తోడుపడవలయును. వారు తమ విశ్వాసము ననుసరించి ధైర్యముగ నడచుటకు సాయము చేయవలయును. ఇదియే వారికి కావలసిన విద్య. ఇంతకంటె మఱిలేదు.

ఇక రెండవమార్గము చదువు వ్రాతలతో కూడినది:—

ఎంత నేర్పుగల యుపాధ్యాయుడైనను, ఎంత సేవాతత్పరుడయ్యును, ఎల్లకాలము - అన్ని విషయములను-ఎల్లవారికి బోధించుచుండుట అసంభవము. ఎవ్వరుగానీ సర్వకాలము ఇతరులమీదనే యాధారపడియుండుట వివేకము కాజాలదు. 'ఉద్ధరేదాత్మ నాత్మానం' అనునట్లు తనమీద తా నాధారపడియుండవలయును. ఎంత పెద్దవాడైనను తాటిచెట్టునెక్కువానికి కొంత యెత్తునకు మాత్రమే తోడ్పడగలడు. తనకాళ్లమీద తాను నిలువబూననివానిని ఇతరు లెంతకాలము నిలుపగలరు ? కనుకనే తనంతట తాను విద్యాభివృద్ధి కల్గించుకొనుటకు ప్రతిమనుష్యునకు శక్తి యలవడవలయును. పాఠశాలలలోని విద్యాలక్ష్యమిదియే. వయోజన విద్యావ్యాప్తిలోగల యుద్దేశము నిదియే. ఈ యుద్దేశసాఫల్యమును బట్టియే పాఠశాలల ప్రయోజన ప్రమాణము నిర్ణీతమగుచుండును. ఈ యొఱపిడి ఱాతితో పరీక్షించినచో మన ప్రస్తుత పాఠశాలలు తమ ప్రయోజనమును చక్కగ నిర్వహించుచున్నవని గానీ, నేడు బడులలో చదువుచున్న బాలు రందరు విద్యావంతు లగుచున్నారని గానీ విశ్వసింపజాలము. ఉన్నతపాఠశాలలలో జదివిన పెక్కురుబాలురు అభిరుచిలేక చదివిన చదువునకు నీళ్లు వదలుటయు, నాలుగైదు తరగతులవరకు చదివిన పెక్కురు బాలురను నాలుగైదేండ్లలో వయోజన పాఠశాలలలో చేర్చుకొనవలసివచ్చుటయు మనము సామాన్యముగ జూచుచునే యున్నాము. దీనికంతటికిని విద్యావిధానలోపమే ప్రధానలోపము. దీనిని చక్కపెట్టనిచో వయోజనపాఠశాలల కంతమనునది యుండదు. పెద్ద లావిషయము నాలోచింతురు గాత !

ఎదుటివారి యుద్దేశముల నెఱుగుటకుగానీ, తన యుద్దేశములను తెలుపుటకుగానీ మాటలెంత యవసరములో కాలదూరమువలన, ప్రదేశదూరమువలన, భాషాభేదమువలన వేరయిన మనుష్యుల భావముల నెఱుగుటకును, అట్టివారికి తన యుద్దేశములను తెలుపుటకును చదువు వ్రాతలంత యుపయోగకరములనుట నిర్ధారితమే. ఇట్టి చదువుపైన మన మనుకొన్న చదువుతోచేరి మన గ్రామసీమలందు వ్యాపింపవలసియున్నది. దీనినే నిరక్షరాస్యతా నిర్మూలమనుచున్నాము. దీని యవసరములనుగానీ ప్రయోజనములనుగానీ వివరించుట చర్వితచర్వణము. కాని దీనివ్యాప్తికి అనుకరింపవలసిన పద్ధతులను మార్గములను కొంతవఱ కాలోచింపవలసియున్నది.

మన తెలుగుభాష సహజముగా ఎంత సరళము, మధురము అయినను సంస్కృతము మున్నగు భాషల యోగమువలన కొంత జటిలమగుచున్నది. ధ్వనులు, వానిని సూచించు అక్షరములు పెరిగిపోయినవి. ఆ యక్షరములన్నియు ధ్వనిసాదృశ్యము ననుసరించి, వాని యుత్పత్తిస్థానముల ననుసరించి వ్యాకరణశాస్త్రప్రకారము కూర్పబడియున్నవి. అక్షరములు నేర్చుకొనువారికి - అందునను సులభముగ - నేర్చుకొనుట కనువుగ కూర్పబడియుండలేదు. శీఘ్రకాలములో సామాన్య వ్యవహారమున కవసరమయి

నంతవిద్య నేర్పదలచు వారికవి సోపానక్రమముగ ఏర్పాటుపబడలేదు. కనుక మనము పెద్దలకుత్సాహకరముగ ఆశాజనకముగ అవలంబింపవలయు ఈయక్షరబోధనాక్రమము తలచి చూడవలసియున్నది. ఈ విషయమును గమనించియే యిందులకనుకూలమార్గమని తాముతలచిన పద్ధతులతో కొందఱు విద్యావంతులు పుస్తకములను ప్రకటించుచున్నారు. విద్యాబోధకులేగాక వయోజనవిద్యయందున్న తమ యభిమానమును చాటుటకు రాజకీయ నాయకులుగూడ పుస్తకములను ప్రకటించుట సమ్మోదావహము. ఈపుస్తకములను, ఈమార్గములను ఒకింత మనము పరిశీలింతము.

**1. వయోజనవిద్య—మొదటితరగతి :** సుప్రసిద్ధ ఆంధ్రనాయకులగు అయ్యదేవర కాళేశ్వరరావుగారు దీనికికర్త. విశాఖపట్నంజిల్లా కాంగ్రెసుసంఘమువారు దీనిని ప్రచురించినారు. ఇందు అకారమును, హల్లులను నేర్చుకొనుటకు 9 పాఠములును, మిగిలిన అచ్చులకు 2 పాఠములును, అచ్చులతోడి గుణితములకు 4 పాఠములును, సంయుక్తాక్షరములకు 7 పాఠములును ఈయబడినవి. చివర ఉపయుక్తములగు కొన్ని పాఠములీయబడినవి. కాని యివికూడ మొదటిపాఠములవలె పెద్ద అక్షరములతో ముద్రించి, మొదటనుండియు అభ్యాసపదము లెక్కువగా నిచ్చినచో ఎక్కువ యుపయోగకరముగ నుండెడిది. గుణితములు, ఒత్తులు, అచ్చుహల్లుల క్రమమునే యనుసరించుటకంటె ఎక్కువ వాడుకలోనున్న మాటలను గమనించి, సౌలభ్యముననుసరించి కూర్చుట ఉత్సాహకరముగా నుండును. ఇందు కొన్నిపాఠములలో రెండక్షరములు, కొన్నిపాఠములలో 8, 9 అక్షరములు క్రొత్తవి నేర్చుకొనవలసి యుండును.

**2. వయోజనవిద్య—మొదటిభాగము :** శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు దీనికి కర్త. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ ప్రచురణము.

ఇందు మొదట బోధకులకు కొన్ని చక్కని సూచన లీయబడినవి. తెలుగు అక్షరము లన్నియు ప్రస్తుతము వలయాకారముననే యుండుటచే సున్నలోనుండి అక్షర మేర్పడియున్నది శిక్షకులకు త్రోవ చూపుచు, అవసరములగు అక్షరములు ముందు చెప్పి ఖ, ఘ మొదలగు ఒత్తక్షరములు తరువాత చెప్పబడి చక్కగా కూర్పబడి యున్నది. మొదటి పాఠమున సున్న, అన్నివైపులకు వ్రాసిన అరసున్నలు, గీతలు నేర్పి రెండవపాఠమున 7 అక్షరములు నేర్పినారు. ఇది సులభమా ? మొదటి పాఠములకు ఇంకను అభ్యాసపదములను చేర్చుట మేలు. అభ్యాసముల కిచ్చిన చివరి పాఠములలో కొన్ని పద్యములును, దాని ప్రతిపదార్థ తాత్పర్యములును ఉన్నవి. ఇవియును పదములు చదువుటకే ప్రధానముగ నుద్దేశింపబడి యున్నట్లు కనబడుచున్నది. లేనిచో 'ఇట్లు బెగడొందదగునా ? పగవారు ప్రమోదింపరా ?' మొదలగు తాత్పర్యములును, 'కపికులనాథుల్ = కపివంశమందు ప్రముఖులైన వారు' మొదలగు అర్థములును ఉండుట కవకాశములేదు.

**3. మాపాఠాలు—1, 2 భాగములు :** కర్త శ్రీయుత గోపరాజురామచంద్రరావుగారు, ఎం. ఏ. కృష్ణాజిల్లా యువజనసంఘ ప్రచురణములు.

ఇందు అక్షరములు నేర్పుటకు ప్రత్యేకపద్ధతి యేదియు గైకొనబడలేదు. ఒత్తక్షరములను మాత్రము చివరకిచ్చి మిగిలిన అక్షరములను వర్ణమాలలోని క్రమముననే గ్రహించినారు. ఋ ౠ మొదలగు అక్షరములను మొదటనే నేర్పవలసిన అవసరమేమిగలదు ? అభ్యాసపదములు తక్కువ. ఉన్నపదములును మొదటినుండియు చిన్నఅక్షరములతో ముద్రింపబడినవి. విద్యార్థులు పెద్దవారైనను మొదటినుండియు చిన్నఅక్షరములను గుర్తించుట క్లేశకారణము. విశేషవిషయములను బోధింపవలసిన కొన్ని పదములు మాత్రము అక్కడక్కడ పెద్దటైపులోనున్నవి. ఆ విషయములను బోధించువిధానము మొదటి పీఠికలో సూచించినారు. వారుదేశించిన విషయములను బోధించుటకుముందు ఉపాధ్యాయులు కొంత కృషిచేయవలసియుందురు. . ఈ కృషిమంచిదే; మొదటినుండియు ఉపాధ్యాయుడు చెప్పుటకంటె వానినిగూర్చి చిన్నచిన్న పాఠములనేయిచ్చి తమంత తాము చదువుకొను అలవాటును గల్గిం

చుట ప్రశస్తము. ఆ యభిరుచిని గర్హించుట కిది కొంత తోడుపడవచ్చును. ఆ విషయములలో, నేర్చుకొను రైతులు, కూలీలు మొదలగువారికి చేరువలో నుండువానిని, ప్రాధాన్యమునుబట్టి యిచ్చుట మేలు.

**4. ఆంధ్రవయోజన విద్యావాచకము**:గుంటూరు ఏ. సి. కాలేజి రిసెర్చి అండ్ ఎక్స్టెన్షన్ డిపార్టుమెంటువారిచే ప్రకటింపబడినది. ఇందు 48 మూలపదములున్నవి. రోజునకు ఒకగంట చొప్పున 75 రోజులలో ఈవాచకము ముగింపవచ్చునని కర్తలభావము. అప్పటికి తెనుగుభాషను బాగుగా చదువవచ్చును, వ్రాయవచ్చును. ఇంతకంటె తక్కువకాలములో నేర్పుట కనువగునట్లు కూర్పవచ్చునేమో రిసెర్చి చేయుటకు కర్తలు ప్రయత్నింపవలయును. ఇంతేయయ్యును క, న, మ, త, ఒత్తులు ఒక్కపాఠమున కీయవలసియుండునా ? పుస్తకముసైజు కొంచెము పెద్దదిగాని పదములన్నియు చివరిదాక పెద్దయక్షరములతో ముద్రింపబడినవి. అభ్యాసపదములును చాలినన్నియున్నవి.

**5. పెద్దలవాచకము—1 మొదటిదశ; 2 రెండవదశ**: కర్త శ్రీయుత కె. జె. జి. సుందరంగారు (దోర్నకల్ ట్రయినింగుస్కూలు హెడ్మాస్టరు). క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారిచే ప్రకటింప బడినది.

ఇందు మొదటిదశలోనున్న 9 మాటలు నేర్చినచో సామాన్యముగా వాడుకలోనున్నమాటలు, కొన్ని చిన్నకథలు చదువవచ్చునను ప్రణాళికతో కూర్పబడినది. మొదటినాటినుండియు అచ్చులగుణితము, ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు కూడ ప్రత్యేకతలేకుండనే కూర్పబడినవి. వీనిని వేరుగా బోధించుటమేలు. 14వ పుటలో వల అనుమాటను నేర్పినారు. కాని 9వ పుటలోనే దేవుడు మొదలగు మాటలను అభ్యాసములోనిచ్చుట ప్రమాదమగును. పుస్తకము పెద్దసైజులో చివరదాక పెద్దఅక్షరములతో ముద్రింపబడినది.

రెండవదశలో భ, ధ, క్ష, శ, ణ, అక్షరములు నేర్పుచు, అభ్యాసముల నిచ్చినారు. మొదటిదశలో నుపయోగించిన సంయుక్తాక్షరములకంటె భ, ధ, మొ॥ వానిని వెనుకగా నేర్పవలసిన యవసరమేమి ? చివర క్రీస్తునకు సంబంధించిన కొన్ని కథలు పఠనకీయబడినవి.

**6. నంద్యాల మొదటివాచకము; నంద్యాల రెండవవాచకము** : శ్రీయుత బి. ఇ. దేవరాజు, ఎం ఏ., ఎల్. టి. గారు (ఎస్. పి. జి. ట్రయినింగుస్కూలు హెడ్మాస్టరు) కర్త. ఇవియు క్రిస్టియన్ లిటరేచరు సొసైటీవారి ప్రచురణములే. ఇందు మొదటి వాచకములో తేలిక అక్షరములు, రెండవదానిలో ఖ మొదలగు ఒత్తక్షరములు నేర్పబడినవి. కాని మొదటి వాచకము మొదటి పాఠములోనే ద్విత్వాక్షరములు ప్రారంభింపబడినవి. ఇది నేర్చుకొనుటకు తేలికయా ? సంయుక్తాక్షరములు నేర్చుటకు ప్రత్యేక శ్రద్ధకు అనుగుణముగా లేదు. కాని అభ్యాస వాక్యములలో సంయుక్తాక్షరములు ప్రయోగింపబడినవి. పెద్ద సైజులో పెద్ద అక్షరములతో పుస్తకములు ముద్రింపబడినవి.

**7. హైదరాబాదు పెద్దలవాచకపుస్తకము—1, 2, 3 భాగములు** : ఇవియు క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారి ప్రచురణములు.

ఇందలి మొదటిభాగము మొదటిపాఠములోనే పెక్కక్షరములును, చాలవరకు అచ్చులతోడి గుణితములును, ద్విత్వాక్షరములును ఈయబడినవి. బొమ్మలసహాయముతో ఈమాటలు నేర్పుటకు మొదటిపుటలో ఆ మాటలకు సంబంధించిన బొమ్మలున్నవి. మాటలమూలమున అక్షరములు నేర్పు పద్ధతి ననుకరింపబడినది. సామాన్యముగ ఇప్పుడు పల్లెలయందు పెద్దలకు విద్య నేర్పబూను యువకులీ పద్ధతి ననుకరింపగల్గుట కష్టము. పుస్తకములు పెద్దక్షరములతో పెద్దసైజున ముద్రింపబడినవి.

**8. నూతన అక్షరాభ్యాసము:** కర్త:- శ్రీయుత కె. జి. బాబురావుగారు (డిస్ట్రిక్టుమునిసిఫ్, ఏలూరు).

విద్యవలని ప్రయోజనములు, పూర్వభారతదేశౌన్నత్యము మొదలగువిషయములను గూర్చిన ఉద్రేకపూరితమగు పెద్ద పీఠిక ఆంగ్లమున వ్రాయబడినది. ఇది బాలురకుపయోగించు పుస్తక మనుటకంటె ఉపాధ్యాయులకు పద్ధతి నేర్పు పుస్తకమనుట లెస్స.

ఈ గ్రంధాభిప్రాయములు స్వతంత్రములు, కేవల మితరుల ననుసరించినవికావు. అక్షరములను గుర్తుపట్టుటకంటె వ్రాయుట కష్టము. కనుక పెద్దలకు మొదటినుండియు వ్రాయుట నేర్పి వారిని విసిగించుటకంటె చదువుటముందు నేర్పినచో అక్షరములను చూచుట, పోల్చుట, చదువుటవలన వ్రాత సులభముగా వచ్చుననుట యిందలి విశేషము. ఇది మేలుగానే కనబడుచున్నది. బోధకులు ఈ పద్ధతినిగూడ ఆచరణలో పెట్టిచూచి దీని ఫలితములు దేశమునకు తెలుపుట అవసరము. సత్ఫలిత ముల నిచ్చినచో నీ పద్ధతి చక్కగనే యుండును. చదువ నేర్చుకొను అక్షరముల కొక క్రమమిందు గమనింపబడినది. ఒక యక్షరమునుండి మఱియొక యక్షరమును నేర్చుట కుపాధ్యాయులకు సూచన లీయబడినవి. ఆ యక్షరముల స్వరూపమును గుర్తుంచుకొనుటకు కొన్ని విచిత్రములగు గుర్తులు, సామెతలు ఈయబడుట గమనార్హము.

| | |
|---|---|
| ఉదా॥ ఎక్కడోతలకట్టు పారవేసుకొన్నది | 'ఎ' |
| పలకవిరిగినట్లు రెండుముక్కలయినది | 'ప' |
| వంకాయతొడిమవలె కరుచుకొనియుండునది | 'వ' |
| యేనుగుతలవలె పెద్దదిగా సున్న ఉండిన | 'య' |
| మనిషితలవలె చిన్నదిగా నుండిన | 'మ' |

ఇట్టి ఉపమానవాక్యములు చదువునేర్చుకొనువారి కుత్సాహజనకముగా నుండుటయే గాక త్వరగా అక్షరములను పోల్చుకొనుటకు మిక్కిలి తోడ్పడుననుటలో సందియము లేదు. ఉపాధ్యాయులకిట్టి సూచనలిచ్చుచు, బాలురకుపయోగకరముగ పాఠములు, అభ్యాసములునిచ్చిన ఈ పద్ధతియెక్కువ యుపయోగకరముగ నుండగలదు.

అందరకు, అన్ని విషయములందును సంతృప్తిపరచు పుస్తకములు లభించుట కలలోని వార్తయే యగును. బోధకులు ఇందలి యేపుస్తకమునుగాని గైకొని తమపరిస్థితుల ననుసరించి కొంతకొంతమార్పు చేసికొనుచున్నచో వారు తమకర్తవ్యమును సులభముగ నెరవేర్చుకొనగలరనుట నిస్సంశయము. ఉపాధ్యాయులు కేవలము బాలశిక్షలమీదనే యాధారపడుటకంటె తమ కృషిమీద నాధారపడుట ప్రశంసార్హము. పుస్తకములు మార్గమును మాత్రమే చూపగలవుగాని చదువు నంతటిని సమర్పింప జాలవు. ఆంధ్రదేశగ్రంధాలయ సంఘమువారు అనుభవముగల కొందరు పెద్దలను జేర్చి వారిసూచన లచే నొక పుస్తకమును వ్రాయించినను వ్రాయించవచ్చును. అది యిప్పుడున్నవానికంటె కొంత మెఱుగుగా నుండవచ్చును.

పెద్దలచదువు కేవలము అక్షరములు నేర్చుకొనుటతోనే సరిపోవుటలేదు. అది విద్యాభ్యాసమున కొక సాధనము మాత్రమే. కావున ఈ మొదటి వాచకముచేత సాధింపదగిన దేది ? అను విషయ ముల మనము చూడవలెను. మొదటి పుస్తకము చదివినవారు తరువాత తమవిద్య నభివృద్ధి పఱచు కొనుటకు అవకాశము లేమియున్నవి ? ఆ ప్రారంభకులు చదువుకొనుట కుపయోగించు పుస్తకములు మన భాషయందు గలవా ? లేవు. ఇతర భాషలలో నిట్టి వాఙ్మయము- అనుకూలముగ- వ్యాపించి యున్నది. పెద్దలు కుక్క పిల్లి పాఠములతో పడియుండవలసినవారుగారు. పైన చదువుటకు పుస్త

కములు లేనిచో నీ ప్రారంభమువలన ప్రయోజనమేమి ? మఱచిపోవుటయే దాని గతియగును. అందు వలన పెద్దల యభిరుచిని తీర్పగల విషయములను తీసికొని, వారి కర్థమగు భాషలో, స్పష్టములగు అక్షరములతో, ముచ్చటైన పుస్తకములను సోపానక్రమము ననుసరించి ప్రకటింపవలయును. ఎల్లరును బాలశిక్షలనే వ్రాసినందువలన ప్రయోజనములేదు. ఇంతమాత్రముచేత నిపుడున్న ప్రారంభ పుస్తకము లాంధ్రదేశమునందలి యన్ని ప్రాంతములవారిని సంతృప్తి పరచుటకు చాలునని కాదు; ఇంకను ప్రారంభపుస్తకములకు అవకాశము లేకపోలేదు. కాని తరువాతి పుస్తకముల విషయముగూడ నాలోచించవలసిన సమయమురాకపోలేదు. ఆంధ్రగ్రంథాలయసంఘము ఈవిషయము నాలోచించి యొక పదకము నేర్పఱచి ఆమార్గమున త్రోవ చూపి తన ధర్మమును నెరవేర్చుకొనుగాక !

క్రిస్టియన్ లిటరేచరుసొసైటీవారు 'హెల్తుఅండు వెల్ఫేర్ సీరీసు'లో ఆరోగ్యవిషయములను వివరించుచు కొన్ని పుస్తకములను ప్రకటించియుండుట ముదావహము. కాని యవిచాలవు. వీరుల చరిత్రమాలిక, జ్ఞానమాలిక మొదలగు మాలికలయందును కొన్ని యుపయుక్తములగు చిన్నచిన్న పుస్తకములున్నవి. కాని వారు ఈ గ్రంథమాలికలను తమ మతమును ప్రచారముచేసికొనుటకు ప్రధానముగ నుద్దేశించినట్లు కన్పట్టుచున్నది. ఇప్పటి పెద్దలవిద్య నేర్పుటలోనిభావము మతమును మార్చుటయు తమ మతమును పెంచుకొనుటయు గాదు. కనుక విజ్ఞాన విషయములు సాంఘిక దురాచార విషయములు మొదలగువానిని తీసికొనుట మేలు. ఆ విషయములను వివరించుట కిది యదనుగాదు. మరియొకమారు విపులముగ విచారింతము.

ఉపాధ్యాయులు బోధించు పద్ధతులను గూర్చి వ్రాయబడిన పుస్తకములుగూడ మనకు కొన్ని యున్నవి. ఆ యన్ని పుస్తకముల జాబితాయు ఆంధ్రగ్రంథాలయ సంఘమువారు ప్రచురించినచో శిక్షకులు తమ కనుకూలమయిన పద్ధతులను ఒక్కొక్కదాని నుండి యేరుకొనగలరు. రెంటిమూటిని మాత్రము నేనిందు సూచింతును.

1. పెద్దలవిద్య (ఉపాధ్యాయబోధిని): కర్త:— శ్రీ. కె. జె. జి. సుందరంగారు
2. గ్రామసీమ, విద్యావ్యాప్తి: కర్త:— శ్రీ మండవేముల వేంకటశాస్త్రిగారు
3. వయోజనవిద్య, 3 పుస్తకములు: కర్త:— శ్రీ శనివారపు సుబ్బారావుగారు
4. అంతర్జాతీయ వయోజనవిజ్ఞానము: కర్త:— శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు

పుస్తకములను సూచించుటయేగాక పెద్దలచదువు నేర్పు పద్ధతులను నేర్పుటకై అచ్చటచ్చట కొన్నికొన్ని తరగతుల నేర్పఱచి అనుభవజ్ఞులగు పెద్దలచే కొన్ని మాదిరి పాఠముల నిప్పించుచు బోధకులను తయారుచేయుట మేలు. ఈకార్యము విషయమై ఆంధ్రగ్రంథాలయ సంఘమాలోచించి కర్తవ్యమునకు బూనుకొనునుగాక !

---

# వయోజనవిద్య : వ్యాప్తిమార్గ వివరణ*

డాక్టరు బి. వి. నారాయణస్వామినాయుడు

అన్నామలై విశ్వవిద్యాలయ ఆర్థిక శాస్త్రాచార్యులు

చదువుకోవడంవల్ల ఆలోచనశక్తిన్నీ మనోవికాసమున్ను కలుగుతాయి. అందువల్ల సంపూర్ణమైన వ్యక్తిత్వం కలుగుతుంది. మనలోపల అడగివున్న శక్తులు బహిర్గతము లవుతాయి. మనలో వివేకం అధికమవుతుంది. మన భావాలకు క్రమపద్ధతిన్నీ సామరస్యమున్నూ కలుగుతుంది. విశ్వమానవసేవ నిమిత్తం మనశక్తులను పూర్తిగా వుపయోగించవలెనన్న దృఢసంకల్పం మనకు కలుగుతుంది. ప్రజాపరిపాలనంలో ఉత్తములైన పౌరులను ప్రపంచ పౌరులను కలిగించడమే విద్యయొక్క ముఖ్యప్రయోజనం. విద్యవల్ల యువజనులలో దేశభక్తి మతాభిమానం మొదలైనవికూడా కలుగుతాయి. వీటిని విద్య వుపయోగించుకొని యువజనులలో అనేక రకాలనుకూడా కలిగిస్తుంది గాని యిది విద్యయొక్క ముఖ్య ప్రయోజనంకాదు. ప్రజలధీశక్తిని వృద్ధినొందించి దానిని వారు సరిగా వుపయోగించుకొనేలాగు చేయడము జీవయాత్రలో కష్టసుఖాలు కలిగినప్పుడు కృంగిపోకుండాను పొంగిపోకుండాను సమత్వమును కలిగివుండేలాగు ప్రజల మనస్సులను దిద్దుబాటు చేయడము, ప్రేమసౌఖ్యములపట్ల వారి సామర్థ్యమును తెలుసుకోవడము, పరిస్థితులకు అతీతులుగా వుండేలాగు చేయడము, ఇవే విద్యయొక్క ప్రయోజనాలు. సమగ్రజీవితము ననుభవించడానికి కావలసిన అభ్యాసం విద్యవల్ల కలుగుతుంది.

మధ్యవయస్కుల విద్యలో అన్నీ చేరివున్నాయి. బాల్యంలో ప్రారంభించిన విద్యను మధ్యవయసులోకూడా కొనసాగించుట, ఏదోఒకపనిని చేసేపద్ధతిని సాంఘికంగా నేర్పుట, పల్లెటూరి బడులు, ప్రజల కళాశాలలు, ఇవన్నీ దీనిలో చేరివున్నాయి. మధ్యవయస్కులలో చదువురానివారిలో కనబడని మానసికవికాసమును వారిలో కలుగజేయడమే మధ్యవయస్కుల విద్యయొక్క ఉద్దేశం. మన దేశంలో ఇదివరకు విద్యావిధానం సార్వజనిక ప్రయోజనంమీదనే ఆధారపడి వుందిగాని వ్యక్తిగత ప్రయోజనంమీద ఆధారపడి వుండలేదు. కాని యిప్పుడు కలిగిన పరిస్థితులలో ఈ ఆశయము పూర్తిగా మరుగుపడిపోయింది. చదువు చెప్పడంలో దానివల్ల చివరకుకలిగే నిజమైన లాభాలకే యెక్కువ ప్రాధాన్యం

* 1941 వ సం. ఏప్రిల్ నెల కోయంబత్తూరులో జరిగిన దక్షిణభారత తృతీయ వయోజనవిద్యా మహాసభలో చేయబడిన అధ్యక్షోపన్యాస సంగ్రహము.

యియ్యబడెనుగాని ప్రజలకు అక్షరజ్ఞానం కలిగించడానికి ప్రాముఖ్యం యియ్యబడలేదు.

మధ్యవయస్కుల విద్యావిషయంలో యూరపు అమెరికా ఖండాలకు ఇండియాకు చాలా తేడావుంది. అ ఖండాలలో బాలురకు బాలికలకు చదువు నిర్బంధం గనుక వారికి ప్రాథమిక విద్య వచ్చేవుంటుంది. అందుచే మైనారిటీ వదలిన తరువాత కూడా వారు చదువుకోవడమే మధ్యవయస్కుల విద్య అనబడుతోంది. మధ్యవయస్కులైన స్త్రీ పురుషులు ప్రధానంగా జీవనాధారానికి పనికివచ్చే ఒక వృత్తికి సంబంధించిన విద్యను అభ్యసిస్తారు. దానితోపాటు యితర విషయాలను కూడా అప్రధానంగా వారు తెలుసుకుంటారు. పాశ్చాత్యదేశాలలో పాఠశాలలలో చదువుకోడానికి గల అవకాశాలు ఆ దేశీయులకు యావజ్జీవముకూడా కలుగుతూనే వుంటాయి. ఇండియాలో చాలమంది తమ బిడ్డలను బడులకు పంపరు. అందువల్ల ఇండియాలో అక్షరాల పరిచయం లేనివారి సంఖ్య మిక్కిలి హెచ్చుగావుంది. అటువంటివారిలో మధ్యవయస్సులోవున్న వారికి ఓనమాలదగ్గర నుంచి నేర్పవలసి వుంటుంది. ఇండియాలో ప్రజల జీవితానికి సంబంధించిన ముఖ్య విషయాలను గురించి బోధించడమే అవసరంగాని పాశ్చాత్యదేశాలలోని పద్ధతి అవసరం లేదు. మన రాజకీయ స్వాతంత్ర్యం మనకు ఉపయోగపడడమునకున్నూ మన ఆర్థికస్థితి వృద్ధినొందుటకున్నూ మనదేశంలో జనసామాన్యానికి విద్యనేర్పడం ముఖ్యావసరమే. అందువల్ల వారిమనస్సులకు వికాసం కలుగుతుంది. నిరంతరము మారిపోతూవున్న పరిస్థితుల ననుసరించి వారు ఆలోచించగలుగుతారు.

దేశమందంతట ప్రాథమికవిద్యను నిర్బంధంగా చేసినా దానివల్ల మన బిడ్డలకు అనగా భావిసంతతికి లాభిస్తుందేగాని యిప్పుడున్న మధ్యవయస్కులకు లాభించదు. మధ్యవయస్కులకు విద్యనేర్పినట్టయితే వెంటనే ప్రజలలో అత్యధికసంఖ్యాకులకు చాలా లాభం కలగదు. మన దేశంలో 100 కి 80 మందికి యిప్పుడుకూడా వ్రాత, చదువు, లెక్కలు రావు. పాఠశాలలు, విశ్వవిద్యాలయాలు, పన్నుల ఆధారం గల మధ్యవయస్కుల చదువు, ఇతరులచే యేర్పరచబడిన టెక్నికలు, వాణిజ్య కరస్పాండెన్సు పాఠశాలలు, మతసంఘాలవల్లను, మిశ్రమమత సంఘాల వల్లను నడపబడే సాంఘికసంస్థలు, మిల్లులు మొదలైనవాటిలో పనిచేసేవారు యేర్పరచిన పాఠశాలలు, కార్మికుల విద్యాసంస్థలు, రాత్రిపాఠశాలలు, ప్రత్యేక వేసవి పాఠశాలలు, రిఫ్రెషరుకోర్సులు, పట్టణములలోను గ్రామములలోను సార్వజనిక సంఘాలు, గ్రంథాలయాలు, మ్యూజియములు, సినీమాలు, నాటకములు, ప్రదర్శనములు, వినోదంకోసం సంగీతం, కళలు, చేతిపనులు, రేడియోలు, వ్యక్తులచే యేర్పరుపబడిన సంస్థలు యివన్నీ విద్యాబోధకములే. ఇప్పుడు మన దేశంలో

చాలా గ్రామాలలో బడులు లేవు. బడులున్న గ్రామాలలోని ఉపాధ్యాయులకు ట్రెయినింగు యిస్తే వారు మధ్యవయస్కులకు చదువు చెప్పగలుగుతారు. పట్టణాలలోవున్న హైస్కూల్సులో ఉపాధ్యాయులుగా వున్నవారికి యిష్టమూ తీరికా వుంటే వారు కూడా పట్టణాలలో మధ్యవయస్కులకు చదువు చెప్పగలుగుతారు. ఈ విషయంలో పని చేయడానికి విశ్వ విద్యాలయాలకు చాలా అవకాశాలున్నాయి. అమెరికాలో విశ్వవిద్యాలయాలు మార్గదర్శకులుగా వున్నారు. మనదేశంలో విశ్వవిద్యాలయాల వారీ విషయంలో తగినంత శ్రద్ధను చూపించడం లేదు. కొన్ని విశ్వ విద్యాలయాలవారు ప్రదర్శనాలు, ఉపన్యాసాలు, కరస్పాండెన్సు తరగతులు, ట్రెయినింగు క్లాసులు మొదలైనవాటిని యేర్పాటు చేశారుకాని వీటిని చదువురాని సామాన్యప్రజలు గ్రహించడం వారి శక్తికి మీరినదిగావుంది. కనుక విశ్వవిద్యాలయాలవారు దీనిని గుర్తించి మధ్యవయస్కులకు విద్యనేర్పడానికి తగిన యేర్పాటులను చేయడం చాలా అవసరమే.

ఇందు నిమిత్తం గ్రామాలలోను పట్టణాలలోను ప్రత్యేక సంఘాలు యేర్పడవలెను. ప్రజాసేవా నిరతులైనవారు పూనుకొని వీటినేర్పాటు చెయ్యవలెను. ఇందుకు వీరికి పలుకుబడి వుండాలి. వలంటీరు సంఘాలవారు రాత్రి పాఠశాలలు మొదలైనవాటిని ఏర్పాటు చేయవలెను. మదరాసు నగరంలో వై. ఎం. సి. ఏ., రామకృష్ణమిషను మొదలైన సంఘాలవారీ విషయంలో బాగా పనిచేస్తున్నారు. సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీవారు గ్రామాలలో మంచియేర్పాటులను చేశారు.

జిల్లాబోర్డులు, మ్యునిసిపాలిటీలు మొదలైన స్థానికసంఘాలు యిప్పటివరకు శ్రద్ధగా పనిచేయడంలేదు. ఈ విషయంలో స్థానికసంఘాలకు చాలా అవకాశాలున్నాయి. వీరిపరిపాలనక్రింద చాలా ప్రాథమిక పాఠశాలలు, ఉన్నతపాఠశాలలు కూడా వున్నాయి. ఇవి ప్రజలప్రతినిధులతో కూడినవి. వీటికి అధికారముకూడ వుంది. ఇవి ప్రభుత్వానికి అంగములే. విద్యాశాఖాధికారుల సలహా వీరికి లభిస్తుంది. మధ్యవయస్కులవిద్యను స్థానికసంఘాలకు వశపరచే యెడల దీనికి ఒకవిధానమును సిద్ధపరచవచ్చును. వీటికి ప్రత్యేకంగా ఉపాధ్యాయులను ప్రవీణులను నియమించవచ్చును. స్త్రీల క్లబ్బులు, తలిదండ్రుల సంఘాలుకూడా యీ విషయంలో బాగా పనిచేయగలవు.

ఈరీతిగా సామాన్య ప్రజలలో మధ్య వయస్కులలో చదువుకొన్న వారి సంఖ్య అధికమైన కొద్దీన్నీ గ్రంథాలయాల సంఖ్యకూడా చాలా గ్రామాలలోను పట్టణాలలోను ఏర్పాటు చేయవలెను. మ్యూజియములు, సినీమాలు చాలా ఉపయోగకరమైనవి. సినీమాలు ప్రజలను ఆకర్షించి విషయాలు వారిమనసులకు నాటుకొనిపోయేలాగు చేస్తాయి. రేడియోలు, ప్రదర్శనాలు కూడా అవసరమే. నాయకులు

ఎదుట నిలబడి ఉపన్యసిస్తూ వుంటే విషయాలు ప్రజల మనస్సులకు తాకే అంత బాగా రేడియో ఉపన్యాసాలవల్ల తాకవేమో గాని యివికూడా మంచిపని చేస్తాయి. మనిషి కనపడని లోపంతప్ప మరేలోపం వీటిలో లేదు.

తదేకదీక్షగా పని జరిగితేగాని లాభంలేదు. మనదేశం చాలా పెద్దది. దారిద్ర్యం మిక్కిలి హెచ్చుగావుంది. మన ప్రజలు అనేక సంవత్సరాలనుంచి అజ్ఞానంలో మునిగివున్నారు. కనుక మధ్య వయస్కుల విద్యాసమస్య చాలా కష్టాలతో కూడినదే. ధీమంతులైనవారు పూనుకోవాలి.

(ఆంధ్రపత్రికనుండి)

## నిరక్షరాస్యత నిర్మూలింపుడు!

### కీర్తన

నిరక్షరాస్యత నిర్మూలింపుడు
విద్యావ్యాప్తిని చేయండోయ్ ॥నిర॥

గుడులే బడులు గోడలె పలకల్
పాటలె పాఠాల్ మాటలె చదువు
వార్తాపత్రిక కాలక్షేపం ॥నిర॥

చెట్లు చేమలచేరి చదివిరి
పుట్టు పూర్వోత్తరాలనుండి
తాతలు తండ్రులు వ్రాతచదువులను ॥నిర॥

విద్యనేర్చి విశ్వంబేలండీ
స్వాతంత్ర్యంబును సముపార్జించగ
మేటి సాధనము చదువనియెరిగి ॥నిర॥

—శ్రీ చివుకుల శేషశాస్త్రి

# వయోజనవిద్య*

శ్రీ మహాత్మ గాంధి

కాంగ్రెసువాదులు దీనివిషయములో మఱీ ఉపేక్ష వహించారు. ఉపేక్ష వహించనిచోట్ల నిశానీదార్లకు చదవడం వ్రాయడం మాత్రం నేర్పి సంతృప్తి పడ్డారు. వయోజనవిద్యాబోధకు నేనే సర్వాధికారి నయితే ముందుగా వయోజన విద్యార్థులకు వారి దేశముయొక్క ఔన్నత్యమునూ విశాలత్వమునూ చెప్పి వారికి హృదయ వికాసం కలుగచేస్తాను. గ్రామస్థునికి వాని గ్రామమే ఇండియాదేశ మంతాను. ఆయన మఱొకగ్రామం పోతే తన గ్రామమే తన మాతృదేశంగా చెప్పుకొంటాడు. అతనికి హిందూస్థానమనేది భూగోళశాస్త్రంలో ఒక పదం. గ్రామాలలో పాతుకొనిపోయిన అజ్ఞానానికి మేర మనకు తెలియదు. గ్రామస్థులకు విదేశీ పరిపాలననుగూర్చిగానీ దాని చెడుగులనుగూర్చిగానీ తెలియనే తెలియదు. ఏదైనా కొద్దిగా తెలిస్తే ఆ తెలిసినది విదేశీపరిపాలకులవలన కలిగిన భయమూ, తమ నిస్సహాయత్వమూ, ఇందుకు ఫలితంగా విదేశీయులన్నా వారి పరిపాలన అన్నా భయమూ ద్వేషమూ మాత్రం గ్రామాలలో పాదుకట్టుకొన్నాయి. విదేశీ పరిపాలనను పారద్రోలడ మెలాగో వారికి తెలియదు. విదేశీయులు తమ దౌర్బల్యంవల్లనే ఇక్కడ రాజ్యం చేస్తున్నారనికానీ, వారి పరిపాలనను పారద్రోలే శక్తి తమలో ఉందనికానీ వారు గ్రహించలేరు. కాబట్టి నా అర్థంలో వయోజనవిద్య అంటే వాగ్రూపంలో చెప్పే నిజమైన రాజకీయవిద్య. ఈ విద్యాబోధనము మనము నిర్భయంగా చేయవచ్చును. ఇందుకైనా మనకు హక్కు లేకపోతే స్వరాజ్యముమాట వట్టికల్ల. ఈ నేను వ్రాసేదంతా వెల్లడిగానే వ్రాస్తున్నాను. అహింస భయాన్ని దగ్గరకు చేరనీయదు. అందువల్ల అహింసావాదులకు రహస్యమనేదిలేదు. వాగ్రూపమైన చదువుతోపాటు అక్షరరూపమైన చదువు కూడా చెపుతుండాలి. ఇది అందరికీ చేతనయిన పనికాదు. సాధ్యమైనంత తక్కువ కాలంలోనే వయోజనవిద్య పూర్తిచేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. విద్యావిధానంలో నిపుణులైన కొంతమందిని తాత్కాలికంగానో, శాశ్వతంగానో ఒక కమిటీగా మన కాంగ్రెసు కార్యవర్గమువారు నియమిస్తే ఈ నా భావాలకు వారొక రూపమిచ్చి మన ప్రచారకులకు మార్గదర్శకులు కాగలరు. ఇక్కడ నేను చెప్పినదంతా సూచనమాత్రంగా ఉంది. కాని మామూలు కాంగ్రెసువాది అనుసరించడానికిది చాలదు. అంతేకాదు, ప్రతి కాంగ్రెసు గోత్రీకుడు ఇంత ముఖ్యమైన ప్రత్యేక కార్యనిర్వహణకు తగిఉంటాడనికూడా నేననుకోను. కాని ఉపాధ్యాయులుగా పనిచేసే కాంగ్రెసువాదు లిందు కనుగుణముగా ప్రణాళికను తయారుచేయడం కష్టమైనపనికాదు.

* నిర్మాణకార్యక్రమమునుగూర్చి మహాత్ముడు వ్రాసిన చిరుపొత్తములోని ఈ విషయము ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘం నిర్మాణకార్యక్రమశాఖవారు ప్రచురించిన తెలుగుగ్రంథమునుండి గైకొనబడినది. అనువాదకులు : శ్రీ కొడాలి ఆంజనేయులుగారు.

# గ్రంథాలయమూర్తి *

గ్రంథాలయములు ప్రయోజనకరములు గావాలంటే వానికి పుస్తకములు పాఠకులు సిబ్బందితో కూడిన పవిత్ర త్రిమూర్తి భావమవసరము. మనదేశంలో ఈ మూడును కావలసినంతగ లేకుండుటయేగాక వీని పరిపాలకులు కడపటి రెంటి విషయమై అశ్రద్ధవహించడంకూడ సంభవిస్తుంది.

మనదేశంలో గ్రంథాలయవిధానం సజీవంగా నుండాలని కోరేవారందరూ పైమూడు విషయాల్లోనూ గట్టిగా కృషి చేయవలసి యుండును. శాస్త్రము, చరిత్ర మున్నగు అన్నివిషయాలకు సంబంధించిన దర్జాలవాకీపుస్తకాలు దేశభాషల్లో ప్రకటితమయ్యేటట్లు ప్రోత్సాహం చేయవలెను. మఱియు ప్రజలనాకర్షించి వారికి పఠనాభిలాష కలిగించుటకు గట్టి ప్రయత్నములు సాగించవలెను. పుస్తకముల నొకచోజేర్చి వానిని కోరినవారి కిచ్చుటకు సిద్ధముగ నున్నంతమాత్రముచే పై ఫలితము సిద్ధించదు. గ్రంథాలయములు ప్రజలమధ్యకేగి పాఠకుల నిమిత్తము ప్రయత్నించవలెను. దీనికంతటికిని - స్వలాభముకంటె సేవను, లాభముకంటె త్యాగమును ముఖ్యముగనెంచు సిబ్బందిఅవసరము. మనదేశముయొక్క ప్రస్తుత పరిస్థితులలో వీరికి అసామాన్యమగు స్థైర్యముకూడ నుండవలెను.

కాన నేటిగ్రంథాలయాల పాఠశాలలలో నేర్పదగినది గ్రంథవర్గీకరణము, జాబితాలు చేయుట మున్నగు సాంకేతిక విద్యమాత్రమేకాదు. ప్రచార ప్రకటనలకు సంబంధించిన అత్యంతోపయుక్తమగు వివిధవిధానములను నేర్పుచు పుస్తకములకు పాఠకులకు మధ్య ఎడతెగని సంబంధమును ప్రతిష్ఠించు పవిత్రకార్యమును దీక్షతో సాగించగలుగు ఆధ్యాత్మిక దృష్టిని ప్రబోధించవలెను. అప్పుడే మనదేశమున తలయెత్తుటకు తన్నుకలాడు ప్రతి మంచికార్యమును, గొంతుపిసికి చంపుటకు ఎచ్చటికచ్చట కలుపువలె మనకు తెలియరాని చిత్రభంగులబుట్టి, ధనసంపాదనాపేక్షచే స్వలాభపరులై నోటికివచ్చిన అపచారములు, ప్రగల్భములు పలుకు వారి నేమాత్రమును లక్ష్యపెట్టక వీరు తమపనిని నెరవేర్చగలుగుదురు.

మీ వసంతవిద్యాలయ సభ్యులెల్లరు ఉన్నతాదర్శములం దుత్సాహులై స్వలాభపుటాలోచనల కట్టిపెట్టి మన మాతృభూమియందలి గ్రామగ్రామములోను గల ప్రతి మనుజునియొద్దకును విజ్ఞానజ్యోతిని మోసికొనిపోవ సమర్థులుకాగలరని నమ్ముచున్నాను.

మీ విద్యాలయమున కన్నివిధముల జయమగుగాక !

---

* మూడవగ్రంథాలయ వేసవిపాఠశాలా ప్రారంభోత్సవ సందర్భమున మదరాసు యూనివర్సిటీ లైబ్రేరియను శ్రీ యస్. ఆర్. రంగనాథన్ గారు పంపినసందేశమునకు తెలుగుసేత.

# ఆంధ్రదేశము : వయోజనవిద్యాప్రచారము

## ఆంధ్రరాష్ట్ర విద్యార్థిసంఘం :

మనదేశ విద్యార్థిసంఘాలలో మొదట బొంబాయిరాష్ట్ర విద్యార్థిసంఘం వయోజన విద్యాప్రచారానికి పూనుకుంది. క్రమేణా అన్ని విద్యార్థి సంఘాలు ఈ ప్రచారాన్ని ప్రారంభించాయి. 1938 సం॥లో మొదట మన ఆంధ్రదేశంలో విశాఖపట్టణ విద్యార్థిసంఘం ఈ ప్రచారాన్ని మొదలు పెట్టింది. రాష్ట్రసంఘం తరఫున 1940 వేసంగిలో బెజవాడలో శిక్షణ శిబిరం ఏర్పాటుచేసి ప్రచారకులకు శిక్షణనిచ్చారు. ఈ శిబిరంలో తర్ఫీదు పొందిన విద్యార్థులు తూర్పుగోదావరి, కృష్ణాజిల్లాలలో ప్రచారం చేశారు. ఆ సంవత్సరమే నెల్లూరుజిల్లా విద్యార్థులు వారి జిల్లాలో ఆరు కేంద్రాలు నడిపారు. 1940 సం. విద్యార్థిసంఘాల తరఫున తక్కిన జిల్లాలలోకూడ కొంత ప్రచారం జరిగింది కాని ఈ ప్రచారం సంతృప్తికరంగా లేదు.

1941 సం. మాత్రం ప్రభుత్వంవారి ఆటంకా లెన్నివున్నా ఆంధ్ర విద్యార్థిసంఘం వయోజనవిద్యా ప్రచారాన్ని జయప్రదంగానే సాగించింది. ఈ సంవత్సరంలో ఈ సంఘుపక్షాన కృష్ణా, గుంటూరు, తూర్పుగోదావరిజిల్లాలలో 4 ప్రచారక శిక్షణ శిబిరాలు నెలకొల్పి సుమారు 120 మందికి శిక్షణ నిచ్చారు. నెల్లూరు, కడప జిల్లాలలోకూడ శిక్షణశిబిరాలు ఏర్పాటు చేయబడ్డవి. ఈ శిక్షణపొందిన విద్యార్థులు గుంటూరుజిల్లాలో దాదాపు 25 కేంద్రాలలో పనిచేశారు. తక్కిన అన్ని జిల్లాలలోను కలిసి 30 కేంద్రాలదాక నడిపారు. కొన్నిచోట్ల ప్రచారసంఘాలే పలకలు మొదలగు సామగ్రిని ఉచితంగా విద్యార్థుల కిచ్చారు. గుంటూరు జిల్లాబోర్డువారు వ్రాతబల్లలు, గ్లోబులు మున్నగు పరికరముల నిచ్చి పై ప్రచారసంఘాలకు తోడ్పడ్డారు. వివిధ కేంద్రాలలోని ప్రచారకులకు సలహాల నిచ్చుటకు గుంటూరుజిల్లా విద్యార్థిసంఘంవారు ఒక ఆర్గనైజరును నియమించారు. ఈ సంఘంవారు తమ ప్రచారానికి చాలవరకు శ్రీ గోపరాజు రామచంద్రరావుగారి 'మా పాఠాలు' అనే పుస్తకాన్ని ఆధారంగా తీసుకొన్నారు. ప్రజలకవసరమగు విజ్ఞానాన్ని అందించడానికి చాల కృషిచేశారు. కొన్ని కేంద్రాలలో ప్రథమచికిత్స ఏర్పాట్లుకూడా చేశారు.

విద్యార్థిసంఘాల కృషివల్ల కృష్ణా, గుంటూరు జిల్లాలలో 800మంది నిరక్షరాస్యులు కొంతవరకు చదువను వ్రాయను నేర్వగలిగారు. బహిరంగసభలు చాలా జరిగాయి. కొన్నికొన్ని కేంద్రాలలో స్త్రీలకు పురుషులకు వేర్వేరుగ ఒకనిర్ణీత కార్యక్రమం ప్రకారం ప్రచారం సాగించినట్లు తెలుస్తుంది. కొన్ని కేంద్రాలలో ముందుగనే పాఠాలు, ఉపన్యాసాలు, సిలబసులు ఏర్పాటుచేసుకొని ప్రచారం సాగించారు. మొత్తంమీద 1941 సం. లో ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘంవారు చేసిన ప్రచారం సంతృప్తికరంగానే వుందని చెప్పవచ్చు.

## కడపజిల్లా విద్యార్థి సంఘం:

1941 సం. వేసవిసెలవులలో కడపజిల్లా విద్యార్థిసంఘమువారు జిల్లాయందంతటను కొన్ని కేంద్రములు స్థాపించి విద్యాప్రచారమును సాగించారు. కడప పట్టణవిద్యార్థి సంఘమువారు పసువులవాండ్లపల్లె అను గ్రామమున వయోజనవిద్యాప్రచారము మే నెలలో ప్రారంభించారు.

## కృష్ణాజిల్లా యువజనసంఘం:

ఈసంఘంవారు వయోజన విద్యాప్రచారానికై 'మాపాఠాలు' అనేపుస్తకం అచ్చువేయించారు. 1941 సం. ఏప్రిల్ నెలలో 43 గురు ప్రచారకులకు శిక్షణనిచ్చారు. ఈప్రచారకులు జిల్లాలోని 10 గ్రామాలలో కేంద్రాల నేర్పాటుచేశారు. యలమర్రు జమిగొల్వేపల్లి ఈ రెండుగ్రామాలలోనే

15 కేంద్రాలు నడిచాయి. చదువుకొన్నవారికికూడ ఈకేంద్రాలద్వారా హిందీభాష, చరిత్ర, ఇతర విషయాలు ప్రత్యేకంగా నేర్పబడ్డాయి. పైరెండు గ్రామాలలోను వీరి ప్రచారఫలితంగా 180 మందికి పైగా ప్రజలు విద్యావంతులు చేయబడ్డారు. ఆంధ్రదేశంలో 1941 వ సం. లో వయోజనవిద్యాప్రచారం సాగించిన సంస్థలన్నిటిలో కృష్ణాజిల్లా యువజనసంఘం వారిదే పైచేయిగా కనబడుతుంది. మొత్తం ప్రచారానికి రు 425-0-0 లు వీరు వినియోగించారు.

### గుంటూరుజిల్లా విద్యార్థి సంఘం :

1941 సం. ఏప్రియల్ చివరివారంలో ఈ సంఘమువారు కొల్లూరులో ప్రచారక శిక్షణశిబిరాన్ని ఏర్పరచారు. ఇందు జిల్లాలలో అన్నిమూలలనుండి 45 మంది విద్యార్థులు శిక్షణపొందారు. జిల్లాలో మొత్తం 30 కేంద్రాలు ఏర్పరచి వయోజన విద్యాప్రచారం చేశారు. ఒక్క గోవాడ కేంద్రంలో 125 మందికి చదువు చెప్పారు. అన్ని కేంద్రాలలోను మొత్తం చదువుకొన్నవారి సంఖ్య 600. 'మాపాఠాలు' అనే పుస్తకాన్నే వీ రుపయోగించారు.

### తూర్పుగోదావరిజిల్లా విద్యార్థి సంఘం :

ఈ సంఘమువారు రామచంద్రపురంలో వయోజనవిద్యాప్రచారక శిక్షణశిబిరాన్ని ఏర్పఱిచారు. 1941 సం. ఏప్రియల్ లో ఈ శిబిరం నడుపబడింది. గోపరాజు రామచంద్రరావు, చెలికాని రామారావు మొదలగువారు అధ్యాపకులుగా పనిచేశారు. 30 మంది ప్రచారకులకు శిక్షణ నిచ్చారు. జిల్లాలోని 8 గ్రామాలలో వీరు కేంద్రాల నేర్పరచి ప్రచారం చేశారు.

### బెజవాడతాలూకా యువజనసంఘం:

1941 సం. ఏప్రిల్ నెలలో జిల్లాయువజనసంఘం వారిచే నడుపబడిన శిక్షణశిబిరంలో ఈతాలూకా ప్రచారకులు 8 మంది శిక్షణపొందారు. ఈసంఘంవారు ఈతాలూకాలోని గ్రామాలలో 6 కేంద్రాల నేర్పఱచి ప్రచారంచేశారు. 'మాపాఠాలు' అనే పుస్తకాన్ని తమ ప్రచారానికి ఆధారంగా వీరు తీసుకొన్నారు. వారిచే నడుపబడిన మద్దూరు గ్రామకేంద్రంలో 25 మంది విద్యార్థులు హాజరవుతూ వుండేవారు.

### రేపల్లెతాలూకా గ్రంథాలయసంఘం :

సంఘం స్థాపించబడిన దగ్గరనుంచీ వయోజన విద్యాప్రచారానికి కృషిచేస్తుంది. సంఘ కార్యదర్శి ప్రోత్సాహమున 1941 వేసంగిలో తాలూకాలో నాలుగు కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. వీటిలో 100 మంది వయోజనులకు విద్య నేర్పారు.

## పట్టణములు

### కాకినాడ :

కాకినాడలోని గాంధీ గ్రంధాలయమువారు మే నెలలో జరిగిన సభ్యుల సాధారణ సమావేశంలో గ్రంథాలయానికి చుట్టుపట్లనున్న వీధుల్లోని నిరక్షరాస్యుల పట్టీ తయారుచేసి వయోజన విద్యాప్రచారం చేయడానికి తీర్మానించుకొన్నారు.

### గూడూరు :

నెల్లూరుజిల్లా గూడూరులో 1940 సం. అక్టోబరు నెలలో వయోజనవిద్యాప్రచారమండలి శ్రీయుత కె. శివరావుగారిచే ప్రారంభింపబడ్డది. ఈ మండలివా రప్పటినుండి వయోజన విద్యాప్రచారాన్ని సాగిస్తున్నారు.

**తెనాలి :**

తెనాలి పట్టణ యువజన సంఘంవారి యాజమాన్యమున 1 వ వార్డులో వయోజన విద్యాప్రచారం నిమిత్తం లంబాడిగూడెంలో 1941 సం. మే నెలలో రాత్రిపాఠశాల ప్రారంభింపబడ్డది. ప్రభుత్వము వారి నిషేధాజ్ఞ మూలంగా జూన్ నెలలో ఇది ఆగిపోయింది.

**నరసాపురం :**

పశ్చిమగోదావరిజిల్లాకు చెందిన నరసాపురంలో శ్రీ యర్రమిల్లి నారాయణమూర్తిగారిచే వయోజన విద్యాపాఠశాల యొకటి తెరువబడింది. ఈ రాత్రిపాఠశాలలో 20 మంది విద్యార్థులు శిక్షణ పొందారు.

**బందరు :**

బందరుహిందూకాలేజి రోవరు స్కౌటులు ఇంగ్లీషుపాలెంలో వి. శంకరం, ఎం. ఏ. గారి నాయకత్వంక్రింద సాగించిన వయోజన విద్యాకేంద్రముయొక్క వార్షికోత్సవము 1941 మే నెలాఖరు వారములో శ్రీ చిట్టా బాలకృష్ణశాస్త్రి ఎం., ఏ. గారి అధ్యక్షతను జరిగింది.

**బాపట్ల :**

బాపట్ల సేవాసమితివారు 1941 సం. మే నెల 17 వ తేదీనుండి 6 వారములపాటు వేసంగి పాఠశాలను నడపుట కేర్పాటుచేసి దినికి శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారిచే ప్రారంభోత్సవము చేయించారు. స్త్రీలనిమిత్తము ప్రత్యేకము స్త్రీ హితైషిణి మండలియందుకూడ ఒక కేంద్రమేర్పాటు చేయబడెను. జూన్ నెలలో వచ్చిన ప్రభుత్వంవారినిషేధపుటుత్తరువు ఫలితంగా కొన్నాళ్లు నిలిపి వేయబడి, జిల్లాకలెక్టరుగారి అనుమతితో తిరిగి ఈకేంద్రములు జులై నెల 27 వ తేదీవరకు నడుపబడెను.

బాపట్ల విద్యార్థుల యాజమాన్యాన కొత్తపాలెములోను, ముక్కలవారిపాలెములోను రెండు వయోజనవిద్యాలయములు నడుపబడెను.

## కృష్ణాజిల్లా

**ముదునూరు : వయోజనవిద్యానిలయం**

కృష్ణాజిల్లా ముదునూరుగ్రామంలో అన్నె అంజయ్యగారి యాజమాన్యాన 1—9—40 వ తేది నుండి 31—5—41 వ తేదివరకు శ్రీ గోపరాజు రామచంద్రరావుగారిచే పై విద్యాలయం నడపబడింది. చదవడం వ్రాయడంతో పాటింటు వివిధ శాస్త్రములకు సంబంధించిన అనేక విషయాలు బోధింపబడ్డవి. ఈ పాఠశాలలో 68 మంది పురుషులు, ఇద్దలు స్త్రీలు విజ్ఞానాన్ని పొందగలిగారు. వివిధ విషయములలో ఆరితేరిన పెద్దల ఉపన్యాసములిం దేర్పాటు చేయబడ్డవి. హరిజన సమస్యను గూర్చి శ్రీ మాగంటి బాపినీడుగారు మ్యాజికులాంతరు సహాయముతో నుపన్యసించిరి. శ్రీ కొల్లి రంగదాసుగారు వ్యాయామ, ఆసన, యోగాభ్యాస ప్రదర్శనముల చూపారు. హిందీపాఠాలు కూడ విద్యార్థులిందు నేర్చుకున్నారు.

ఈ విద్యాలయం తరఫున దూసరపాలెంలోను, తూర్పుపాలెంలోను రెండు రాత్రిపాఠశాలలు నడుపబడ్డాయి. శ్రీ రామచంద్రరావుగారి 'మా పాఠాలు' అనే పుస్తకాల సహాయంతో పెద్దవారికి పై పాఠశాలా విద్యార్థులు వ్రాత చదువుల నేర్పారు.

పగలు 11 గంటలనుండి 1 గంటవరకు స్కూలు నడచువేళ. నిత్యం ఒకొక్క విద్యార్థి తాహూనాడు చదివిన శాస్త్రీయాంశములను ఉపన్యసించడం, తదుపరి ప్రశ్నలకు జవాబులిచ్చుట మరి పదినిమిషములు జరుగుతుండేది. పాఠముల అనంతరం అందరూ 5 నిముషాలపాటు ఘోషంగా

నిల్పోచవడం మామూలు. ప్రతి నెల 1, 11, 21 తేదీలు సెలవు దినాలు; 22 వ తేది పరీక్షాదినంగా ఉంటుండేవి.

విద్యార్థులలో సంస్కరణోద్దేశములను వ్యాపింపజేయడానికి, మూఢనమ్మకాలను పారద్రోలడానికి అనువైన కార్యక్రమం ఏర్పఱచబడ్డది. ఈ విధమైన కార్యక్రమంతో దీన్ని ఆంధ్రరాష్ట్రీయ వయోజన విద్యాలయంగా మార్చి 1941 ఆగస్టు మాసమునుండి భోజనాది వసతులతో నడపడానికి పూనుకోవడం, ఇంతలో మదరాసు ప్రభుత్వమువారి నిషేధపు టుత్తరువు జారీకావడంకూడ జరిగింది. జిల్లాకలెక్టరుగారు దీనిని నడపుట కనుమతించక పోవడంతో దీనిజీవితం ముగిసింది.

**ఉంగుటూరు : యువజనసంఘము**

పై సంఘంవారు 10-2-41 వ తేది వయోజన రాత్రిపాఠశాల నేర్పఱచి ప్రభుత్వం నిషేధాజ్ఞ ప్రకటించేవరకు నడిపారు. వీరు 150 మంది పెద్దవారికి చదువుచెప్పగలిగారు. ఇందులో 20 మంది స్త్రీలున్నారు. వీరు తమప్రచారంలో పత్రికల నెక్కువగా ఉపయోగించారు.

**దూసరపాలెం - తూర్పుపాలెం:**

ముదునూరు పాఠశాలలో శిక్షణబొందిన కొందరు ప్రచారకులు ముదునూరుకు మైలుదూరమున నున్న దూసరపాలెంలో ఒకపాఠశాల నేర్పరచారు. ఇది 1940 సెప్టెంబరు మధ్యలో నెలకొల్పబడింది. దీనిలో 30 మంది చదువునేర్చుకున్నారు. తరువాత అక్కడకు దగ్గరలోనున్న తూర్పుపాలెంలో కూడా 1941 ఏప్రిల్ నెలలో మరొకపాఠశాల నేర్పరచి వయోజన విద్యావ్యాప్తికై వీరు కృషి చేశారు. ప్రభుత్వంవారి నిషేధంవలన నీరెండు పాఠశాలలను మూయవలసివచ్చింది.

## గుంటూరుజిల్లా

**ఉప్పుగుండూరు : శ్రీ దేశోద్ధారకగ్రంథాలయము**

ఒంగోలుతాలూకా ఉప్పుగుండూరు గ్రామములోని పై గ్రంథాలయమువారు 1941 సం. ఫిబ్రవరి నెలలో నొక వయోజన పాఠశాలను స్థాపించారు. దీనిలో చదువుకొన్న విద్యార్థులు 10 మంది. ఒకమాతా తయారైనపిమ్మట క్రొత్తమూతాను చేర్చుకొని చదువుచెప్పుటకు వీరేర్పాటు చేసుకొన్నారు. తడవకు 10 మందికంటె ఎక్కువ విద్యార్థులను వీరుచేర్చుకోరు.

**రేపూడి - ఫిరంగిపురం :**

గుంటూరు తాలూకాకు చెందిన పైరెండుగ్రామములలో కొల్లూరు శిక్షణశిబిరములో శిక్షణపొందిన విద్యార్థులు కొందరు వయోజనవిద్యా కేంద్రాలను గతవేసవిలో ఏర్పాటుచేశారు. కాని కొద్దిరోజులలోనే ఫిరంగిపురం కేంద్రం మూసివేసి రేపూడి కేంద్రమాత్రం సాగించగలిగారు.

*** అమృతలూరు :**

అమృతలూరు గ్రామయువజనసంఘ పక్షాన 1940 సం. అక్టోబరు, నవంబరు నెలలలో ఒక వయోజన విద్యాకేంద్రం నడుపబడింది. 1941 సం. ఏప్రిల్ నెలలో తిరిగి 4 కేంద్రాలు ప్రారంభింపడి ఇందు రెండుకేంద్రాలు మాత్రం $1\frac{1}{2}$ మాసము పనిచేశాయి. వీరి యీ ప్రచారఫలితంగా 60 మంది వయసుమీరినవారు కొంతవరకు చదువుకున్నారు. వీరు శ్రీ గోపరాజు రామచంద్రరావుగారి 'మాపాఠాలు' అనే పుస్తకాల నుపయోగించారు.

*** ఆలపాడు : హరిజనరాత్రిపాఠశాల**

ఈ గ్రామంలో 1937 సం. నుండి శ్రీ చుండూరు వెంకయ్యగారు పై పాఠశాలను నడుపుతున్నారు. గుంటూరుజిల్లా హరిజనసేవకసంఘంవారున్నూ, గుంటూరుజిల్లాబోర్డువారున్నూ ఈ పాఠ

శాలా నిర్వహణకై తగు సాయం చేస్తున్నారు. దీనిలో చదువుకొనువారు 10 నుండి 15 మంది వరకు ఉంటారు.

*** పెదపూడి :**

పెదపూడిగ్రామ యువజనసంఘంవారి యాజమాన్యమున 1940 సం. మే, జూన్ నెలలలో రెండు వయోజన విద్యాప్రచార కేంద్రముల నేర్పరచి 25 మంది పెద్దవారికి విద్య గరుపబడింది. తిరిగి 1941 సం. మే నెలలో ఒక వయోజనపాఠశాల నేర్పరచి విద్యాప్రచారానికి పూనుకొని ప్రభుత్వం నిషేధం రాగానే నిర్వాహకులు దీనిని మూసివేశారు. వీరు తమ ప్రచారము నెక్కువగా హరిజన వాడలో చేశారు.

*** మంచికలపూడి :**

యువజన విద్యామందిరమను పేరుగల స్థానిక గ్రంథాలయపక్షమున 1940 ఆగస్టు 12 వ తేదీనుండి 3 మాసము లిచ్చట రాత్రిపాఠశాల యొకటి సాగింపబడింది. ఇందు యువకులు 45 మందికి చదువుతో పాటు చరిత్ర, విజ్ఞానశాస్త్రం, భూగోళం సామాన్యంగా నేర్పబడ్డవి. ఈ పాఠశాల తిరిగి 1941 ఏప్రిలులో ప్రారంభింపబడి చదువు చెప్పుటలో నూతన విధానముల నవలంబించు ప్రయత్నములో నుండుసరికి జూన్ నెలలో వచ్చిన ప్రభుత్వ నిషేధాజ్ఞతో మూయవలసివచ్చింది.

*** మోపర్రు : యువజనసంఘం**

పై సంఘమువారు 1941 వేసవిలో 3 వయోజన విద్యాలయాల నేర్పరచి 50 మంది వయోజనులకు చదువు చెప్పారు. వీరు అక్షరాలను దిద్దించు పద్ధతినే అవలంబించారు. నెలరోజులివి సాగిన పిమ్మట ప్రభుత్వమువారి నిషేధపు టుత్తరువు రాగా ఇవి మూయబడ్డవి.

*** యడ్లపల్లి :**

పై గ్రామమున 1941 వేసవిలో వయోజన విద్యాలయ మొకటి నడుపబడింది. శ్రీ గోపరాజు రామచంద్రరావుగారి 'మా పాఠాల' తో పాటు భూగోళము, చరిత్ర, ఆరోగ్యము, రాజకీయార్థిక శాస్త్రములు విద్యార్థులకు బోధింపబడినవి. 10 మందితో ప్రారంభమైన ఈ విద్యాలయము 40 దినముల అనంతరము ఇద్దరితో ముగింపబడినది.

*** రేవేంద్రపాడు :**

ఈ గ్రామ యువకులు కొందరు గ్రామములో రెండుచోట్ల మొత్తం 40 మంది వయోజనులకు చదువు చెప్పారు. 1—5—41 వ తేదిన ప్రారంభించి 15—6—41 వ తేది వరకు పాఠశాలలు నడిచాయి. వీరును శ్రీ రామచంద్రరావుగారి పుస్తకాలనే ఉపయోగించారు.

*** సంగంజాగర్లమూడి : సర్వజనవిద్యాప్రదాయినీ పుస్తకభాండాగారము**

పై గ్రంథాలయంవారు 16-1-40 వ తేదినుండి 31-3-40 వ తేదివరకు వయోజన విద్యాలయాలు 3 కేంద్రాలలో నడిపారు. వీటిలో 33మంది పెద్దవారు చదువు నేర్చుకొన్నారు. 1940 నవంబరు నుండి 1941 మే నెలాఖరువరకు ఒక కేంద్రంలో మాత్రం 24 గురు హరిజనులకు వీరు చదువుచెప్పారు.

**వంగిపురం : యువజనసంఘం**

బాపట్లతాలూకా వంగిపురంలోని పై సంఘమువారు 1941 మే మాసమునుండి జులై నెలవరకు రెండుకేంద్రాలలో పాఠశాలల నడిపారు. వీటిలో యువకులు 35 మంది, పెద్దవారు 42 మంది చదువుకున్నారు.

---

* ఈగుర్తుగల గ్రామములన్నీ తెనాలితాలూకాకు చెందినవి.

**గూడవల్లి : నెహ్రూగ్రంథాలయము**

రేపల్లెతాలూకాకు చెందిన గూడవల్లిలోని పై గ్రంథాలయ యాజమాన్యమున 1941 వేసవిలో ఒక నెలరోజులు వయోజన విద్యాలయమొకటి సాగింపబడింది. ఈపాఠశాలలో 40 మంది వయోజనులు చదువుకొన్నారు. ప్రచారకులుగా శిక్షణబడసిన విద్యార్థులీపాఠశాలను నిర్వహించారు.

**మాదల :**

సత్తెనపల్లితాలూకా మాదల గ్రామములో వయోజన కేంద్రపాఠశాల 1941 సం. మే నెల 6 వ తేదీన ప్రారంభింపబడింది. దీనిలో 50 మంది వయోజనులు చదువుకొన్నారు. ఈ కేంద్ర నిర్వహణానికి రు 12-0-0 ఖర్చు అయింది. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి "వయోజనవిద్య-మొదటి పుస్తకము" ప్రచారానికి ఉపయోగించబడింది. ప్రజలకవసరమైన సామాన్య విజ్ఞానాన్ని వారి కందుబాటులో నుంచుటకు నిర్వాహకులు కృషిచేశారు. ఈ కేంద్ర నిర్వహణానికి పెన్మెత్స సుబ్బరాజుగారున్ను కొందరు హైస్కూలు విద్యార్థులున్ను తోడ్పడ్డారు.

## ఇతర జిల్లాలు

**కాళహస్తి - వెంకటగిరి :**

చిత్తూరు - నెల్లూరుజిల్లాలకు చెందిన పై రెండుప్రదేశములలోను విద్యార్థిసంఘాల యాజమాన్యాన వయోజనవిద్యాలయాలు నడుపబడ్డాయి. జి. యస్. బాలాజీగారు రెండుచోట్లను ఆర్గనైజరుగా పనిచేశారు. ప్రచారం 1941 మే, జూన్ మాసాలలో 45 రోజులు జరిగింది. వెంకటగిరిలో హైస్కూలువారు మ్యాపులనిచ్చి తోడ్పడ్డారు.

**పెదపాడు :**

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుతాలూకాలోని పెదపాడు గ్రామములోని యువజనులు 1941 మే 1 వ తేదిన గ్రామములో గొప్పఊరేగింపు జరిపి సాయంత్రం వయోజనవిద్యావ్యాప్తి నిమిత్తం బహిరంగసభను ఏర్పాటుచేసిరి. పాఠశాల మే నెల 5 వ తేదీన ప్రారంభమైనది.

**పెరంబూరు : ఆంధ్రజాతీయ రక్షణపాఠశాల**

పెరంబూరు (మద్రాసు) లోని బారక్సుడివిజనులో తెనుగుకార్మికులకోసం పై పాఠశాల 1940 జనవరిలో స్థాపించబడ్డది. శ్రీయుత న్యాయపతి నారాయణమూర్తి మొదలగువారు దీనికికొంత తోడ్పడ్డారు. ఈపాఠశాలలో హిందీ, ఇంగ్లీషు భాషలుకూడ కొంతవరకు నేర్పారు. పోషణలేక 1941 మే నెలలో ఇది మూసివేయబడింది.

ప్రతివేయి జనాభాలోను ఇంగ్లాండులో 18 మంది, స్కాట్లండులో 16 గురు, అమెరికా సంయుక్త రాష్ట్రములలో 77 గురు మాత్రమే చదువురానివారై యుండగా—

158 సంవత్సరములనుండి ఆంగ్లేయుల పరిపాలనక్రింద నున్న మనదేశములో 100 కి 90 మంది చదువురాని వారున్నారు.

# సమాచారాలు - సలహాలు

## ఆంధ్ర గ్రంథాలయోద్యమము

### ఆం. దే. గ్రం. సంఘ సమావేశములు

23–8–41 వ తేదీ శనివారము రాత్రి 8—30 గంటలకు ఆంధ్రదేశగ్రంథాలయ సంఘ సర్వసభ్య సభ తెనాలి మారీసు పేటలోని ఆంధ్రరత్న గ్రంథాలయ భవనమున కూడినది.

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగా రధ్యక్షత వహించిరి.

హాజరుసభ్యులు 22 మంది.

తీర్మానములు :

౧. 1940–41 వ సం॥ కార్యనివేదికను ఆడిటరు రిపోర్టు* తో సహా అంగీకరింపడమైనది.

౨. ఈ క్రిందివారిని 1941–42 వ సంవత్సరమునకు పాలకవర్గముగ నెన్నుకొనడమైనది.

అధ్యక్షులు : శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు

ఉపాధ్యక్షులు : శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, అయ్యంకి వెంకటరమణయ్యగారు, నాగినేని వెంకయ్యగారు, కోశాధిపతి : శ్రీ కొమ్మూరు సీతారామయ్యగారు

కార్యదర్శి : శ్రీ పాతూరి నాగభూషణంగారు

సహాయకార్యదర్శులు : శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు, వట్టికోట ఆళ్వారుస్వామి, ఈడుపుగంటి శివమూర్తిగార్లు

సభ్యులు : శ్రీ పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు, వేగేశన సూరపరాజు, డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి, శ్రీ భట్టకుమారస్వామి, సూరపరాజు కోటయ్య, మందలపర్తి ఉపేంద్రశర్మ, ఈడుపుగంటి వెంకటరత్నమాంబ, బయ్యా సూర్యనారాయణమూర్తి, కల్లూరు సుబ్బారావు, యం. వి. పాపన్నగుప్త, హాలాహల్వి సీతారామరెడ్డి, కుసుమ ధర్మన్నకవిగార్లు

---

* 9—1—40 వ తేదిన ఏలూరునందు కూడిన పాలకవర్గ సమావేశమునందు చేయబడిన 3 వ తీర్మానము ననుసరించి కార్యాలయపు ఏర్పాటులకుగాను వసూలుచేయబడిన మొత్తమునకు జమా ఖర్చులు ప్రత్యేకముగా ఉంచబడినవి. ఓచర్లు, విక్రయదస్తావేజులు, రశీదులు ఉంచబడి లెక్కలు సరిగా వ్రాయబడినవి.

ఆంధ్రదేశగ్రంథాలయ సంఘపు 1940–41 సంవత్సరమునకు కోశాధిపతిగారు తయారుచేసిన ఆదాయవ్యయపట్టిక తనిఖీచేసి సరిచూడబడినది. కాతాలు సక్రమముగా ఉంచబడినవి. డూప్లికేటు రశీదులు మాత్రం ఉన్నవి. రశీదుపుస్తకము లన్నియు లేని కారణమున జమపద్దులు అన్నియు సరి చూచుటకు అవకాశము లేకపోయినది. ఓచర్లు పూర్తిగా యున్నవి.

మకాం–తెనాలి
12—8—41

(సం.) యస్. రామసుబ్బారావు,
ఆడిటరు.

3. 1941-42 వ సం॥ బడ్జెటును తయారుచేసికొనుటకు నూతన పాలకవర్గము వారికధికారమీయడమైనది.

౪. 21-11-40 వ తేదీ బెజవాడలో కూడిన పాలకవర్గము వారి 8 వ తీర్మానములో చేయబడిన సూచనప్రకారము డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారిని సంఘశాశ్వత గౌరవసభ్యులుగ నెన్నుకొనడమైనది.

౫. మద్రాసు ప్రభుత్వమువారు గ్రంథాలయములకు గ్రాంటులిచ్చుటకై 1941-42 వ సం॥ బడ్జెటులో కొంతద్రవ్యమును ప్రత్యేకపరచినందులకై వారినభినందించుచు, స్థానిక సంస్థల గ్రంథాలయములతోపాటు కమిటీగ్రంథాలయములకు కూడ తగిన విరాళము లిప్పించుట అవసరము, ఉచితము, ధర్మముఅని ఈసంఘమువారు ప్రభుత్వమువారికి సూచించుచున్నారు.

౬. వయోజన విద్యాప్రచారము విషయమున గడచిన జూన్ మాసములో మద్రాసుప్రభుత్వమువారు జారీచేసిన ఉత్తర్వు అభివృద్ధికి భంగకరమును, ప్రజాస్వాతంత్ర్యమునకు విరోధమును నైనందున వెంటనే దానిని రద్దుపరచుకొనవలసినదిగ ప్రభుత్వమువారి నీసంఘమువారు కోరుచున్నారు.

(సం॥) గాడిచర్ల హరిసర్వోత్తమరావు, అధ్యక్షులు

1-11-41 వ తేదీ శనివారము మధ్యాహ్నము 1 గంటకు బెజవాడతాలూకా కవులూరు గ్రామములోని శ్రీ విజ్ఞానోదయ గ్రంథాలయభవనమున ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘపాలకవర్గము శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి అధ్యక్షతనుసమావేశమైనది.

హాజరు : శ్రీ నాగినేని వెంకయ్య, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య,
శ్రీ వేగేశన సూరపరాజు, శ్రీ కొమ్మ సీతారామయ్య,
శ్రీ పాతూరి నాగభూషణం.

తీర్మానములు :

౧. మన సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి సతీతిలకము శ్రీమతి గాడిచర్ల రామాబాయమ్మగారి మరణమునకీ సంఘమువారు చింతించుచు వారి కుటుంబమునకు తమ సానుభూతిని తెలుపుచున్నారు.

౨. విమర్శకాగ్రేసర శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారి మరణమునకీ సంఘమువారు చింతించుచు వారి ఆత్మశాంతికై పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

3. 1941-42 సం॥ నకు దిగువ నుదహరించిన బడ్జెటు అంచనా అంగీకరించడమైనది.

## ఆదాయము

| రు. అ. పై. | |
|---|---|
| 39—11—9 | ప్రారంభనిల్వ |
| 4700— 0—0 | బిల్డింగు ఫండు |
| 450— 0—0 | చందాలు, విరాళములు |
| 150— 0—0 | పుస్తకాల అమ్మకం |
| 150— 0—0 | గ్రం. శి. తరగతుల రుసుములు |

## వ్యయము

| | | రు. అ. పై. |
|---|---|---|
| | భవననిర్మాణము వగైరా | 4500—0—0 |
| | సలముబాకీ | 200—0—0 |
| | పుస్తకాల అచ్చు (లోగడవానితో) | 200—0—0 |
| | నివేదిక | 40—0—0 |
| | అచ్చు, స్టేషనరీ | 40—0—0 |
| | గ్రం. శి. తరగతుల ఏర్పాట్లు | 250—0—0 |
| | ప్రయాణము | 100—0—0 |
| | పోస్టేజివగైరా | 60—0—0 |
| | సాదరు | 10—0—0 |
| | ఇతరసంఘాల చందాలు | 20—0—0 |
| | పుస్తకాల కొనుగోలు | 50—0—0 |
| | అంత్యనిల్వ | 19—11—9 |
| 5489—11—9 | మొత్తము | 5489—11—9 |

౪. ఆంధ్రమహాసభకు ఈ సంఘపక్షమున ప్రతినిధుల నియమించుటకు కార్యదర్శి కధికార మీయడమైనది.

౫. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమము యొక్కయు, గ్రంథాలయముల యొక్కయు, చరిత్రలను తయారుచేయుటకు తీర్మానించడమైనది.

౬. పైరెండు చరిత్రలను తయారుచేయుటకు రు ౬000–0–0 శాంక్షను చేయవలసినదిగ మద్రాసు ప్రభుత్వము వారిని కోరడమైనది.

౭. ఈ ప్రయత్నమునకు ఆంధ్రదేశములోని జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, కో-ఆపరేటివు సెంట్రల్ బ్యాంకులు సంపూర్ణమగు ఆర్థికసహాయమును, ఇతర సహాయములను చేయుటకు కోరడమైనది.

౮. మద్రాసుప్రభుత్వమువారి 11–3–1940 తేదీ జీ. వో. చదవడమైనది.

(అ) ఆంధ్రదేశగ్రంథాలయ సంఘముచేగాని, ఇతర గ్రంథాలయ సంఘములచేగాని, యూనివర్శిటీలచేగాని, ప్రభుత్వానుమతిని పొందిన తదితర సంస్థలచేగాని నడుపబడు గ్రంథాలయశిక్షణ తరగతులయందు తర్ఫీతు పొందినవారిని మాత్రమే స్థానిక సంస్థలచే నిర్వహింపబడు గ్రంథాలయములలో గ్రంథభాండాగారులుగ నియమింపవలెననియు, అట్టివారికి రు 50–0–0 లకు తక్కువగాని జీతముల నిచ్చుచుండవలెననియు ఈ సంఘమువారు ప్రభుత్వమువారికి సూచించుచున్నారు.

(ఆ) చిన్న గ్రంథాలయములకైనను శిక్షణబొందిన గ్రంథభాండాగారి అత్యంతావసరమనియు, పెద్ద గ్రంథాలయములకు అట్టి భాండాగారియు, ఆయనకు తోడ్పడుటకు ఒక అటెండరును అత్యంతావశ్యకమని ఈ సంఘమువారు ప్రభుత్వమువారికి సూచించుచున్నారు.

౯. గ్రంథాలయోద్యమమునకు, ఆంధ్రభాషకు, ఆంధ్రోన్నతికి అత్యుత్తమమగు సేవజేసిన శ్రీయుతులు మంగిపూడి వేంకటశర్మ, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిలుగార్లకు వారల షష్టిపూర్త్యుత్సవ సందర్భములలో వారి నీ సంఘపక్షమున తగు రీతిని సన్మానించుటకు తీర్మానించడమైనది.

**(సం.) అయ్యంకి వేంకటరమణయ్య, ఉపాధ్యక్షులు**

22-11-41 వ తేది మధ్యాహ్నము 1 గంటకు విశాఖపట్టణమునందలి హిందూపఠన మందిరమున ఆంధ్రదేశగ్రంథాలయ సంఘ పాలకవర్గము శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి అధ్యక్షతను సమావేశ మైనది.

హాజరు: శ్రీ పా. నాగభూషణం, శ్రీ వేగేశన సూరపరాజు, శ్రీ పీ. వేం. కృష్ణమాచార్యులు, శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, శ్రీ భట్టు కుమారస్వామి

తీర్మానములు ;

౧. 23 వ ఆంధ్రదేశగ్రంథాలయ మహాసభను తెనాలితాలూకా పెదపాలెములో జరుపుటకు తీర్మానించడ మైనది.

(సం.) మారేపల్లి రామచంద్రశాస్త్రి, ఉపాధ్యక్షులు

24-11-41 వ తేదీ మధ్యాహ్నము 1 గంటకు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ పాలకవర్గము విశాఖ పట్టణమునందలి హిందూపఠనమందిరమున శ్రీయుత మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి అధ్యక్షతను సమావేశ మైనది.

హాజరు: శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, శ్రీ వేగేశన సూరపరాజు, శ్రీ భట్టు కుమారస్వామి, శ్రీ పీతాంబరం వేంకటకృష్ణమాచార్యులు, శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి

తీర్మానములు :

౧. గ్రంథాలయ సర్వస్వమును రాబోవు జనవరినుండి తిరిగి ప్రకటించుటకు ఏర్పాట్లు చేయుచున్నట్లు 'ఆంధ్రప్రభ' లో ప్రకటిత మైన వార్తను చదవడ మైనది.

ఇదివరలో ఆంధ్రదేశగ్రంథాలయ సంఘపక్షమున నడుపబడిన 'గ్రంథాలయసర్వస్వము' అను పేరుతోనే ఆంధ్రదేశగ్రంథాలయ సంఘపత్రికను ప్రచురించుట ఉద్యమ ప్రధానులకు హితవుగ కనబడుచున్నందున 'ఆంధ్రగ్రంథాలయం' అను పేరుకుబదులు 'గ్రంథాలయ సర్వస్వము' అను పేరుతోనే పత్రికను 1942 వ సం. జనవరినుండి ప్రచురించుట కీసంఘమువారు తీర్మానించుచున్నారు.

౨. (అ) సుమారు 50 సంవత్సరముల కాలమునుండి గ్రంథాలయోద్యమ వ్యాప్తికై ఎడతెగక పాటుబడుచున్నట్టియు, కుముదవల్లి (భీమవరం తాలూకా - పశ్చిమగోదావరి) లోని శ్రీ వీరేశలింగ కవి సమాజస్థాపకులును, నాటినుండి నేటివరకు దానిని నిర్విఘ్నముగ నిర్వహించుచున్నవారును నైన గ్రంథాలయ పితామహులు శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారిని తగురీతిని సన్మానించుటకు తీర్మానించడ మైనది.

(ఆ) ఈసందర్భమున వారి గౌరవార్థము ప్రకటించునిమిత్తమొక సంచికను తయారుచేయుటకు తీర్మానించడ మైనది.

(ఇ) పైకార్యముల నిర్వహించుటకు దిగువవారిని ఉపసంఘముగ నియమించడ మైనది.

శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు, డాక్టరు పాలకోడేటి సత్యనారాయణశర్మగారు, శ్రీ తేతలి సత్యనారాయణమూర్తిగారు, శ్రీ వేగేశన సూరపరాజుగారు, శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు—సమావేశకర్త.

(సం.) మారేపల్లి రామచంద్రశాస్త్రి, ఉపాధ్యక్షులు

# ఆంధ్రదేశ గ్రంథాలయ శిక్షణ తరగతులు

## మూడవ వేసవి పాఠశాలా నివేదిక

### ప్రారంభోత్సవము

1941 వ సం. మే నెల 1 వ తేది సాయంత్రము బెజవాడతాలూకా పటమట గ్రామమందలి శ్రీ అచ్చయ్య ధర్మ గ్రంథాలయావరణలో నై పాఠశాలా ప్రారంభోత్సవము జరిగెను. ఆం. దే. గ్రం. సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎం. ఏ, గారు సభకధ్యక్షత వహించిరి. ప్రార్థనానంతరము మదరాసు గ్రంథాలయ సంఘ కార్యదర్శి శ్రీ యస్. ఆర్. రంగనాథన్ గారును, ఆం. దే. గ్రం. సంఘోపాధ్యక్షులు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును పంపిన సందేశములు చదువబడెను. ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు 1914 వ సం. లో స్థాపింపబడిన ఆం. దే. గ్రం. సంఘము 1921 వ సం. లో ఒక పర్యాయమును, 1934 వ సం. లో ఒక పర్యాయమును గ్రంథాలయ సేవకులకు తరిబీయతు నిచ్చునిమిత్తమిట్టి పాఠశాలలను నడిపెననియు, ఇందు రెండవ పాఠశాలలో తాము, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, శ్రీ కలిదిండి నరసింహరాజుగారు మున్నగువారు చదివియుంటిమనియు, గ్రంథాలయ శిక్షణావసరమును గ్రహించిరేమో ఉద్యమ వికాసమున కత్యంత దోహదమగు నీ పాఠశాల నిప్పుడు ప్రారంభించుచుంటిమనియు, గ్రంథాలయ శాస్త్రవిషయమై సంపూర్ణ పరిజ్ఞానము నొక్క మాసము దినములలో కలిగించుట సాధ్యము కాదనుతలంపుతోను గ్రంథాలయ నిర్వహణకు సంబంధించిన అంశములతోపాటు గ్రంథ భాండారులకు ముఖ్యముగ కావలసిన ఇతర విషయములనుకూడ జేర్చి ప్రప్రథమమున ఒక మాసము దినములు 'గ్రంథాలయ ప్రవేశిక' తరగతులు నడుపబూనితి మనియు ఇందు శిక్షణబొందినవారు గ్రంథాలయ శాస్త్రమున ప్రాముఖ్యమును గడించుట కనుకూలముగ మఱి రెండు నెలలపాటు 'గ్రంథాలయ నిర్వాహక' తరగతులు కొంతకాలమైన పిదప నడుపబడుననియు చెప్పి గ్రంథాలయ సేవకులెల్లరీ అవకాశమును వినియోగించుకొని తమధర్మమును క్రమముగ నిర్వర్తించుటకై పూనుకొనవలసినదిగ హెచ్చరించిరి.

అంతట అధ్యక్షులవారు సంఘముయొక్క నిత్యజీవితములో గ్రంథాలయము లెంత ప్రధానములైనవో తెలిపి ఇట్టిమహత్తర సంస్థల నడపువారు సుశిక్షితులై యుండవలసిన అవసరమును వివరించిరి. విద్య ప్రాథమికవిద్య, వయోజనవిద్య అని రెండు తెరగులుగ నున్నదనియు, ఇందువయోజన విద్యావ్యాప్తి గ్రంథాలయములద్వారానే ఎక్కువగ జరుగవలసి యున్నదనియు చెప్పిరి. మఱియు అమెరికా దేశమున కొకప్పుడధ్యక్షుడైన వడ్రంగిబాలకుడు అబ్రహాంలింకను జీవితమును, కోయంబత్తూరు నివాసియు అంధ్రపుత్రుడుననగు శ్రీ దొరస్వామినాయుడుగారి ప్రస్తుత ప్రతిభయు విద్యయొక్క మహత్వమున కెట్లు నిదర్శనములో వారుదాహరణపూర్వముగ సెలవిచ్చిరి. శ్రీనాయుడుగారు పసితనమున విద్య నేర్వలేదు. వయసువచ్చిన తదుపరి వీరు దీక్షతో విజ్ఞానమునార్జించి, విదేశసంచారమును గావించి, వివిధయంత్రాగారముల నిచ్చట స్థాపించి ధనముతోపాటు విశేషకీర్తిని గడించిరి. ధనసంపాదనమే పరమలక్ష్యముగ నెంచక వీరు పెద్దలవిద్యాప్రబోధమున కనుకూలించు రకరకముల ఫిల్ములను—విజ్ఞాన శాస్త్రమునకును, ఇతరవిషయములకును సంబంధించినవానిని — తయారుచేయించి వీనిని ప్రజలలో వ్యాపింప జేయుచున్నారు. కాన మనదేశమునందలి ప్రతిఒక్కరును వీరినాదర్శముగ నుంచుకొని తాము పనిలోనున్నను స్వశక్తిచే విద్యయొక్క ఆధారముతో వృద్ధికి రావచ్చుననియు, జనసామాన్యమున కీశక్తిని గల్గించుటకై గ్రంథాలయములెంతగనో తోడ్పడవచ్చుననియు, ఈవిషయమును గమనించి గ్రంథాలయ నిర్వాహకులు శ్రద్ధతో కృషిసల్పుచో తామెంతగనో దేశాభివృద్ధికి తోడ్పడగలరనియు,

ఈ కృషివిధానమును వీరికి నేర్పుటకే ప్రస్తుత శిక్షణ తరగతు లేర్పడినవనియు చెప్పి అధ్యక్షులవారు తమ ఉపన్యాసమును ముగించిరి. వందన సమర్పణముతో ప్రథమదిన కార్యక్రమము ముగిసెను.

### పాఠములు

మరుసటిదినమునుండి నెలాఖరువరకు ఉదయ సాయంకాలములందు గ్రంథాలయ నిర్మాణము, గ్రంథాలయ నిర్వహణము, గ్రంథనిర్ణయము, ప్రత్యేక గ్రంథాలయ సమస్యలు, వయోజనవిద్య; సంస్కృతాంధ్ర హిందీవాఙ్మయముల చరిత్ర, హిందీ, రాజకీయార్థిక భూగోళ వాతావరణ శాస్త్ర పాఠములు, ఆంధ్రులచరిత్ర బోధింపబడెను. మధ్యాహ్న సమయములలో పుస్తకముల బైండింగు, గ్రంథాలయ పట్టికలను వ్రాయు విధానము నేర్పబడెను. బైండింగు నేర్పుటకు బెజవాడలోని విజయ ప్రెస్సువారు తమ పనివానిని పంపి సాయపడిరి. ఆయా ఉపన్యాసకులు బోధించిన పాఠముల వివరము దిగువ నుదహరించబడినది.

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, ఎం. ఏ. — వయోజనవిద్య, రాజకీయము, అర్థశాస్త్రము, భూగోళము, వాతావరణశాస్త్రము, సంస్కృతవాఙ్మయచరిత్రము.

శ్రీ పాతూరి నాగభూషణంగారు, డిప్. లిబ్. — గ్రంథాలయనిర్మాణము (గ్రం. చట్టము మినహా), గ్రంథాలయ నిర్వహణము, గ్రంథనిర్ణయము, ప్రత్యేక గ్రంథాలయ సమస్యలు.

డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు, ఎం. ఏ., పిహెచ్. డి. — ఆంధ్రుల చరిత్ర

కవిరాజు విశ్వనాథ సత్యనారాయణగారు, ఎం. ఏ. — ఆంధ్ర వాఙ్మయచరిత్ర

ఉభయభాషాప్రవీణ వడ్లమూడి వెంకటరత్నంగారు — వయోజనవిద్య, తెలుగు లక్షణగ్రంథములు

విద్వాన్ ఓరుగంటి వేంకటేశ్వరశర్మగారు, బి. ఓ. యల్.<br>
సాహిత్యరత్న శ్రీ కంచర్ల వెంకటకృష్ణయ్యగారు<br>
} హిందీ పాఠములు, హిందీ సాహిత్యచరిత్రము

శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు, ఎం. ఏ., — వయోజనవిద్య

శ్రీ తేకుమళ్ళ రామచంద్రరావుగారు, ఎం. ఏ, బి. ఎల్. — గ్రంథాలయ చట్టము

### ఇతరకార్యక్రమము

పై పాఠములుగాక విద్యార్థులఉపయోగము నిమిత్తము వాగ్వర్ధనీ సభను నెలకొల్పి— "విజ్ఞానమా ? రాజకీయమా ? ఏదిముందు ?" "గృహపరిశ్రమలా ? కర్మాగార పరిశ్రమలా ? భారతదేశమున కేవిముఖ్యము ?" "పల్లెలకు మరలవలయునా ?" అను నంశములపై చర్చలేర్పాటు చేయబడెను. ఈసభకు విద్యార్థులలో నొకరగు శ్రీయుత పమ్మి వెంకటరమణారెడ్డిగారు కార్యదర్శిగ నెన్నుకొనబడిరి. మానవధర్మము, పరిణామవాదము, ప్రజాపరిపాలనము, విజ్ఞానము, అహింస, వయోజనవిద్యా ప్రచారానుభవము మున్నగు విషయములను గూర్చి అనుభవజ్ఞులచే నీసభాపక్షమున ఉపన్యాసము లిప్పించబడెను. ఈ కార్యక్రమములో శ్రీయుతులు ఓరుగంటి వేంకటేశ్వరశర్మ, గోపరాజు రామచంద్రరావు, దిగవల్లి వేంకటశివరావు, కాట్రగడ్డ రాజగోపాలరావు, కోతాయ రామారావుగార్లు మాకు తోడ్పడిరి. గ్రంథాలయములలో పిల్లలకు కథలు చెప్పువిధానము ప్రత్యక్షముగ చూపబడెను. ఈపనిని శ్రీ ఓరుగంటి వెంకటేశ్వరశర్మగారు కడునేర్పుతో నిర్వహించిరి.

పాఠశాలా కార్యక్రమము, పరీక్షలు ముగియుటతోడనే జూన్ 1, 2 తేదీలలో విద్యార్థులు గ్రంథాలయముల కార్యక్రమమును స్వయముగ పరిశీలించుట కవకాశము గల్పించుటకై తెనాలితాలూకాలోని రేవేంద్రపాడు, పెదపాలెము, పేరకలపూడి, దుగ్గిరాల గ్రామములలో శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి నాయకత్వమున యాత్రయొకటి యేర్పాటుచేయబడెను. ఈ యాత్రలో శ్రీ కోమా

సీతారామయ్య, వడ్లమూడి వెంకటరత్నంగార్లు పాల్గొనిరి. పైన పేర్కొనబడిన గ్రామములలో వేర్వేరుదశలలోనున్న గ్రంథాలయముల దర్శించి వాని నిర్వహణపద్ధతులను గ్రహించుటకు వీలు కలిగెను. పేరకలపూడి శ్రీ జ్ఞానోదయ గ్రంథాలయ భవనములో 'పంచాంగము' ను గూర్చి శ్రీవడ్లమూడి వేంకటరత్నంగారు అమూల్యమగు ప్రసంగమును గావించిరి. దుగ్గిరాలలోని శ్రీ భాషాభిలాషిణీ సంఘ వార్షికోత్సవమునకు శ్రీ హరిసర్వోత్తమరావుగారధ్యక్షత వహించిరి.

2 వ తేది రాత్రి గ్రంథాలయ విద్యార్థులు దుగ్గిరాల గ్రంథాలయ భవనములో సమావేశమై గ్రంథాలయ సేవకసమితి నొకదాని నేర్పాటు చేసికొనిరి. ఇందు గ్రంథాలయశిక్షణ బడసినవారి నందఱిని సభ్యులుగ జేర్చుకొనుటకు, ప్రతి సభ్యుడు ప్రవేశరుసుక్రింద రు 0-4-0 చెల్లించుటకును ఈ సమితి ఆం. దే. గ్రం. సంఘమువారి ఉత్తరువుల ననుసరించి పనిచేయుటకును నిర్ణయము జరిగెను.

## విద్యార్థులు - పరీక్షాఫలితములు

పాఠశాలలో చేరి చదివినవారిలో 11 మంది గ్రంథాలయముల ప్రతినిధులు, 7 గురు విద్యార్థులు గలరు. మొత్తము శిక్షణబొందిన 21 మందిలో ఒకరు పరీక్షకు హాజరు కాలేదు. మఱొకరు ఆలస్యముగ వచ్చిన కారణముచే అన్ని పరీక్షల నిచ్చుటకు వీలుకలుగలేదు. పోగా మిగిలిన 19 మందిలో 10 మంది పూర్ణముగను, ఇద్దరు మొదటిభాగమునందును ఉత్తీర్ణులైరి. ఉత్తీర్ణులైనవారి పేర్లు, మార్కులు, తరగతి వివరములు దిగువ నుదహరింపబడినవి.

| | అభ్యర్థి పేరు | మార్కులు | తరగతి |
|---|---|---|---|
| 1. | శ్రీ మేడసాని తిరుపతిరాయుడు | 407½ | I |
| 2. | ,, పమ్మి వెంకటరమణారెడ్డి | 368½ | I |
| 3. | ,, వావిలాల వేంకటసుబ్బయ్య | 312½ | II |
| 4. | ,, కోటంరాజు శంకరరావు | 298 | II |
| 5. | ,, పసుపులేటి శ్రీకృష్ణమూర్తి | 297½ | II |
| 6. | ,, యద్దనపూడి చిరంజీవరావు | 290 | II |
| 7. | ,, తుమ్మల శ్రీరాములు | 278 | II |
| 8. | ,, ధూపం కోటివీరబసవయ్య | 260 | II |
| 9. | ,, రామినేని పూర్ణచంద్రరావు | 258½ | II |
| 10. | ,, కోగంటి నరసింహారావు | 237 | III |
| 11. | ,, యార్లగడ్డ భాస్కరరావు | మొదటిభాగము మాత్రం | |
| 12. | ,, రాజులపాటి బసవయ్య | ,, | |

మా యీ పాఠశాలా నిర్వహణమున సాయపడిన ఉపన్యాసకులకును, దీని నడపుకొనుటకు వసతిని కలిగించిన పటమట అచ్చయ్య ధర్మగ్రంథాలయ ధర్మకర్తలకును, భోజనాదికములను చేసికొనుటకు చోటిచ్చిన పటమట ధర్మసత్రంవారికిని మేముకృతజ్ఞులము. మా పాఠశాలకు ఎట్టి అవాంతరములు గాని రానీయక రాత్రింబవళ్లు శ్రమచేసి సమర్థతతో నిర్వహించిన ప్రధానాచార్యులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి యొక్కయు, విద్యార్థులకు ఉపన్యాసకులకు కూడ భోజనాదికపు టేర్పాటులలో లోటురాకుండ కడుజాగరూకతతో వసతిగృహమును సాగించిన శ్రీ కొమ్మా సీతారామయ్య గారియొక్కయు సేవ చిరస్మరణీయమైనది.

**పాతూరి నాగభూషణం**, కార్యదర్శి, ఆం. దే. గ్రం. సంఘము

# 3 వ ఆంధ్రదేశ గ్రంథాలయసేవక మహాసభ

మదరాసు నగరమునకు చెందిన తాంబరములో పై మహాసభ 1941 డిసెంబరు 25, 26 తేదీలలో ఆర్ట్సభవనమున మాజీ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ మాగంటి బాపినీడు యం. యస్ సి., యం. యల్. ఏ. గారి అధ్యక్షతను జరిగినది.

25 వ తేది మధ్యాహ్నము 2 గంటలకు సభప్రారంభమైనది. పలువురు ఆంధ్రప్రముఖులతోపాటు బరోడాకేంద్ర గ్రంధాలయాధికారి శ్రీ. వి. డి. వాక్నీస్ గారును, మద్రాసు యూనివర్సిటీ గ్రంధాలయాధికారి యస్. అర్. రంగనాథన్ గారును సభనలంకరించిరి. ప్రార్థనానంతరము ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ పేకుమళ్ల రామచంద్రరావు, ఎం. ఏ, బి. ఎల్. గారు సభికులకు స్వాగతమునిచ్చుచు గ్రంధాలయోద్యమముయొక్క ఉత్కృష్టతను, ఆంధ్రదేశమున నీయుద్యమము దినదినాభివృద్ధిచెందిన విషయమును, గ్రంధాలయసభల ప్రయోజనమును గూర్చి కొలదిగ చర్చించిరి. వారికోరికపై శ్రీ పులవర్తి భీమలింగమూర్తి, బి. ఏ., బి. ఎల్. గారు సభను ప్రారంభించుచు గ్రంధాలయములు గ్రామములందలి సాంఘిక జీవనమునకు కేంద్రములై విలసిల్లినవనియు, విజ్ఞాన వ్యాపకకార్యమును పూర్వకాలమున దేవాలయములు నిర్వహించుచుండెడివనియు, ఈ పనిని నేడు గ్రంథాలయములు చేయబూనినవనియు, ఈకార్యక్రమముద్వారా గ్రంథాలయ ప్రచారకులు ఆంధ్రత్వసిద్ధికై కృషిచేసి ధన్యులు కావలయుననియు ప్రబోధించిరి.

అనంతరము అధ్యక్షులు తమ యుపన్యాసమును ప్రారంభించిరి. వీరియుపన్యాసములో తొలుత ఆంధ్రగ్రంధాలయోద్యమ ప్రశస్తియు, జాతీయనిర్మాణ కార్యక్రమములో ఈయుద్యమముయొక్క స్థానమును వివరింపబడెను. స్త్రీలు - గ్రంధాలయములు, పత్రికలు - అరవ తెలుగు పత్రికలకుగల భేదము, నిర్మాణకార్యక్రమమునకు గ్రంధాలయములు చేయగలతోడ్పాటు మున్నగు సంశములు స్థాలీపులాక న్యాయముగ చర్చింపబడెను. ప్రస్తుతపరిస్థితులలో గ్రంధాలయసేవకులు చేపట్టదగిన కార్యక్రమమునుకూడ వీరుకొలదిగ సూచించిరి.

తదుపరి సభ జయప్రదముగ జరుగవలెనని పెద్దలు పలువురు బంపిన సందేశములు చదువబడెను. ఫలహారానంతరము కొన్ని ఉపన్యాసములు చదువబడి కొందఱు స్వయముగ నుపన్యసించుటకు జరిగెను. ఈ ఉపన్యాసములపై చర్చలకుకూడ అవకాశమీయబడెను. బరోడానుండి వచ్చిన వాక్నీసుగారు బరోడా గ్రంథాలయోద్యమమును గూర్చియు, శ్రీ రంగనాథన్ గారు చిన్న గ్రంథాలయములకు సహితము గ్రంథవర్గీకరణపద్ధతి అవసరమను విషయముపైనను ఆంగ్లమున నుపన్యసించిరి.

26 వ తేది ఉదయము ఇష్టాగోష్ఠి నడచినది. మధ్యాహ్నము తిరిగి కొన్ని ప్రసంగములు, సంప్రదింపులు సాగినవి.

సభలో చదువబడిన వ్యాసములు :

1. గ్రంథాలయములు - లోకల్ బోర్డులు—డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారు
2. ఆంధ్రదేశమునకు విశ్వగ్రంథాలయము—కల్లూరి సుబ్రహ్మణ్యదీక్షితులుగారు
3. అఖిలభారత గ్రంధాలయోద్యమము—పి. కొండారెడ్డిగారు
4. గ్రామ గ్రంధాలయముల పరిపాలన—కస్తూరికుటుంబరావుగారు
5. గ్రంధాలయోపయోగమునందు ఇతర దేశాలనుండి నేర్చుకోవలసిన సంగతులు
—యాతగిరి లక్ష్మీవేంకటరమణగారు

ఉపన్యాసములు :

1. వార్తాపత్రికలను వ్యాపింపజేయు టెట్లు ?—మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు
2. గ్రంథాలయముల స్థితిని అభివృద్ధిజేయు టెట్లు ?—నరసింహదేవర సత్యనారాయణగారు
3. గ్రంథాలయములు కార్మికులకుపకరించు టెట్లు ?—బి. యస్. మూర్తిగారు
4. గ్రామ గ్రంథాలయములయం దిమిడియున్న మహత్తరమైన శక్తులు
—చింతమనేని భావయ్యగారు
5. గ్రంథాలయములందలి మంచిగ్రంథముల నుపయోగించునటుల చేయు టెట్లు ?
—విన్నకోట వేంకటరత్నశర్మగారు
6. గోడలమీది వార్తాపత్రికలు—బొమ్మా శేషురెడ్డిగారు
7. భాష - వాఙ్మయముల అభివృద్ధికి గ్రంథాలయముల తోడ్పాటు
—గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు
8. అఖిలభారత గ్రంథాలయోద్యమమందు ఆంధ్రులభాగము—అయ్యంకి వెంకటరమణయ్యగారు
9. మాదిరి గ్రంథాలయ చట్టము—టేకుమళ్ల రామచంద్రరావుగారు
10. పడవ గ్రంథాలయసేవ—శరణు రామస్వామి చౌదరిగారు

ఆంధ్ర గ్రంథాలయోద్యమమునకు, అఖిలభారత గ్రంథాలయోద్యమమునకు బలమును గలిగించు నుద్దేశముతో తీర్మానములు కొన్ని చేయబడెను. ఇందు ఆంధ్రులందఱు ప్రతిసంవత్సరాది పండుగనాడును ఒక క్రొత్త తెలుగు పుస్తకమునైన కొనుటకు సంకల్పించవలసినదిగను, గ్రంథపఠనము పత్రికాపఠనములయందు ప్రజలకు అభిరుచిని కలిగించుటకు ప్రతి గ్రంథాలయమందును గ్రంథాలయ గోష్ఠుల నేర్పాటు చేయవలసినదిగను హెచ్చరించుచు చేయబడిన తీర్మానములు నూతనమైనవి. ఈసభా ఫలితముగ ఆంధ్రదేశ గ్రంథాలయసేవక సంఘ మొకటి ఏర్పడి దీనికి క్రింది కార్యవర్గ మెన్నుకొనబడెను.

అధ్యక్షులు : మాగంటి బాపినీడుగారు

ఉపాధ్యక్షులు : పులవర్తి భీమలింగమూర్తి, అర్. బి. వి. సుదర్శనవర్మ, మారేపల్లి రామచంద్రశాస్త్రి, బి. ఎస్. మూర్తి, నరసింహదేవర సత్యనారాయణగార్లు.

సంయుక్త కార్యదర్శులు: శరణు రామస్వామి చౌదరి, టేకుమళ్ల రామచంద్రరావుగార్లు

సహాయకార్యదర్శులు : ఈడుపుగంటి వెంకటరత్నమాంబ, భట్టు కుమారస్వామి, అడుసుమల్లి శ్రీనివాసరావు, కస్తూరి కుటుంబరావు, మల్లెల శ్రీరామమూర్తిగార్లు.

సభ్యులు : శేపూరి యల్లమందయ్యశ్రేష్ఠి, డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి, మాజేటి రామచంద్రరావు, వేగేశన సూరపరాజు, చింతమనేని భావయ్యగార్లు.

---

## 13 వ గుంటూరుజిల్లా గ్రంథాలయ మహాసభ, చిలకలూరిపేట

12—4—41 వ తేదీ నరసరావుపేటతాలూకాకు చెందిన చిలకలూరిపేటలో పై మహాసభ జరిగింది. సభకు గుంటూరుజిల్లాబోర్డు సభ్యులును, ఆం. దే. గ్రం. సంఘ పోషకులును నగు శ్రీ నాగినేని వెంకయ్యగా రధ్యక్షత వహించిరి. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ మైలవరపు గుండయ్యగారు ప్రతినిధులకు స్వాగత మొసంగుచు గ్రామాలలో గ్రంథాలయోద్యమము వ్యాప్తిచెందవలసిన అవసరమును గూర్చియు, విజ్ఞాన సముపార్జనమునకు ప్రధాన సాధనమైన గ్రంథాలయమును ప్రతి గ్రామములోను స్థాపించి విద్యాప్రచారమునకు తోడుపడవలసిన విధిని గూర్చియు ముచ్చటించిరి. వీరికోరికపై

వెనుక గోల్కొండ పత్రికాసహాయ సంపాదకులుగ పనిచేసిన ఉన్నవ వెంకట్రామయ్యగారు సభను ప్రారంభించుచు గ్రంథాలయములోని ప్రతి పుస్తకమును ఒక్కొక్క మహానుభావుని కష్టఫలిత మని తెలిసికోవాలనియు, పూర్వం తక్షశిల, నలంద మొదలగు ప్రదేశాలలో గొప్ప గొప్ప గ్రంథాలయా లుండేవనియు, విదేశస్థుల దండయాత్రల మూలంగా నివి నాశనము చేయబడినవనియు చెప్పిరి.

అనంతరం అధ్యక్షులు క్రిందివిధంగా ఉపన్యసించిరి.

"ఇతర దేశాలతో పోల్చిచూస్తే మనదేశం అన్నివిషయాలలోను చాల వెనుకబడియున్నది. విదేశాలలో ఆహారపదార్థాలు వస్త్రాలు మొదలైనవానిని అధికంగా తక్కువ పెట్టుబడితో ఉత్పత్తి చేయగలుగుతుంటే మనము ఆలా చేయలేకుండా ఉన్నాము. దానికి కారణం ఏమంటే మనలో విజ్ఞానం లేదు. మనం విజ్ఞానం పొందాలంటే పాఠశాలలు చాలవు. గ్రంథాలయాలు అవసరం. గ్రంథాలయాల్లో ప్రజల వృత్తులకు సంబంధించిన పుస్తకాలు ఉండాలి. మరియు ధార్మిక, మత, విజ్ఞానవిషయిక జ్ఞానాన్ని ఇచ్చే పుస్తకాలుకూడా ఉండాలి.

అట్టి పుస్తకాలు పాఠకులకు అందచేయాలంటే ధనము, శిక్షణబొందిన భాండాగారి ఉండాలి. మనవాళ్లు ప్రస్తుతం ఎక్కువ ఉపయోగంలేని దేవాలయాలకు మఠాలకు ఎక్కువధనం ఖర్చుచేస్తున్నారు. ఇప్పటి పరిస్థితుల్నిబట్టి అత్యంతావసరమైన గ్రంథాలయాలకు ధనసహాయంచేస్తే తప్ప దేశానికి మోక్షంలేదు.

పంచాయతీ గ్రంథాలయాలు నిర్వహించటంలో కొన్ని జి. వో. లు అవరోధంగా ఉన్నవి. వానిని ప్రభుత్వం తొలగించాలి. గ్రంథాలయ రిజిస్ట్రేషన్ ఫీజు రు 50/- గూడా తొలగించాలి. విజ్ఞాన కేంద్రాలైన ఈ సంస్థలపై ఇలాంటి రుసుము నియమించటం భావ్యంగాదు."

గుంటూరు మండల గ్రంథాలయ సంఘకార్యదర్శి శ్రీ కస్తూరి కుటుంబరావుగారు తమ నివేదికను చదివిరి. ఉపన్యాసకులగు శ్రీ పాతూరి నాగభూషణంగారు గ్రంథాలయ సంఘాలలో సభ్యులు విరివిగా చేరాలని, ఆంధ్రగ్రంథాలయం పత్రికకు చందాలు చెల్లించాలని ఉపన్యసించారు. మరియు శ్రీ సబనం రామసుబ్బారావు, గంజాం అనంత లక్ష్మణాచార్యులు, అడుసుమల్లి శ్రీనివాసరావుగార్లు కూడాఅనేక ముఖ్యవిషయాలపై మాట్లాడారు. కొన్ని తీర్మానములు చేయబడి అధ్యక్షుని ఉపసంహార వాక్యములతోను, అభివందనములతోను సభ ముగింపబడినది.

## గుడివాడతాలూకా ప్రథమ గ్రంథాలయ మహాసభ, ఎలమర్రు

11—5—41 వ తేది సాయంత్రము పై మహాసభ ఎలమర్రుగ్రామములోని శ్రీ దయానంద గ్రంథాలయ భవనమునెదుట ఆం. దే. గ్రం. సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఎం. ఏ. గారి అధ్యక్షతను జయప్రదముగ జరిగినది. సభను ఆం. దే. గ్రం. సంఘకార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు ప్రారంభించిరి. ఈ సందర్భమున పై గ్రంథాలయమువారొక పత్రికా ప్రదర్శనము నేర్పాటుచేసిరి. తెలుగు, హిందీ, ఇంగ్లీషుభాషలలో ముఖ్యమైన పత్రికలు 200 కు పైగా నిందు ప్రదర్శింపబడినవి. తాలూకాలోని చాల గ్రంథాలయములనుండి ప్రతినిధులు సభకు వచ్చిరి.

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ గద్దె ముత్యాలుగారు ప్రతినిధులకు స్వాగతమిస్తూ గ్రంథాలయాల ద్వారా విజ్ఞానాన్ని వెదజల్లుటకును, పనిచేయని గ్రంథాలయములను క్రమముగ పనిచేయునట్లు చేయుటకును, గ్రంథాలయములు లేని గ్రామములలో వీనిని స్థాపించుటకును తగిన కార్యక్రమాన్ని చేపట్టవలసిన ఆవశ్యకతను వివరించిరి. వీరి కోరికపై సభను ప్రారంభిస్తూ శ్రీ పాతూరి నాగభూషణంగారు వివిధ దేశాల్లోని గ్రంథాలయోద్యమాన్ని గురించి, గ్రంథాలయాల అభివృద్ధి నిమిత్తం వీనిద్వారా

విజ్ఞానాన్ని వ్యాపింపచేయడంకోసం, గ్రంథాలయాలకు పిల్లలను పెద్దలను ఆకర్షించుటకై అవలంబింపబడుతున్న పద్ధతులను గురించి వివరించి చెప్పిరి.

తర్వాత అధ్యక్షులు తమ ఉపన్యాసమును ప్రారంభించిరి. గ్రంథాలయాల అభివృద్ధి నిమిత్తం ప్రభుత్వాలు పూర్తిగా సహాయపడాలనీ, నేడు మనదేశంలోని ప్రభుత్వం గ్రంథాలయాభివృద్ధికోసం కావలసినంత సహాయం చేయుటలేదనీ, ఇతర దేశాలలోని ప్రభుత్వాలు ప్రజాప్రభుత్వములయిన కారణంచేత ప్రజలలో విజ్ఞానం వ్యాపింపజేసే ప్రయత్నాలు పూర్తిగా చేస్తున్నాయనీ, అందువల్ల మనము గూడ ప్రజాప్రభుత్వ స్థాపననిమిత్తం కృషిచేయాలనీ, ప్రజాప్రభుత్వ మున్నపుడే విజ్ఞాన విషయంలోను మన మభివృద్ధికి రాగలమని వారు చెప్పిరి.

గ్రంథాలయములు, వయోజన విద్యాప్రచారమునకు సంబంధించిన కొన్ని తీర్మానములు చేయబడి 1941–42 వ సం॥కు గుడివాడతాలూకా గ్రంథాలయ సంఘమునకు శ్రీ సుంకర చంద్రమౌళీశ్వరరావుగా రధ్యక్షులుగను, శ్రీ వంగపాటి ఉమామహేశ్వరరెడ్డిగారు కార్యదర్శిగాను, మరి నలుగురు సభ్యులతో పాలకవర్గ మెన్నుకొనబడెను.

## 10 వ తెనాలితాలూకా గ్రంథాలయ మహాసభ

10 వ తెనాలితాలూకా గ్రంథాలయమహాసభ తెనాలి ఆంధ్రరత్న గ్రంథాలయములో 23-8-41 వ తేది మధ్యాహ్నం 3 గంటలకు ఉభయ భాషాప్రవీణ శ్రీ కొండూరు వీరభద్రాచార్యులుగారి అధ్యక్షతను జయప్రదముగా జరిగినది.

ఆహ్వానసంఘాంతరపున శ్రీ పావులూరి రామారావు పంతులుగారు స్వాగత మొసగిరి. కార్యదర్శి చావలి కోటేశ్వరరావుగారిచే వార్షిక నివేదిక చదువబడెను.

తెనాలినుండి నిజాంపట్నంవరకు వెళ్ళు కాల్వమీద బోటులో శ్రీ మండలపర్తి ఉపేంద్రశర్మ ఎం. ఏ. గారిచే బోటుగ్రంథాలయము ప్రారంభింపబడెను.

గ్రంథాలయోద్యమము వయోజన విద్యాప్రచారముల గురించి శ్రీ కల్లూరి చంద్రమౌళి ఎం. ఎల్. ఏ., మేడసాని తిరుపతిరాయుడు, జమ్మలమడక మాధవరామశర్మ, భట్టు కుమారస్వామి, కొమ్మ సీతారామయ్యగార్లు మాట్లాడిరి.

గ్రంథాలయములకు మద్రాసు ప్రభుత్వమువారు చేయుచున్న ధనసహాయమునకు కృతజ్ఞతను జూపుచు, స్థానికసంస్థలక్రిందనున్న గ్రంథాలయములకే గాక ప్రయివేటుసంఘములు నడుపుచున్న గ్రంథాలయములకు గూడా ధనసహాయము గావింపవలెననియు, వయోజన విద్యాప్రచారముపై ప్రభుత్వమువారు ప్రయోగించిన నిషేధమును నిరసించుచు, సదరు వయోజన విద్యాప్రచారమునకు తగిన సహాయము గావింపవలసినదిగా ప్రభుత్వమును కోరుచును తీర్మానములు చేయబడెను.

## రేపల్లె తాలూకా గ్రంథాలయ మహాసభ, గూడవల్లి

7–2–41 వ తేదీ పై మహాసభ శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్యగారి అధ్యక్షతను గూడవల్లి సెహగాగ్రంథాలయావరణములో జరిగింది. ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు భారతదేశ గ్రంథాలయోద్యమాన్ని గురించి ఉపన్యసించారు. గ్రంథాలయాల రిజిస్ట్రేషనుఫీజు తగ్గించాలనీ, పంచాయతీబోర్డులు పుస్తకాలు, పత్రికలు తెప్పించడంలో నిషేధాలేవీ ఉండరాదనీ తీర్మానాలు చేశారు. రేపల్లెతాలూకా గ్రంథాలయ సంఘానికి ఎన్నికలుకూడా జరిగినవి. శ్రీ పరుచూరి వెంకటబసవకుటుంబయ్యగా రధ్యక్షులుగను, శ్రీ ఘంటా సీతారామయ్యగారు కార్యదర్శిగను ఎన్నుకోబడ్డారు.

## అయిదవ దివితాలూకా గ్రంథాలయ మహాసభ, కోసూరు

పై మహాసభ 26–10–41 వ తేది ఆదివారము కోసూరుగ్రామమున జరిగినది. గుంటూరు హిందూకాలేజి తెలుగు ఉపన్యాసకులు శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మ ఎం. ఏ. గారధ్యక్షత వహించిరి. సభకు పెదముత్తేవి, మంత్రిపాలెం, ఘంటసాల, కాజ, మాజేరు, కోసూరు గ్రంథాలయముల నుండి ప్రతినిధులు విచ్చేసిరి.

శ్రీయుత అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు సభను ప్రారంభించుచు నిట్లుపన్యసించిరి. "విజ్ఞానము అంతులేనిది. దీనిని సాధించుటకు ప్రతి వ్యక్తియు తన జీవితమును ధారవోయవలెను. విజ్ఞాన సముపార్జనమునకు గ్రంథాలయములు మిగుల నవసరము. గ్రంథాలయములలోని పుస్తకములన్నియు ఉపయోగపడినప్పుడే వాని సార్థకత ఋజువగును. చిన్నపిల్లలను విజ్ఞాన పిపాసువులుగ చేయు ప్రయత్నములకు గ్రంథాలయములు పూనవలెను. ఇందుకుతగిన ఆటలు కొన్నిగలవు. వీనిని గ్రంథాలయములలో ప్రవేశపెట్టవలెను. గ్రామ గ్రంథాలయములు చాలచోట్ల ధనాభావముచే కృశించిపోవుచున్నవి. రైతులు ధాన్యము నూర్చుదినములలో కళ్ళములవెంట తిరుగుచో గ్రంథాలయముల పోషణకు కావలసిన ధనమును సేకరించవచ్చును."

అనంతరము అధ్యక్షులు ఏ దేశమందుగాని గ్రంథాలయోద్యమ మభివృద్ధిచెందుటకు అచ్చటి గ్రంథాలయసంఘములే కారణమనియు, రష్యా, జపాను, జర్మనీ, బ్రిటను, అమెరికా మున్నగు దేశముల నాగరకతకు కారణము అచ్చటి గ్రంథాలయములే యనియు, గ్రంథాలయోద్యమము మనదేశమున వేదకాలమునుండియు వర్ధిల్లినదనియు, మతావేశమువల్లను రాజుల నిర్లక్ష్యమువల్లను గొప్ప గొప్ప గ్రంథములు గ్రంథాలయములు నశించిపోయినవనియు, పూర్వము గ్రంథములు గోడలలో దాచియుంచువాడుకవల్ల చదలు తేమకూడ దీని వినాశమునకు కారణమయ్యెననియు, ముద్రాయంత్రములు వ్యాప్తిలోనికి వచ్చినపిమ్మట పుస్తకములు చాలగ వ్యాపించినవనియు, గ్రంథాలయోద్యమవ్యాప్తికై 1914 సం॥ ఆం. దే. గ్రం. సంఘము స్థాపింపబడెననియు, దీని కార్యక్రమము ఫలవంతమగుటకు శాఖాసంఘము లెక్కువగ తోడ్పడవలసియుండుననియు, మనదేశములో చదువుకొన్న వారిసంఖ్య 100 కి 10 మందికి మించకుండుటకు కారణము గ్రామగ్రంథాలయములకు తగిన ప్రోత్సాహము లేకపోవుటయే యనియు, దీనికి ప్రభుత్వముతోపాటు ప్రజలును బాధ్యులనియు ఉపన్యసించిరి. దివితాలూకా గ్రంథాలయసంఘ కార్యదర్శి శ్రీ మాజేటి రామచంద్రరావుగారు 1-9-40 వ తేదీ లగాయతు 16-10-41 వ తేదీవరకుగల తమ నివేదికను చదివినపిమ్మట గ్రంథాలయావశ్యకతనుగూర్చి శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, షేకు సిలారుసాహెబు, భట్టుకుమారస్వామి, మల్లెల శ్రీరామమూర్తిగార్లుపన్యసించిరి.

పిమ్మట గ్రంథాలయములకు రిజిస్ట్రేషను ఫీజును తీసివేయ వలసినదిగను, వయోజనవిద్యావ్యాప్తి కాటంకముగలిగించు సర్క్యులరును రద్దుచేయవలసినదిగను, ఆంధ్రదేశమునందలి గ్రంథాలయములకు లక్షరూపాయలకు తక్కువలేకుండ విరాళముల నేటేట ఇవ్వవలసినదిగను ప్రభుత్వమును గోరుచు తీర్మానములు చేయబడెను. అధ్యక్షుని తుదిపలుకులతోను వందనసమర్పణముతోను సభ జయప్రదముగ ముగిసెను.

## చతుర్థ బెజవాడతాలూకా గ్రంథాలయ మహాసభ, కవులూరు

1-1-41 వ తేదీ సాయంత్రం 2-30 గంటలకు పై మహాసభ శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి అధ్యక్షతక్రింద దిగ్విజయముగా జరుపబడెను. చుట్టుపట్ల గ్రామములనుండి ప్రజలువిరివిగా వచ్చియుండిరి.

అధ్యక్షులు వెంకటరమణయ్యగారు పిల్లలకు విజ్ఞానము ఎట్లు బోధపరచవలసినదియు, గ్రామగ్రంథాలయములు గ్రామప్రజలకు ఉపయోగపడవలసిన విధులను గూర్చియు, గ్రంథాలయములు స్త్రీలకు ఉపయోగపడునట్లు చేయు విధానములు మున్నగు అనేక విషయములను గురించి గంభీరోపన్యాసము గావించిరి. తరువాత టేకుమళ్ల రామచంద్రరావుగారు (ఎం. ఏ. బి. ఎల్.), కృష్ణాజిల్లా గ్రం. సంఘాధ్యక్షులు మన ప్రాచీన నాగరికత ఇతరదేశములకు ఏవిధముగా వ్యాపించినది అను విషయమును గూర్చి చక్కగా ఉపన్యసించిరి. తాలూకాసంఘ కార్యదర్శి శ్రీ గొంది కోటీశ్వరరావుగారు గత సంవత్సర కార్యనివేదికను చదివిరి. గ్రంథాలయాలు ఏవిధముగా ఉండాలి అనేవిషయముపై చక్కగా నుపన్యసించిరి. శ్రీ కంభంపాటి వెంకటరత్నం, వేగేశన సూరపరాజు, నాగినేని వెంకయ్య, చోడవరపు మధుసూదనరావు, మల్లెల శ్రీరామమూర్తిగార్లు గ్రంథాలయాలను గూర్చిన వివిధవిషయములను గూర్చి ఉపన్యాసముల నొసంగిరి.

తీర్మానముల అనంతరం క్రొత్తసంవత్సరమునకు ఈక్రిందివారు పాలకవర్గముగ నెన్నుకొనబడిరి.

అధ్యక్షులు: శ్రీ చోడవరపు మధుసూదనరావు, బి. ఏ. బి. ఎల్ గారు

ఉపాధ్యక్షులు: శ్రీ కొమ్మా సీతారామయ్యగారు; కార్యదర్శి: గొంది కోటీశ్వరరావుగారు

సహాయకార్యదర్శి: గుంటుపల్లి రాజగోపాలంగారు; ఇంకా 8 మంది సభ్యులు.

## భీమవరం తాలూకా గ్రంథాలయయాత్ర

ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారు, భీమవరం తాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులు వేగేశన సూరపరాజుగారు, గోకరాజు సూర్యనారాయణ రాజు మొదలైనవారు బయలుదేరి 15-11-41 తేది ఉదయము చినమిరం గంగేశ్వరానంద గ్రంథాలయము, సాయంత్రం వేంపాడు గణపతి గ్రంథాలయము, 16-11-41 తేదీ ఉదయం కోపల్లె వివేకానంద గ్రంథాలయము, సాయంత్రం జక్కరం పంచాయతీ గ్రంథాలయము, కాళ్ళ సరస్వతీ గ్రంథాలయం, 17-11-41 వ తేదీ ఉదయం సిసలి వేణుగోపాల పుస్తక భాండాగారము, కాళ్లకూరు ఆంధ్రకేసరీ గ్రంథాలయము, కోలనపల్లి విద్యారణ్య గ్రంథాలయం, జువ్వలపాలెం రవికుమార్ గ్రంథాలయములు దర్శించి మహాజనసభలు జరిపియు, గ్రంథాలయములు ఉపయోగించవలసిన విధులు, రిజిస్ట్రేషన్ పద్ధతులను, గ్రంథ భాండాగారులకు శిక్షణావసరమును, గ్రంథాలయాభివృద్ధికి గల ఆటంకములను వానిని తొలగించుకొనుట కనుకూలవిధానములను గురించియు ఉపన్యసించిరి. 18-11-41 తేదీన చెరుకుమిల్లి శ్రీ కృష్ణదేవరాయ గ్రంథనిలయ తృతీయ వార్షికోత్సవము శ్రీ పాతూరి నాగభూషణంగారి ఆధిపత్యమున జరుపబడెను. అసిస్టెంటు పంచాయతీ ఆఫీసరు కలిదిండి నరసింహరాజుగారు సదరుసభకు హాజరై గ్రంథాలయమునకు తగిన సలహాల నొసంగి గ్రామస్థులను ఉత్సాహపరచిరి.

## విశాఖపట్టణ గ్రంథాలయసంఘము

విశాఖపట్టణములో గ్రంథాలయసంఘము నొకదానిని స్థాపించుసంకల్పముతో గ్రంథాలయాభిమానులు కొందఱి ప్రోత్సాహముతో 7-9-41 వ తేదీ సాయంత్రము 4 గంటలకు విశాఖపట్టణము నందలి హిందూ ధర్మపఠనమందిరమున నొకసభ సమావేశ మయ్యెను. ఈసభకు ఆం. దే. గ్రం. సంఘోపాధ్యక్షులు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారధ్యక్షత వహించిరి. పట్టణమునందలి గ్రంథాలయాభిమానులు స్థానిక గ్రంథాలయముల నిర్వాహకులు పలువురు సభకు హాజరైరి.

పై సమావేశమునకు కారణభూతులైన శ్రీయుత పి. కొండారెడ్డిగారిని ప్రథమమున అధ్యక్షు లభినందించిరి. భారతదేశ గ్రంథాలయోద్యమమును ప్రారంభించినది మున్ముందు ఆంధ్రులేననియు, ఆంధ్ర

దేశములో మొదటి గ్రంథాలయమును విశాఖపట్టణములోనే 1886 సం. లో కీ. శే. మంతిన ఆదినారాయణమూర్తిగారు ప్రారంభించిరనియు వారు సెలవిచ్చిరి. ఆంధ్ర యూనివర్సిటీ గ్రంథాలయాధికారి శ్రీ యస్. బి. సచ్చిదానందంగారు నేడు ఊరూర దేవళములు, మసీదులు, పాఠశాలలు మున్నగునవి యున్నట్లే మున్ముందు ప్రతిపల్లెయందును గ్రంథాలయములు వెలయగలవనియు, గ్రంథభాండాగారులు జాతీయోద్యమవ్యాప్తి కెంతగనో తోడుపడిరనియు చెప్పి రాజేంద్రలాల్ మైత్రా, బిపినచంద్రపాలు గార్ల పేర్ల నీసందర్భమున పేర్కొనిరి. ఎ. వి. యన్. కాలేజిలెక్చరరు శ్రీ టి. రామారావుగారు గ్రంథాలయసంఘముయొక్క ఆశయములు, ఈ సంఘ మేర్పడుటవలన విశాఖపట్టణమునందలి గ్రంథాలయములు పొందగల ప్రయోజనములను చెప్పి దీనిద్వారా వయోజన విద్యావ్యాప్తికిగల అవకాశములను వివరించిరి.

శ్రీ కొండారెడ్డిగారు ఆధునిక గ్రంథాలయోద్యమ రీతులు, వివిధ దేశములలోని ఉద్యమవ్యాప్తి, హిందూదేశములో ఇందును ముఖ్యముగ బరోడాసంస్థానము, పంజాబు మదరాసురాష్ట్రములలోని ఈ యుద్యమగమనమును గూర్చి వివరించిన మీదట పై సంఘనిర్మాణము నిమిత్తము తాము తయారుచేసిన చిత్తుచట్టమును సభికులయెదుట నుంచిరి. ఇది కొలదిమార్పులతో సభికుల అంగీకారమును పొందెను. అనంతరము 1941-42 సం॥నకు క్రిందివిధముగ కార్యనిర్వాహక సభ్యులెన్నుకొనబడిరి.

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, అధ్యక్షులు
శ్రీ యస్. బి. సచ్చిదానందంగారు, బి. ఏ., డిప్. లిబ్. — ఉపాధ్యక్షులు
శ్రీ బి హెచ్. సూర్యనారాయణరావుగారు, ఎం. ఏ., బి. ఇడి. — కోశాధిపతి
శ్రీ పి కొండారెడ్డిగారు, డిప్. లిబ్. — కార్యదర్శి
శ్రీ స్థానాపతి సత్యనారాయణశాస్త్రిగారు, — సంయుక్తకార్యదర్శి

**ప్రారంభోత్సవము :** 21–11–41 వ తేదీ సాయంత్రం టౌనుహాలులో మాజీమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిచే పై సంఘముయొక్క ప్రారంభోత్సవ కార్యక్రమము జరుపబడెను. ఈ సందర్భమున నేర్పాటుచేయబడిన సభకు శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య ఎం. ఏ. గా రధ్యక్షత వహించిరి. ముందు ఉపన్యాసకులను అధ్యక్షులను శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సభికుల కెఱుకపఱచిరి. సుమారు 100 మంది జనము సభకు వచ్చిరి. శ్రీ గోపాలరెడ్డిగారు మనదేశంలో నిరక్షరాస్యత మిక్కిలి అధికముగ నున్నదనియు దీనిని నిర్మూలించుటకు గ్రంథాలయములును, రాత్రిబడులును మిక్కిలిగ తోడ్పడుననియు, ఎప్పటికైనా మన దేశంలో ప్రజాప్రభుత్వం రావాలంటే మన మందరిని చదువుకొనేటట్లు చేయాలనియు, హిందూమహమ్మదీయులలో ఐకమత్యం లేకపోవుటకు కారణము ఒకరి మతమునుగూర్చి ఒకరు తెలిసికొనకపోవుటయే ననియు, ఇతర మతములను నిజమైన జాతీయతను తెలిసికొనుటకు గ్రంథాలయములు చాల అవసరముగాన యువకులు పెద్దలుకూడ నీ యుద్యమమునకు తగిన ప్రోత్సాహ మివ్వవలెననియు చెప్పిరి. అధ్యక్షులు శ్రీ వేంకటరంగయ్యగారు ఇటువంటి ఉద్యమములు జయప్రదంగా సాగుటకు ప్రభుత్వ సహాయంకంటె ప్రజల సహకారమే ఎక్కువగ కావలెననియు, గ్రంథాలయసంఘాలవారు గ్రంథకర్తలను ప్రోత్సహించుచు నూతన గ్రంథములను వ్రాయించుట అవసరమనియు, ఏ ప్రభుత్వములో నైనను ప్రజలలో విద్యావ్యాప్తి కావలెననియు, గ్రంథాలయములవల్ల అట్టివ్యాప్తి కాగలదనియు నుడివిరి. కార్యదర్శి శ్రీ పి. కొండారెడ్డిగారి అభివందనములతో సభ జయప్రదముగ ముగిసెను.

22–11–41 వ తేదీ 22 వ ఆంధ్రమహాసభాధ్యక్షులు సర్ విజయాగారికి విశాఖపట్టణ గ్రంథాలయ సంఘ పక్షమున సన్మానపత్రము సమర్పింపబడెను. విద్యావిధానములో గ్రంథాలయము ప్రముఖ పాత్రను వహించుచున్నదనియు, విదేశములలోని విద్యాభివృద్ధికి ఆయాదేశములలో నలుమూలల పనిచేయు గ్రంథాలయములే కారణమనియు వారు సన్మానపత్రమునకు సమాధానము చెప్పుచు నుడివిరి.

24-11-41 వ తేదీ సాయంత్రము హిందూధర్మపఠన మందిరములో పై సంఘమువారిచే బహిరంగ సభ యొకటి ఏర్పాటు చేయబడెను. శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు సభ కధ్యక్షత వహించిరి. ప్రారంభమున అధ్యక్షులు గ్రంథాలయోద్యమ విశిష్టతను గూర్చి ముచ్చటించుచూ తంజావూరు సరస్వతీ మహలులోగల తెలుగు పుస్తకముల కేటలాగును ఆంధ్ర యూనివర్శిటీవారు తయారు చేయించిరనియు, వానిలో ద్విపద భారతమునకు ప్రతి వ్రాయించి తెప్పించిరనియు, అచటనున్న తక్కిన పుస్తకములకుకూడ ప్రతులు వ్రాయించి భద్రము చేయనిపక్షమున అవి శిథిలములై మనకిక లభించవనియు, ఈ విషయములో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు శ్రద్ధవహించి దేశమునకు, భాషకు ఉపకారము చేయవలసినదనియు చెప్పిరి. పిమ్మట గ్రంథాలయోద్యమమును గురించియు, గ్రంథాలయముల అభివృద్ధినిగూర్చియు శ్రీ మల్లెల శ్రీరామమూర్తి, అయ్యంకి వెంకటరమణయ్య, పాతూరి నాగభూషణం, వద్దిపర్తి కామేశ్వరరావు, బిక్కవల్లి కాంబాబు, చిన్నకోట వెంకటరత్న శర్మ, శ్రీమతి చింతాభట్ల లక్ష్మీబాయమ్మగారులుపన్యసించిరి. సంఘాధ్యక్షులు శ్రీ రామచంద్రశాస్త్రి గారి అభివందనములతో సభ రాత్రి 9 గంటలకు ముగిసెను.

### గుంటూరుపట్టణ గ్రంథాలయసంఘము

పై సంఘముయొక్క తృతీయవార్షికోత్సవము గుంటూరు గవర్నమెంటు హాస్పిటలు సూపరింటెండెంటు మేజరు డబ్లియు హూపరు, ఐ. యం. యస్. గారి అధ్యక్షతను 15-3-41 వ తేదీ సాయంత్రము హాస్పిటల్ ఆవరణములో జరిగినది. సంఘోపాధ్యక్షులు శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మ, ఎం. ఏ. గారు నివేదికను చదివిన తదుపరి వైద్యశాలా గ్రంథాలయసేవనుగూర్చి ముచ్చటించిరి. శ్రీయుతులు కస్తూరి కుటుంబరావు, కరణాలెం కృష్ణరావుగార్లు హాస్పిటలునందు గ్రంథాలయ సేవచేయుటవలన కలుగు ప్రయోజనములనుగూర్చి ఉపన్యసించిరి. గ్రంథాలయ ప్రదర్శనము గుంటూరుమండల గ్రంథాలయసంఘకార్యదర్శి శ్రీ కస్తూరి కుటుంబరావుగారిచే ఏర్పాటుచేయబడెను. శ్రీ నాయని పద్మనాభరావు నాయుడుగారు హూపరుగారి ఉపన్యాసమును తెలుగులోనికి అనువదించి చెప్పిరి.

---

## నూతనగ్రంథాలయాలు

### ప్రొద్దుటూరులో గ్రంథాలయము

28-12-40 వ తేదీ సాయంత్రం బెజవాడతాలూకా ప్రొద్దుటూరు గ్రామంలో కృష్ణాజిల్లా గ్రంథాలయ సంఘ కార్యదర్శి శ్రీ మాజేటి రామచంద్రరావుగారిచే గ్రంథాలయ మొకటి ప్రారంభించబడినది. ఈ సందర్భమున జరిగిన సభకు బెజవాడతాలూకా గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ చోడవరపు మధుసూదనరావు, బి. ఏ., బి. ఎల్. గా రధ్యక్షత వహించిరి.

### శ్రీ మహాత్మగాంధీ భారతీ గ్రంథాలయము, నందిగామ

సత్తెనపల్లితాలూకాకు చెందిన నందిగామలో పై గ్రంథాలయమునకు 11-1-41 వ తేదీ శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారిచే ప్రారంభోత్సవము చేయబడెను. శ్రీ వేదాంతం వెంకటజగన్నాథాచార్యులుగా రధ్యక్షులుగను, కాలవకొలను సత్యనారాయణశాస్త్రిగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి.

### శ్రీ వేణుగోపాల పుస్తక భాండాగారము, సీసలి

15-1-41 వ తేదీ భీమవరంతాలూకా సీసలి గ్రామంలో పై గ్రంథాలయము స్థాపింపబడినది. తోట చక్రపాణిరావుగా రధ్యక్షులు, కర్రెడ్డి చల్లాలుగారు కార్యదర్శి.

**మదరాసులోని క్రొత్త పఠనమందిరాలు (18-1-41)**

మదరాసులో చాకలిపేట, బేసిను బ్రిడ్జి, పెరంబూరు, పుదుప్పేట, చెట్పట్, అమ్మనుకోవిల, కొత్వాలుబజారు, ట్రిప్లికేను డివిజనులలో క్రొత్త పఠనమందిరాలను అద్దె యిండ్లలో స్థాపించుటకు చేసిన కమీషనరుగారి సూచనను కార్పొరేషను విద్యాశాఖ స్థాయీసంఘమువారామోదించారు.

**శ్రీ వివేకానంద పఠనమందిరము, రావూరుపేట**

12-5-41 వ తేది పేటపాలెములోని రావూరిపేటలో పై పఠనమందిరము ప్రారంభింపబడెను. ఈ ఉత్సవమునకు శ్రీ సిద్ధాంత శిరోభూషణ దోగిపర్తి స్వామిగుప్త సిద్ధాంతిగారు ఆధ్వర్యము వహించిరి.

**కాంగ్రెసువిజ్ఞాన గ్రంథాలయము, రాజమహేంద్రవరము**

కీర్తిశేషులు శ్రీ జి. ప్రకాశరాయుడుగారి జ్ఞాపకార్థం వీరిచే దానముగ నివ్వబడ్డ కొన్ని ఉత్తమ ఇంగ్లీషు గ్రంథముల నాధారముగా చేసికొని శ్రీ తిరుపతిరాయ కాంగ్రెసు భవనము (రాజమండ్రి) నందు 1-6-41 వ తేదీనుండి పై పేరుతో గ్రంథాలయము నడుపబడుచున్నది.

**యువజనసంఘ పఠనాలయము, తాళ్ళపూడి**

4-6-41 వ తేదీ తాళ్ళపూడి గ్రామమునందలి యువకులుసమావేశమై పై పఠనాలయమును స్థాపించుకొనిరి. గ్రంథాలయమువలని ఉపయోగములనుగూర్చి పలువురుపన్యసించిరి. శ్రీ పర్సపార్థసారధిరావుగారు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

**ఆంధ్రగ్రంథాలయం, కరీంబాద (నైజాం)**

పైగ్రంథాలయ ప్రారంభోత్సవము 6-7-41వ తేది ఆదివారం సాయంత్రం హైకోర్టువకీలు శ్రీ పర్చా రంగారావుగారి అధ్యక్షతను జరుపబడినది. శ్రీ మాటేటి పాపయ్యగారధ్యక్షులుగను, వనం వెంకటయ్యగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి.

**గిద్దలూరులో గ్రంథాలయము & పఠనాలయము**

కర్నూలుజిల్లా గిద్దలూరులో 26-7-41 వ తేది ఉదయం చీతిరాల సుబ్బరాయగుప్తగారి అధ్యక్షతను ఒకసభజరిగెను. అధ్యక్షుడును మరికొందఱును గ్రంథాలయములు - పఠనాలయములు, వాటి ఉపయోగములనుగుఱించి ఉపన్యసించినమీదట ఒక గ్రంథాలయ మచ్చట స్థాపింపబడెను.

**జయభారతిగ్రంథనిలయము & పఠనమందిరము, నవాబుపేట**

నందిగామతాలూకా నవాబుపేటలో ఆగష్టు ప్రారంభమున పై గ్రంథాలయము స్థాపింపబడెను. స్థానిక సహకారసంఘమువారు దీనికి రు 100-0-0 విరాళ మొసంగిరి. శ్రీ గోళ్ళమూడి రామనాథంగారధ్యక్షులుగాను, కోట శివయ్యగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి.

**ఆర్యవైశ్య యువజనసంఘము, అనంతపురము**

అనంతపురం మన్రోబజారులో పై సంఘమువారు ఒక ఉచిత పఠనాలయమును నిర్మించి గుంటూరు మునిసిపల్ ఛెయిర్మన్ రావుబహద్దరు శ్రీ తెల్లాకుల జాలయ్యగారిచే 5-8-41 వ తేది ఉదయము ప్రారంభోత్సవమును గావించిరి.

**ప్రకృతిగ్రంథాలయం, బెజవాడ**

10-8-41 వ తేదీ ఉదయం 8½ గంటలకు బెజవాడ సత్యనారాయణపురములో ప్రకృతి ధర్మ పరిషత్తువారి యాజమాన్యమున శ్రీ ఉప్పలపాటి రామరాజుగారి మామిడితోటయందు పై గ్రంథా

లయము శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మగారిచే స్థాపింపబడెను. ఇందు ప్రకృతిచికిత్స, జీవనమును గురించిన గ్రంథము లెక్కువగ నుంచబడును.

### పాకాల పంచాయతీబోర్డు రీడింగురూమ్

పై పంచాయతీబోర్డువారు నూతనముగ బి. టి. సింగు పార్కులో నిర్మించుచున్న రీడింగురూము భవనమునకు ఆర్. బి. ఎ. సుదర్శనవర్మగారు 13-8-41 వ తేది శంకుస్థాపన చేసిరి. పై పార్కులో శ్రీ పి. గోవిందనాయర్, ఐ. సి. యస్. గారు రేడియోప్రారంభోత్సవమును చేసిరి.

### రవీంద్రనాథఠాకూర్ గ్రంథాలయము, ప్రగడవరం

చింతలపూడి తాలూకా కాంగ్రెసుసంఘాధ్యక్షులైన శ్రీ చిలుకూరి వెంకటప్పారెడ్డిగారి యాజమాన్యమున 18-8-41 వ తేదీ పై పేరుతో పుస్తకభాండాగార మొకటి స్థాపింపబడినది. పంచాయతీ బోర్డు అధ్యక్షులు శ్రీ కనమతరెడ్డి కోటిరెడ్డిగారు గ్రంథాలయమును తమ తాలూకు ఒక భవనములో పెట్టుకొనుట కంగీకరించిరి.

### శ్రీ వేంకటరామ సహకారగ్రంథనిలయము, ప్రగడవరం

26-8-41 వ తేదీ కనమతరెడ్డి కోటిరెడ్డిగారి అధ్యక్షతను ప్రగడవరంలో సభయొకటి జరిగి గ్రామ పరపతి సంఘస్థాపకులు కీ. శే. చిలుకూరి వెంకటరామరెడ్డిగారి స్మారకచిహ్నముగ పై గ్రంథాలయము స్థాపించబడినది.

### మద్దికెరలో ఉచితగ్రంథాలయము

26-8-41 వ తేదీన మద్దికెరగ్రామమున ఉచిత గ్రంథాలయ ప్రారంభోత్సవమును శ్రీ డాక్టరు హెచ్. బి. నాయక్‌గారు జరిపిరి. శ్రీ. టి. గోపాలకృష్ణరావు, బి. ఏ., (పంచాయతీబోర్డు స్పెషల్ ఆఫీసరు)గారు గ్రంథాలయములు, వాటి ఉపయోగములనుగురించి ఉపన్యసించిరి.

### మొగల్‌రాజపురంలో హరిజనగ్రంథాలయం

బెజవాడకు సమీపమునగల మొగల్‌రాజపురం హరిజనవాడలో 7-10-41 వ తేదీ శ్రీ పెదర్ల సుబ్బయ్యగారిచే హరిజనులనిమిత్తం స్థాపింపబడిన పై గ్రంథాలయమునకు శ్రీ పేట బాపయ్యగారు ప్రారంభోత్సవంచేశారు.

### రవీంద్రనాథ గ్రంథాలయము, ముత్యాలంపాడు

బెజవాడతాలూకాలోని ముత్యాలంపాడు గ్రామమున 21-10-41 వ తేది సాయంత్రం పై గ్రంథాలయం స్థాపించబడెను. శ్రీ కొలిపాక ఆదినారాయణశర్మగారు దీనికి కొన్ని గ్రంథములను, ఇతర పరికరములను ఇచ్చిరి. అధ్యక్షులు శ్రీ గొడవర్తి కృష్ణంరాజుగారు.

### రాస్ విక్టోరియా ఉచితపఠన మందిరము, మదరాసు

దక్షిణభారత వయోజన విద్యాసంఘమువారు రాయపేటలో లాయడ్సురోడ్డు హైస్కూలులో యేర్పాటుచేసిన పై పఠనమందిరమును 1-11-41 వ తేది సాయంత్రం కార్పొరేషను కమీషనరు ఓ. పుల్లారెడ్డి, ఐ. సి. యస్. గారు తెరిచారు. ఈ సభకు సర్ మహమ్మద్ ఉస్మానుగా రధ్యక్షత వహించారు. రెవ రెండు థామసుగారు స్వాగత మిచ్చారు. ప్రధాన కార్యదర్శి టి. జె. ఆర్. గోపాల్‌గారు నివేదికను చదివారు. జె. ఎల్. క్విరాస్ విక్టోరియాగారు దక్షిణ ఇండియాలో ఈ ఉద్యమాన్ని గురించి శ్రద్ధగా పనిచేస్తున్నారు గాన ఈ పఠన మందిరానికి వారిపేరు పెట్టబడెను. ఈ సందర్భమున శ్రీ పుల్లారెడ్డిగారు మదరాసు నగరంలో కార్పొరేషనువారు చేయ దలపెట్టిన వయోజనవిద్యా విధానమును వివరించారు.

### గ్రామయువజనగ్రంథాలయము, లాలుపురం

గుంటూరుతాలూకాకు చెందిన లాలుపురం గ్రామ యువజనసంఘంవారి యాజమాన్యమున 4-11-41 వ తేదీ పై గ్రంథాలయము స్థాపించబడినది.

### సంతానగోపాలస్వామి గ్రంథాలయము, సూరేపల్లి

రేపల్లెతాలూకా సూరేపల్లి గ్రామములోని సహకారపరపతి సంఘమువారి ధన సహాయముతో నిర్మింపబడిన నూతన భవనమునందు పై గ్రంథాలయము 8-11-41 వ తేది ప్రారంభింపబడినది. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారీ యుత్సవమునకు అధ్వర్యము వహించిరి.

### శ్రీ దేవత శ్రీరామమూర్తి పారిశ్రామిక గ్రంథాలయము, రాజమహేంద్రవరము

పై గ్రంథాలయ ప్రారంభోత్సవమును 28-11-41 వ తేదీ విక్రమహాలులో బెజవాడ వాస్తవ్యులు శ్రీ చుండూరు వెంకటరెడ్డిగారు జరిపిరి. దేవత శ్రీరామమూర్తి మెమోరియల్ కమిటీ కార్యదర్శి యగు శ్రీ నాళం రాజారావుగారు నివేదికను చదివిరి. శ్రీ వెంకటరెడ్డిగారు గ్రంథాలయమును బహిర్గతము గావించుచు రు 500-0-0 విలువగల పారిశ్రామిక గ్రంథములను తామిచ్చెదమని నుడివిరి.

### రవీంద్ర గ్రంథనిలయము, నున్న

గన్నవరంతాలూకా నున్నగ్రామములో 13-12-41 వ తేది శనివారం సాయంత్రము పై గ్రంథాలయము ఆం. దే. గ్రం. సంఘ కార్యదర్శి శ్రీ పాతూరి నాగభూషణంగారిచే ప్రారంభింపబడినది. మైలవరం శ్రీ మహాత్మాగాంధి గ్రంథనిలయ కార్యదర్శి శ్రీ కాపా కాశీవిశ్వనాథ దేవరగారు సభకధ్యక్షత వహించిరి.

---

# నివేదికలు

## తాడేపల్లిగూడెంతాలూకా గ్రంథాలయసంఘము

### 1940—41 సం. నివేదిక

గ్రామసేవాసమితి : నివేదికకాలములో సంఘ కార్యక్రమము ఉత్సాహముగ నడువలేదు. అయినను తాడేపల్లిగూడెంలో గ్రామోద్ధరణ నిమిత్తము నెలకొల్పబడిన గ్రామసేవాసమితి ద్వారా కొంత కృషిచేయబడెను. ఈ సమితివారు నివేదికసంవత్సరములో 1. పశుసంరక్షణ 2. గ్రామసీమ—విద్యావ్యాప్తి అను రెండు చిన్న పుస్తకములను ప్రచురించిరి. ఇవి రెండును తాలూకాలోని గ్రంథాలయముల కన్నిటికిని ఉచితముగ నివ్వబడెను.

జిల్లాబోర్డు గ్రంథాలయములు : 1—4—40 వ తేదీన ప. గో. జిల్లాబోర్డువారు నడపుచున్న 15 గ్రంథాలయములకు వార్తాపత్రికల నాపుచేసి గ్రంథాలయసిబ్బందికి విడుదలనోటీసు నిచ్చియుండిరి. ఈ సంఘమువారీ విషయమై ఆందోళనచేసి జిల్లాబోర్డువా రెప్పటియట్లు సదరు గ్రంథాలయములను నడపునట్లు కృషిసల్పిరి.

నూతన గ్రంథాలయములు : నివేదికకాలములో అప్పారావుపేట శ్రీ సరస్వతీగ్రంథాలయ వార్షికోత్సవము జరిగెను. తాడేపల్లిగూడెంలో స్త్రీల గ్రంథాలయ మొకటి, డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తిగారి ఆసుపత్రిలో పఠనమందిర మొకటి నూతనముగ ప్రారంభింపబడెను.

గ్రంథదానము : పెంటపాడు వాస్తవ్యులు శ్రీ తాడికొండ సోమయ్యగారు తాలూకాలోని గ్రంథాలయములకు దానము నిచ్చు నిమిత్తము 500 గ్రంథముల సంఘమున కప్పగించిరి. ఇందు 58 గ్రంథములు అప్పారావుపేట, 25 రావిపాడు, 25 ప్రత్తిపాడు గ్రంథాలయముల కొసంగబడెను.

ఆదాయము లేదు. ఖర్చు ఉత్తరప్రత్యుత్తరముల నిమిత్తం రు 1—2—3

అధ్యక్షుడు : **డాక్టరు తేతలి సత్యనారాయణమూర్తి**

## తెనాలితాలూకా గ్రంథాలయసంఘము

### 1940—41 సం. నివేదిక

**సభ్యులు :** ఈ సంఘమునకు లోగడ చేరిన శాశ్వతసభ్యులు 5 గురు కాక నివేదికకాలములో ఆం. దే. గ్రం. సంఘ సభ్యులుగ నున్న వ్యక్తులు సంస్థలుచేరి 73 మంది సంఘసభ్యులుగ నేర్పడిరి. ఇందు శాశ్వతసభ్యులు 18, సాధారణసభ్యులు 29, పంచాయతిబోర్డులు 12, గ్రంథాలయములు 12, సహకారసంఘము 1, మునిసిపాలిటీ 1.

సమావేశములు : 2 సర్వసభ్యసభలు, 3 పాలకవర్గ సభలు నివేదికకాలములో జరిగినవి.

ప్రచారము : శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ., బి. ఎల్. గారిచే తాలూకాలోని 6 కేంద్రములలో వివిధ విషయములపై 8 ఉపన్యాసము లిప్పించబడెను. 9 వ తెనాలితాలూకా గ్రంథాలయ మహాసభ 20—4—40 వ తేదీన సంఘాధ్యక్షులు ఉ. భా. ప్ర. శ్రీ వడ్లమూడి వేంకటరత్నంగారి అధ్యక్షతను కొప్రగ్రామములో జరిగెను. ఈ సందర్భమున ఆం. దే. గ్రం. సంఘమువారిచే ప్రదర్శనముకూడ ఏర్పాటు చేయబడెను.

బోటుగ్రంథాలయము : 1940 వేసవి అనంతరం 1—9—40 వ తేది నిజాంపట్నంకాలువపై బోటు గ్రంథాలయము తిరిగి ప్రారంభింపబడెను. దీనికి 'ఆంధ్రప్రభ' పత్రిక మాత్రము తెప్పించబడెను.

ఆదాయము రు 36—8—3; వ్యయము రు 20—1—0.

కార్యదర్శి : **చావలి కోటీశ్వరరావు**

## తెలుగుసేవాసంఘము, బొంబాయి

### 1940–41 వార్షిక నివేదిక

బొంబాయి పట్టణములోను, క్రమేణ రాష్ట్రమంతటను నివసించు ఆంధ్రులకును సేవచేయాలనే ఉద్దేశంతో 1939 నవంబరు 26 తేదీన బొంబాయిలోని కొందరు ఆంధ్రులచే నీ సంఘము స్థాపింపబడినది. ప్రారంభోత్సవము 1940 ఫిబ్రవరిలో జరిగింది. మాజీమంత్రి బి. జి. ఖేర్ గారు ప్రారంభించారు. బొంబాయిలో తెలుగువారు ఎక్కువగావుండే కామాటీపురములో తెలుగువారికి ఒక పాఠశాల నెలకొల్పబడి 70 ఏళ్లనాటి తెలుగుగ్రంథాలయాన్ని బాగుచేశారు. 1940 జూన్‌లో బెజవాడ రామచంద్రారెడ్డి గారు కామాటీపుర గ్రంథాలయాన్ని పరిశీలించారు.

ఈ సంఘమువారు 1940 జులైలో వయోజన విద్యావారం జరిపారు. ఈ సంఘకృషివలన బొంబాయి యూనివర్సిటీవారు తెలుగు రెండవభాషగా తమ యూనివర్సిటీలో ఏర్పాటుచేశారు. వర్లీలో జనవరిలో తెలుగు పాఠశాల ఏర్పరచారు. జూన్‌లో బాలికాపాఠశాల ఏర్పరచారు. డిలిసీ రోడ్డులో మరొకపాఠశాల ఏర్పరచి విద్యాభివృద్ధికై కృషిచేస్తున్నారు. నయగామ్‌లో మరొక బాలికాపాఠశాల నేర్పరచారు. వావిళ్ళవారు వారి ప్రచారానికి 300 తెలుగుబాలశిక్షలు ఉచితంగా యిచ్చారు.

1941 వ సంవత్సరాంతమున ప్రచారమంతా సామాన్య ప్రజల అభివృద్ధికై వినియోగించారు. ఈ సంవత్సరాంతమున జరిగిన వయోజన విద్యాప్రచారం మాత్రం తృప్తికరంగా లేదు. ఈ సంఘకృషివలన ఆంధ్రా యూనివర్సిటీవారు యితరప్రాంతాల ఆంధ్రవిద్యార్థులు అటెండన్సు లేకనే మెట్రిక్యులేషను పరీక్షకు వచ్చుటకు అనుమతి నిచ్చారు. సంఘానికి ఉపశాఖకూడా ఏర్పరచారు. ప్రస్తుతము బొంబాయిలో నాలుగుప్రాంతములలో మాత్రము విద్యాప్రచారము చేస్తున్నారు. ఇంకా 20 పాఠశాలలు ఏర్పాటు చేయదలచారు.

## శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము, దక్షిణ హైదరాబాదు

### 1940—41 వ వార్షిక నివేదిక

ఈ నిలయమునకు నివేదికకాలంలో రాజపోషకులు 3, పోషకులు 2, సహాయకులు 2, జీవితసభ్యులు 5, గౌరవసభ్యులు 1 కలరు. మొత్తము సభ్యులసంఖ్య 297; వీరిలో 77 మంది స్త్రీలు.

ఈ సంఘమువారు నివేదికకాలంలో ఆంధ్రసారస్వతాభి వృద్ధికై కృషిచేసిరి. అడవి బాపిరాజుగారి 'లలిత కళలు' అను ఉపన్యాసము, చిలకలపూడి వేంకటేశ్వరశర్మగారి సంగీతసభ, ద్వారము వెంకటస్వామినాయుడుగారికి జరిగిన సన్మానము యిందుకు తార్కాణము. 39 వ వార్షికోత్సవముతోపాటు కవి సమ్మేళనకూడా జరుపబడినది. నివేదికకాలంలో జరిగిన సభలు 31.

ఇది నిజాంరాష్ట్ర ఆంధ్రులకెల్ల కేంద్రగ్రంథాలయముగా పనిచేస్తున్నది. ఈ గ్రంథాలయములోని పుస్తకములు సభ్యులు కానివారుకూడా ఉపయోగించుకొనవచ్చును. ఉదయము 7 నుంచి 11 గం॥ వరకు సాయంకాలము 3 నుంచి 8½ గం॥వరకు పఠనమందిరము తెరచియుంచబడును.

ఈ నిలయపత్రికలు:— దినపత్రికలు 2; వారపత్రికలు 4; మాసపత్రికలు 17. ఇవికాక దాతలచే నొసగబడు పత్రికలు 7 కలవు. తాళపత్రగ్రంథాలు సేకరించి పరిశోధన చేస్తున్న "లక్ష్మణరాయ పరిశోధకమండలి"కి ఈ సంఘము తోడ్పడినది. ఆంధ్ర యువతీమండలివారి కార్యాలయము తమ భవనములో తాత్కాలికంగా నుంచుకొన అవకాశమిచ్చి మహిళామణులకు కూడ తోడ్పడినది. ఈ నిలయమువారు హరికథలుకూడా నివేదికకాలంలో ఏర్పాటు చేశారు.

ఆదాయం రు 1810-5-4; వ్యయము రు 1666-10-3; నిలువ రు 143-11-1.

మొత్తం గ్రంథాలు 4296: సంస్కృతము 556; ఆంధ్రము 3211; ఇతరము 529. నివేదికకాలంలో కొన్నవి 178; దానముగా లభించినవి 86.

గౌరవకార్యదర్శి : **రావాడ సత్యనారాయణ**

## సారస్వతనికేతనము, వేటపాలెము

### 23 వ సం. నివేదిక (1941)

1918 సం. హిందూ యువజనసంఘముగా స్థాపింపబడి 1924 నుండి సారస్వతనికేతనమని పిలువబడుచున్నది. గుంటూరుజిల్లాకిది కేంద్రగ్రంథాలయముగా నున్నది. ఈ గ్రంథాలయ పుస్తకాలు మొదలగునవి ప్రతివాడు ఉచితంగా నుపయోగించుకొనవచ్చును. నివేదికకాలంలో 255 మంది పొరుగు గ్రామాలవారు పాఠకులుగా చేరిరి. మొత్తం పాఠకులసంఖ్య 1453: వీరిలో స్త్రీలు 73, ఇతరగ్రామవాసులు 814. మొత్తం గ్రంథములసంఖ్య 10052; చదువబడిన గ్రంథములసంఖ్య 19307.

గ్రంథాలయంలో స్త్రీశాఖ నేర్పరచి పాఠకురాండ్రకు గ్రంథములు గ్రంథాలయ సేవకునిద్వారా యిండ్లకు పంపబడుచున్నవి. సంచార శాఖకూడా ఏర్పరచబడినది. ఈశాఖ తృప్తికరముగా పనిచేయు

టకు ఏర్పాట్లు చేస్తున్నారు. దినపత్రికలు 4, వారపత్రికలు 10, పక్షపత్రికలు 3, తదితరపత్రికలు 22 గ్రంథాలయానికి తెప్పించారు.

విజ్ఞాన ప్రచారానికై ఉపన్యాసాలు, పురాణశ్రవణము, హరికథాకాలక్షేపము నివేదిక కాలంలో ఏర్పాటు చేశారు. ప్రతి ఆదివారము భజన ఏర్పాటులు చేశారు. సంఘమువారు బ్యాట్ మెంటన్ టోర్నమెంట్సు జరిపారు. గ్రంథాలయభవనాన్ని డాబాగా చేయుటకై పని ప్రారంభించారు.

ఆదాయము రు 4,684-7-0; వ్యయము రు 4,548-11-6; నిలువ రు 135-11-6.

అధ్యక్షుడు : **వూటుకూరు జయరామదాసు**

## శ్రీ భ్రమరాంబామల్లేశ్వరాంధ్ర గ్రంథాలయం, బెజవాడ

### 1940—41 సం. నివేదిక

స్థాపితం 1920. రాజపోషకులు 14, ప్రధాన పోషకులు 2, చందాదారులు 150. గ్రంథాలయములోని మొత్తము గ్రంథముల సంఖ్య 6079; అందులో తెలుగువి 4809. పత్రికా సంపుటములు యిందులో చేర్చలేదు. వాల్మీకిరామాయణం తాటియాకుల గ్రంథములుకూడా రెండు గలవు. గ్రంథాలయ విజిటర్సు రోజుకి 83 మంది. మొత్తం చదువబడిన పుస్తకములు 4618. నివేదికకాలంలో గ్రంథాలయం వారివి 4, ఇతరులవి 19 సభలు గ్రంథాలయములో జరిగినవి. ఈ గ్రంథాలయమునకు 4 దినపత్రికలు, 10 వారపత్రికలు, 26 తదితర పత్రికలు వచ్చుచున్నవి.

ఆదాయము రు 1973-3-0; వ్యయము రు 1218-9-9; నిలువ రు 754-9-3.

కార్యదర్శి : **బచ్చు వేంకటేశ్వర్లు**

## శ్రీ రామకృష్ణగ్రంథాలయము, నవాబుపేట (నెల్లూరు)

### 1940 సం. నివేదిక

స్థాపితం 1928. 1938 వ సం. వరకు అద్దెభవనములోనున్నది. 1938 సం.లో విరాళములు వసూలుచేసి స్వంతభవనము నిర్మించిరి. విద్యుచ్ఛక్తి ఏర్పాట్లు, కరెంటుఖర్చు అంతయు దాతలచే నివ్వబడుచున్నది. పత్రికలు:— దినపత్రిక 1, వారపత్రికలు 2, తదితరపత్రికలు 7 వచ్చుచున్నవి. పుస్తకములు తెలుగు 1393, ఇంగ్లీషు 109. సగటుపాఠకులు రోజుకు 50 మంది. గ్రంథనిలయ నిర్వహణ తృప్తికరముగా నున్నదని పలువురుప్రముఖు లభిప్రాయాల నిచ్చిరి.

ఆదాయము రు 160-5-5; వ్యయము రు 153-9-7.

సంయుక్తకార్యదర్శులు : **వెనుబోలు సుబ్బరామయ్యశ్రేష్ఠి, సూరం సుబ్రహ్మణ్యం**

## కార్వేటినగర పంచాయతీబోర్డు గ్రంథాలయము

1929 వ సం॥లో పునరుద్ధరింపబడిన అమ్నాయనిలయము లజపతిరాయ పఠనాలయమను పేరుతో 10 సంవత్సరములు నడచి మూలబడినది. తదుపరి దీనిని కార్వేటినగర పంచాయతీబోర్డువారు పురజనుల కోరికపై స్వాధీనపఱచుకొని 12-4-40 తేదీనుండి తిరిగి నడపుటకు నిశ్చయించుకొని శ్రీ కార్వేటి నగర రాజాగారిచే ప్రారంభోత్సవము జరిపించిరి.

ఆంధ్రదినపత్రిక, కృష్ణాపత్రికల తెప్పించి గ్రామములో 3 కేంద్రములలో వీనిని చదువుట కేర్పాటు చేయబడెను. నిత్యము వీనిని చదువువారి సగటుసంఖ్య 60. వినువారిసంఖ్య దీనికి చాల మించియుండును.

గ్రంథములు మొత్తము 269. ఇందు 71 పుస్తకములను శ్రీ రాజాగారు బహూకరించిరి. శ్రీ ఆర్. బి. వేంకటపెరుమాళ్ రాజుగారు బీరువా నిచ్చిరి. విద్వాన్ టి. శ్రీనివాసరావుగారు గౌరవగ్రంథ భాండాగారిక పనిచేసిరి.

పం. బో. అధ్యక్షులు : **కవిచెరుకూరు సత్యనారాయణరాజు**

## శ్రీ బాలభారత పుస్తకభాండాగారము, అత్కూరు

### 1941 సం. నివేదిక

స్థాపన 1930. సంఘసభ్యులు 115. గ్రంథముల సంఖ్య 1837. భాండాగారమునకు 4 దినపత్రికలు, 7 వారపత్రికలు, 1 పక్షపత్రిక, 5 మాసపత్రికలు, 1 ద్వైమాసపత్రిక, 1 త్రైమాసపత్రిక తెప్పించబడి నవి. దినదినము గ్రంథాలయమునకు వచ్చినవారి సగటుహాజరు 27 . 8.

గడచిన మూడేండ్లలో గ్రంథాలయము పొందిన క్రమాభివృద్ధిని క్రింది అంకెలు తెలుపగలవు.

| సంవత్సరము | సభ్యులసంఖ్య | పత్రికలు | పుస్తకములు | దినసరి చదువరుల హాజరు |
|---|---|---|---|---|
| 1939 | 82 | 4 | 1606 | 17 . 8 |
| 1940 | 95 | 16 | 1705 | 30 . 7 |
| 1941 | 115 | 19 | 1837 | 27 . 8 |

తగినంత ఆదాయము లేనికారణముచే నివేదికకాలములో క్రొత్తపుస్తకము లెక్కువగ కొనలేదు.

| రు అ పై | ఆదాయము | వ్యయము | రు అ పై |
|---|---|---|---|
| 39—0—9 | గతసం॥ నిల్వ | పుస్తకములు | 9—13—6 |
| 128—0—0 | చందాలు, విరాళాలు | పత్రికలు | 85—11—6 |
| 90—0—0 | అద్దెలు | సిబ్బంది | 60— 0—0 |
| 17—0—0 | ఇతరములు | పరికరములు | 18— 1—3 |
| 274—0—9 | | అచ్చు, స్టేషనరీ | 7—12—6 |
| 247—7—3 | | బైండింగు | 18—10—0 |
| రు 26—9—6 | నిల్వ | వార్షికోత్సవము | 30—12—9 |
| | | ఇతరములు | 16— 6—9 |
| | | | 247— 7—3 |

కార్యదర్శి : **అట్లూరి వెంకటరత్నము**

## దేశోద్ధారక గ్రంథాలయం, ఉప్పుగుండూరు

### ద్వితీయవత్సర నివేదిక (1940—41)

స్థాపితం 1—11—39. నివేదికకాలంలో గ్రంథాలయంలో రేడియోను నెలకొల్పారు. వయోజనవిద్యా రాత్రిపాఠశాల నడిపారు. 800 పుస్తకాలు స్వయంగా బైండుచేశారు. క్రిందటి సంవత్సరము సభ్యులకుమాత్రమే పుస్తకా లిచ్చారు. ఈ సంవత్సరము ఆ నిషేధం తొలగించి ప్రతివారికి పుస్తకాలిచ్చే ఏర్పాటు చేశారు.

పత్రికలు:— దినపత్రికలు 2, వారపత్రికలు 7, తదితరములు 11, మొత్తం 20 పత్రికలు వస్తున్నవి. రాజపోషకులు 4, ప్రధానపోషకులు 2, పోషకులు 42 కలరు. మొత్తం గ్రంథాలు 1100. చదువబడిన పుస్తకాలు 5673. దినసరిహాజరు 2. 17 యితర గ్రామములకు కూడా ఉపయోగపడుతూ ఈ గ్రంథాలయం కేంద్రగ్రంథాలయంగా పనిచేస్తున్నది.

ఆదాయము రు 1031-13-7; వ్యయము రు 928-4-8.

కార్యదర్శి : **గంజాం అనంతలక్ష్మణాచార్యులు**

## శారదాగ్రంథాలయం, పెదకొత్తపల్లి

### 22 వ వార్షికనివేదిక (1940–41)

గ్రంథములసంఖ్య 1014; **వార్తాపత్రికలు :** దైనికపత్రిక 1, వారపత్రికలు 2, తదితరములు 4. పుస్తకము లుపయోగించినవారిసంఖ్య 776; చదివినగ్రంథములు 587. గ్రంథాలయానికి పాఠకులు సగటున రోజుకు 15 మంది వస్తారు. భవనానికి రు 300 అప్పుచేసి ఒకయిల్లు కొనబడెను. నివేదిక కాలంలో పురాణపఠనములు 2, ఉపన్యాసములు 4 జరిగెను.

ఆదాయము రు 137—12—3; వ్యయము రు 103— 0—3.

## శ్రీ విద్యారణ్యగ్రంథాలయము, కోలనపల్లి

### పంచమ వార్షికోత్సవ నివేదిక (1941)

1931 సం. లో గ్రామ సహకారపరపతి సంఘమువారిచే స్థాపించబడి 1933 లో గ్రామ గ్రంథాలయంగా మార్చబడినది. గ్రంథాలయమునకు షుమారు 500-0-0 ల విలువగల 700 గ్రంథాలు రెండు బీరువాలు ఉన్నవి. యీ గ్రంథాలయం తరఫున రాత్రిబడి నడపబడుచున్నది. గ్రామంలో వారమున కొకసారి పుస్తకములు ఇండ్లకు పంపబడుచున్నవి. పొరుగున ఉన్న కాళ్ల గ్రామమునకు గూడా వారమున కొకసారి ప్రతి ఇంటికి పుస్తకములు పంపబడుచున్నవి. నివేదిక సంవత్సరములో సగటున రోజుకు 30 మంది గ్రంథాలయమునకు వచ్చిరి. ఇండ్లకు తీసికొనిపోయిన పుస్తకములు 1195. ఇండ్లకు పంపిన పుస్తకములు 849. కాళ్ళగ్రామంలో ఇండ్లకు పంపిన పుస్తకములు 693. దినపత్రిక ఆంధ్రప్రభ తెప్పించబడినది.

ఆదాయము రు 122—0—0; ఖర్చు రు 120—0—0.

---

# విశేషాలు – వ్యాఖ్యలు

**ఈశ్వరపుస్తకభాండాగారము, కాకినాడ**

పై గ్రంథాలయముయొక్క రజతోత్సవము 1941 జనవరి 12, 13 తేదీలలో శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారి అధ్యక్షతను జరిగెను. శ్రీ సాగి వెంకటనరసింహం, కనకవల్లి భాస్కరరావునాయుడు, దువ్వూరి సుబ్బమ్మ, బులుసు వెంకటసుబ్బారావు, జటావల్లభుల పురుషోత్తంగార్లు ఉపన్యసించిరి.

**శ్రీ సౌమ్యగ్రంథాలయము, గూడవల్లి**

7-2-41 తేదీ రేపల్లెతాలూకా గూడవల్లిలోని పై గ్రంథాలయముయొక్క నూతన భవన ప్రవేశోత్సవమును గుంటూరుజిల్లాబోర్డు ఉపాధ్యక్షులు శ్రీ గోగినేని వెంకటసుబ్బయ్యగారు జరిపిరి.

### శ్రీ ఉమామహేశ్వర గ్రంథాలయము, పెడన

బందరుతాలూకా పెడనగ్రామమునందలి పై గ్రంథాలయముయొక్క పుష్కరోత్సవము 25-5-41వ తేది సాయంత్రం కృష్ణాజిల్లా కలెక్టరు రావుబహదూర్ డి. మహంతిమహాశయోగారి అధ్యక్షతను జరిగెను. కృష్ణాజిల్లాజడ్జి శ్రీమాన్ పి. యం. శ్రీనివాసయ్యంగారు సభను ప్రారంభించిరి. గ్రంథాలయాధ్యక్షులు శ్రీ భట్ట కుమారస్వామిగారు అధ్యక్ష ప్రారంభకులకు, సభికులకు స్వాగతముచెప్పిరి. కార్యదర్శి శ్రీ వార్త సుబ్బారాయుడుగారు గ్రంథాలయనివేదికను చదివిరి.

### శ్రీ సూర్యరాయ విద్యానందగ్రంథాలయము, పిఠాపురం

పై గ్రంథాలయముయొక్క రజతోత్సవము 1941 ఆగష్టు 23, 24, 25 తేదీలలో శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారి అధ్యక్షతను జరిగినది. ఆం. దే. గ్రం. సంఘోపాధ్యక్షులు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి ప్రారంభోపన్యాసముతో కార్యక్రమ ముపక్రమింపబడినది. అధ్యక్షులవారు గ్రంథాలయములగూర్చియు, కావ్యములనుగూర్చియు, ఇందు ముఖ్యమగు రామాయణ మహాకావ్యమునుగూర్చియు విపులముగ నుపన్యసించిరి. శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగార్లు గ్రంథాలయమును ప్రశంసించుచు పద్యముల జదివిరి. 24—25 తేదీలలో కవిరాజు విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షతను సభలు జరిగినవి. ఇందు పండితుల ఉపన్యాసములు, సారస్వతచర్చలు జరిగినవి.

### శ్రీ వేణుగోపాల గ్రంథాలయ పునరుద్ధరణ

తెనాలితాలూకా వేమూరునందలి పై గ్రంథాలయము 1941 జూన్ మాసారంభమున పునరుద్ధరింపబడినది. పంచాయతీబోర్డు వారు దీని నిర్వహణమునకు బూనిరి.

### శ్రీ కన్యకాపరమేశ్వరీ గ్రంథాలయము, ఆకిరిపల్లి

ఆకిరిపల్లిలోని శ్రీ శోభనాచల పఠన మందిర గ్రంథాలయము సక్రమముగ నడువని కారణముచే స్థానిక ఆర్యవైశ్య సంఘమువారు దీని నప్పగించుకొని పై పేరుతో నడుపుటకు నిశ్చయించుకొని 1941 జులై నెలలో గ్రంథాలయమునకు స్వంత భవనమును నిర్మించుటకు ప్రారంభించిరి.

### శ్రీ వేణుగోపాల పుస్తకభాండాగారము, కోనేటిపురం

రేపల్లెతాలూకా కోనేటిపురమునందలి పై గ్రంథాలయమునకు భవనమును నిర్మించు నిమిత్తము 50 చదరపు గజముల స్థలమును పంచాయతిబోర్డు సభ్యులు శ్రీ గొట్టుముక్కల వేంకటేశ్వర్లుగారు రుచితముగ నొసంగిరి. ఇందులో 1941 ఆగస్టు 13 వ తేదీన శ్రీ తేలప్రోలు రాఘవయ్యగారు భవనమునకు శంఖుస్థాపన చేసిరి.

### శ్రీ కృష్ణదేవరాయ పుస్తకనిలయము, చెరుకుమిల్లి

1916 సం. లో స్థాపింపబడిన పై గ్రంథాలయమును 15—7—38 వ తేదీన గ్రామసహకార సంఘమువారి కప్పగించుటకు తీర్మానము జరిగెను. ఈ తీర్మానమును రద్దుచేస్తూ తిరిగి 9—9—38 వ తేదీన నిది పంచాయతీబోర్డువారికి స్వాధీనము చేయబడి అప్పటినుండి వారి పరిపాలనక్రింద సాగింపబడుతున్నది.

### కుప్పిలి గ్రంథాలయము పంచాయతీబోర్డు స్వాధీనము చేయబడుట

విశాఖపట్టణముజిల్లా కుప్పిలి గ్రామములో కొన్ని సంవత్సరముల క్రితము గ్రామస్థులొక గ్రంథాలయమును స్థాపించిరి. 2—10—41 వ తేది స్థాపకులు దీనిని పంచాయతీబోర్డువారికి స్వాధీనపరచిరి.

## శ్రీ వివేకానంద గ్రంథాలయములో రేడియో స్థాపన

గుడివాడ తాలూకా పసుమర్రుగ్రామమున శ్రీ దావులూరు సూర్యప్రకాశరావు చౌదరిగారిచే ఏర్పరచబడిన పై గ్రంథాలయములో పంచాయతీబోర్డువారి ద్రవ్యముతో 5—12—41 వ తేదీన రేడియో స్థాపించబడినది.

## తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్య విజ్ఞాన సంస్థ

మే 1. శాంతినికేతనమునగల ప్రొఫెసర్ టాన్‌యన్‌షన్‌గారి సిఫారుసుమీద చైనా అధ్యక్షులు చంగ్‌కేషేక్‌గారు బుద్ధవాఙ్మయము త్రిపీటక (చైనాభాషలో) గ్రంథాలు తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విజ్ఞాన సంస్థకు కానుక ఇచ్చారనియు, అవి యీ వారము తిరుపతికి పంపబడినవనియు తెలుపబడుచున్నది.

జూన్ 13. సిలోన్ గవర్నమెంటువారు తమ పురాతత్వశాఖల గ్రంథములను పై సంస్థకు ఉచితముగ నిచ్చిరి.

సెప్టెంబరు 19. మైసూరు, తిరువాన్కూరు, జమ్ము, కాశ్మీరు సంస్థానాధిపతులు పై సంస్థకు విలువగల పుస్తకాలను బహూకరించారు. క్రొత్త భవనాలు పూర్తియగుచున్నవి. పుస్తకభాండాగారం సంస్కృతం, పాళీ, తమిళం, తెలుగుభాషల్లో పరిశోధనకు బాగుగ తోడ్పడుతుంది. 30—6—41 వ తేదీన ముద్రిత గ్రంథాలసంఖ్య 14,618. అముద్రిత గ్రంథాలసంఖ్య 6,800. బహూకరింపబడిన పుస్తకాలవెల అంచనా రు 6,200—0—0.

అక్టోబరు 23. పై సంస్థకు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ గవర్నరు తమ ప్రభుత్వంవారు ప్రచురించుచున్న ప్రిన్సెస్ ఆఫ్ వేల్సు శ్రీ సరస్వతీభవన్‌వారి సంస్కృతప్రచురణములన్నియు- ఇదివరకు ప్రచురింపబడినవి, ఇకముందు ప్రచురింపబడునవికూడ ఉచితంగా ఇచ్చివేసిరి. సంస్కృతగ్రంథముల జాబితాలుకూడ ఇచ్చివేసిరి.

## ఢిల్లీలో ఆంధ్రగ్రంథాలయం

కీ. శే. దేశోద్ధారక విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుగారి పేరట ఢిల్లీలో నెలకొల్పబడిన ఆంధ్ర గ్రంథాలయమునకు గ్రంథములు ధర్మము చేయగోరువారు శ్రీ యండమూరి సత్యనారాయణరావుగారు, కార్యదర్శి, ఢిల్లీ ఆంధ్రసంఘము, 112 ఇ. తిమార్పూరు, ఢిల్లీ చిరునామాకు వానిని పంపుటకై కోరబడిరి. గ్రంథభిక్షకై ఢిల్లీ ఆంధ్రసంఘమువారు 31—5—41 వ తేది ఆంధ్ర దినపత్రికలో నొక ప్రకటనను గావించిరి.

## ఇండియా సిపాయిాలకు పుస్తకాలు

మద్రాసు ప్రభుత్వమువారు ఇతర దేశములలో నున్న ఇండియాదేశపు సిపాయీల ఉపయోగంనిమిత్తం దేశభాషలలోనున్న పుస్తకాలు పత్రికలనిమిత్తం 1941 జులైనెలలో ఒక విజ్ఞప్తిని పత్రికలలో ప్రకటించినారు. రైల్వేస్టేషనులలో అమ్మబడు సచిత్రపత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలు, అపరాధ పరిశోధక నవలలు, సులభముగ అర్థమగు ఇతర పుస్తకములు మాత్రము వారికి కావలెనట. దినపత్రికలు గాని, క్లిష్టసమస్యలకు సంబంధించిన పుస్తకాలుగాని అక్కరలేదట. జిల్లా యుద్ధకమిటీలకు, లేదా రాష్ట్రీయ యుద్ధకమిటీకి, లేదా మదరాసు వై. ఎం. సి. ఏ. జనరలు సెక్రటరీగారికి. ముఖ్యముగా అరవ తెలుగుపుస్తకాలను, పత్రికలను పంపవలసినదిగ ధర్మాత్ములను వీరు కోరిరి.

## రైల్వేస్టేషనులో గ్రంథాలయము

బొంబాయిలోని విక్టోరియా టర్మినస్ స్టేషనులో జి. ఐ. పి. రైల్వేవారు రైళ్ళు బయలుదేరువరకు చదువుకొనుటకు 1, 2 తరగతుల ప్రయాణీకుల నిమిత్తం ఒక గ్రంథాలయాన్ని స్థాపించాడు. పుస్త

కాలు, పత్రికలతో కూడిన ఈ గ్రంథాలయము ఆదివారం తప్ప నిత్యము ఉదయం 9½ గంటలనుండి సాయంత్రం 6 గంటలవరకు తెరచియుంచబడును. రైల్వే ప్రయాణీకులకు స్టేషనులో గ్రంథాలయ ముండుట కాలక్షేపమునకు చాల ఉపయోగకరము.

బెజవాడస్టేషనులోను ఇట్టి గ్రంథాలయమొకటి స్థాపింపబడినచో 100 పుస్తకముల నుచితముగ నిచ్చుటకు ధర్మాత్ములొకరంగీకరించినట్లు తెలియుచున్నది. యం. అండ్ యస్. యమ్. రైల్వే అధికారు లనుమతి నిచ్చుచో నీ పనికి బూనుదుమని ఆంధ్రదేశ రైల్వే ప్రయాణీకుల సంఘమువారు చెప్పుచున్నారు. అయితే వీరు బొంబాయిలోవలెగాక 3 వ తరగతి ప్రయాణీకులకే ముఖ్యము నిట్టి సౌకర్యమును గలిగించుట లెస్స.

### అన్నిమతాలవారికి ఒక దేవాలయం - అందులో గ్రంథాలయం!

సింధుదేశంలో లార్ఖానాలో ఒక దేవాలయమును కట్టిస్తున్నారు. దీనిలోనికి అన్ని మతాలవారిని రానిస్తారు. దీనిలో ఒక గ్రంథాలయం ఉంటుంది. ఈ గ్రంథాలయంలో అన్నిమతాల గ్రంథాలు ఉంటాయి. అన్ని మతాలవారు ఈ దేవాలయంలోకి వచ్చి తమ తమ సాంప్రదాయాల ప్రకారం ప్రార్థనలు చేయవచ్చును. గ్రంథాలను చదువుకొనవచ్చును.

### బొంబాయిరాష్ట్రంలో గ్రంథాలయాభివృద్ధి:

పై విషయంలో తగిన సూచనలను చేయడానికి బొంబాయి ప్రభుత్వంవారిచే నియమించబడిన కమిటీ వారు క్రింది సూచనలను చేశారు.

1. రాష్ట్రమంతటా చాలా గ్రంథాలయాలుండవలెను. మహారాష్ట్రంలో పూనాలోను, కర్ణాటకంలో ధార్వారులోను, గుజరాతులో అహమ్మదాబాదులోను ప్రాంతీయ గ్రంథాలయాలుండవలెను. బొంబాయినగరంలో ప్రధాన రాష్ట్రీయ గ్రంథాలయం ఉండవలెను. ఈ నాలుగు పెద్ద గ్రంథాలయాల నిమిత్తం ప్రతి సంవత్సరము 60 వేల రూపాయలను వ్యయపరస్తూ ఉండవలెను.

2. ప్రతి మండలంలోను ప్రధాన పట్టణంలో నొక గ్రంథాలయం ఉండవలెను.

3. ప్రతి తాలూకా ముఖ్యపట్టణంలోను ఒక గ్రంథాలయం ఉండవలెను. ఇందు నిమిత్తం 21 వేల రూపాయలు వ్యయమవుతుంది.

4. రెండువేలకు పైబడి అయిదువేలకు మించని జనసంఖ్యగల ప్రతిగ్రామంలోను ఒక గ్రంథాలయ ముండవలెను. ప్రతి గ్రామగ్రంథాలయానికి సాలుకు 100 రూపాయల నియ్యవలెను. ఇందుకు వ్యయం 81,500 రూపాయలవుతుంది.

5. వెయ్యి, రెండువేల మధ్య జనసంఖ్యగల గ్రామాలు 2,696 ఉన్నవి. ఇట్టి ప్రతి గ్రామంలోను ఒక గ్రంథాలయం ఉండవలెను. ప్రతి గ్రంథాలయానికి సాలుకు 50 రూపాయల నియ్యవలెను. దినిక్రింద 89,000 రూపాయలు వ్యయమవుతుంది.

6. వెయ్యిమందికంటె తక్కువజనసంఖ్యగలవి 177,743 గ్రామాలున్నాయి. ఇట్టి ప్రతి గ్రామంలోను ఒక గ్రంథాలయం ఉండవలెను. వీటికి ఒక్కొక్కదానికి సాలుకు 25 రూపాయల నియ్యవలెను. ఇందుకు మొత్తం వ్యయం 1,300,000 రూపాయలవుతుంది. ఇంగ్లాండు మొదలైన దేశాలలో గ్రంథాలయాలను వృద్ధినొందించడానికి గ్రంథాలయ సంఘాలున్నాయి. అటువంటి సంఘాలు ఇండియాలో కూడా ఉండవలెను.

### ఆంధ్ర సాహిత్య విజ్ఞానసర్వస్వము :

తిరుపతిపట్టణమున నెలకొల్పబడియున్న శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిషత్తువారు రచింపబూనుకొన్న 'ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము'నకు ఆంధ్రదేశమునందలి కవులయొక్కయు, రచయితలయొక్కయు జీవిత సంగ్రహములు, వారు రచించిన గ్రంథముల పట్టికలు (ముద్రితాముద్రితములు) కావలసియున్నందున వీనిని పై పరిషత్తువారికి పంపి తోడ్పడుటకై కవులు, పండితులు కోరబడినారు.

### ఆంధ్రరాష్ట్ర సంస్కృత పండిత చరిత్ర :

శ్రీ కర్ణవీర నాగేశ్వరరావుగారు (చీరాల) అఖిలభారత సంస్కృత ప్రచారసమితి (కాశి) వారి ప్రోత్సాహముచే ఆంధ్రరాష్ట్రములోని సంస్కృత పండితుల చరిత్రను వ్రాయబూనుకొన్నారు. ముందీచరిత్ర. హిందీలో వ్రాయబడును. వీలువెంట ముస్ముందు సంస్కృతములోని కనువదింపబడును. ఆంధ్రదేశమునందలి సంస్కృతపండితుల ప్రతిభ నుత్తరదేశీయుల కెఱుకపఱచుటకే ఈ కార్య ముద్దేశింపబడినది. కాన సంస్కృతపండితు లందఱు తమ తమ పాండిత్య ప్రకర్ష, గ్రంథరచన, తా మే పరీక్షయందు తీర్ణులైనది, జన్మస్థానము, పితృనామము, ప్రస్తుత కార్యక్రమము మున్నగు విశేష విషయములను తెలుగున వ్రాసి వారికి పంపుటకై కోరబడిరి.

### పురాతనగ్రంథ సంరక్షణ :

భారతదేశంలోని పురాతన చరిత్రప్రసిద్ధములైన పత్రములను గ్రంథములను భద్రపరచుటను గూర్చి ఏర్పడినకమిటీ బరోడాలో సమావేశమైనప్పుడు చేసిన సిఫార్సులను అనుసరించి ఇంపీరియలు రికార్డు డిపార్టుమెంటువారు "రికార్డులను భద్రపరచుపద్ధతులను" గూర్చి కొన్ని విషయములను ఒక చిన్న గ్రంథంగా ప్రచురించారు.

ఢిల్లీలో ఉన్న గవర్నమెంటు రికార్డుకీపరు అగు డా॥ యస్. యన్. సేను, యం. ఏ, పిహెచ్. డి., బి. లిట్ (అక్సఫర్డు) గారును, మద్రాసు రికార్డు ఆఫీసులో క్యూరేటరుగానున్న డా॥ బి. యన్. బలిగా యం. ఏ., పి. హెచ్. డి. గారును, తిరువనంతపురంలోని సైన్సు కాలేజీలోని కే. సీతారామయ్యరుగారును సూచించిన అనేక పద్ధతులు యీ గ్రంథంలో పరిశీలింపబడినవి.

అమెరికా సంయుక్తరాష్ట్రములలోని పురాతన గ్రంథ నిక్షేపములందు అవలంబింపబడుచున్న ఆధునిక పద్ధతులున్ను, యూరోపులోను అమెరికాలోను ఇంగ్లాండులోని బ్రిటిష్ రికార్డుల అసోసియేషను లోను అవలంబింపబడుతున్న పద్ధతులును యీ గ్రంథంలో విమర్శింపబడినవి. సెల్లులాజు ఆసిటేటు పొరలతో గ్రంథ పత్రములకు ఆచ్ఛాదన కల్పించడం ఒక మంచి పద్ధతి. క్రిమికీటక నిపీడిత గ్రంథాలకు కొన్ని క్రిమిహారధూపాలను వేయడం ఇంకో పద్ధతి. ఈ రెండుపద్ధతులును భారతదేశంలోని ప్రాచీనగ్రంథభద్రమందిరాధికారులు గమనించదగినవై యున్నవి.

# గ్రంథ సమీక్షలు

## ఇంగ్లీషు

### రాజమండ్రి హిందూస్థాన్ పబ్లిషింగ్ కంపెనీవారి ప్రచురములు

**ఎడుకేషన్ ఫార్ లైఫ్ (జీవితమునకు విద్య)** కర్త—జే. సి. కుమారప్ప—పేజీలు 47. వెల 0—2—0

ఇది 1937 న జరిగిన ఆంధ్రదేశ వయోజన విద్యామహాసభలో శ్రీ కుమారప్పగారు చేసిన యుపన్యాసము. గుమాస్తా గిరికీ, తరువాత మేస్త్రీపనులకు ఆంగ్లప్రభుత్వమువారు భారతీయులను సిద్ధపరచుకొనుటను వివరించి శ్రీ కుమారప్పగారు నాటికి పదునైదేండ్ల క్రిందటి శాసనోల్లంఘన కాలమున విద్యాశాలలు బహిష్కరింపబడుటయు జాతీయ విద్యాసంస్థ లేర్పడుటయు క్రొత్త విద్యావిధానము లాలోచనలోకి వచ్చుటయు ప్రస్తావించిరి. తాము సాగించు అఖిలభారత గ్రామసౌభాగ్యసంఘములో గ్రామసేవకుల యావశ్యకము మొదట మొదట వ్యక్తమయినట్లు వ్రాసిరి. సత్యదీక్షతో వెలుగతగిన గాంధియుగములో చారిత్రక సత్యమునకు తావే లేక పోవుచున్నది. శాసనసభలు—ప్రజల వోట్లచే ఏర్పడునవి— వందేమాతరము దినములలో లేకపోబట్టి నాడు శాసనసభల బహిష్కారము రాలేదుకాని వందేమాతరం దినములలోనే ఇరువదియవ శతాబ్దపు మొదటి దినములలోనే సర్కారువారి పోషణలోని విద్యాలయముల బహిష్కారము ఇతర బహిష్కారములతో కూడ అమలులో ఉన్నది. సారస్వత, విజ్ఞానశాస్త్ర, పారిశ్రామికవిద్యల సమ్మేళనవిధాన మాలోచింపబడినది. విద్యాప్రణాళికలు తయారయినవి. ఆంధ్రభూమిలో నాడంకురించిన జాతీయ కళాశాల యనుభవమును తరువాతి యనుభవమును 1924 న బ్రాహ్మణకోడూరులో నేటి వార్ధా విధానమువంటి విధానమును క్రమముగా వ్రాయుటకు పనికివచ్చినవి.

చరిత్రమాట యెట్లున్నా కుమారప్పగారు శ్రీ గాంధిగారి వార్ధావిధానమును వివరించుటకు తమ యుపన్యాసము నుపయోగించిరి. విద్య మానవుని సర్వశక్తుల స్వతంత్రవిజృంభణమునకు తోడ్పడవలెనని విద్యార్థుల పరిసరములలోని వారికే స్థానికపరిస్థితుల పరిచయముండునుగాన విద్యావిషయమున గ్రామము సర్వస్వతంత్రముగా నుండదగునని చెప్పిరి. మన రైతు స్థానికముగా దీక్షతో వస్తూత్పత్తిచేసికొనుటకును వివేచించి స్థానికముగా ఉత్పత్తియైనవానిని చక్కగా వాడుకొనుట నేర్చినగాని ముక్తిలేదని సిద్ధాంతీకరించిరి. వార్ధావిధానాన్ని వివరించిరి. చిన్నపిల్లల బళ్లఖర్చు అచ్చటి యుత్పత్తిమూలకంగా ఎప్పుడును భర్తీకాదని శ్రీ గాంధీజీగారి స్వయం పోషకత్వానికి క్రొత్తవ్యాఖ్యానముచేసిరి. ప్రపంచకమునకు విద్యార్థి సిద్ధమయి కలుగజేసేఫలముతోగూడ చేర్చి ఆలోచించినప్పుడు స్వయం పోషణత్వముగాని గాంధీజీ చెప్పినది ఎక్కడికక్కడే స్వయం పోషణత్వము సమకూడునని వారియర్థముకాదనిరి. అప్పుడీ స్వయంపోషక సిద్ధాంతాని కర్థమే లేక పోవును. ఒక్కొక్క విద్యావిధాన కర్తకూడ విద్యార్థిని ప్రపంచమునకు ప్రయోజనకారిని చేయుచున్నాననే తలంచును. అందుచేత తనవిధానము తుదకు స్వయంపోషకమే యగును.

వయోజనవిద్యనుగురించి వీరు ముచ్చటించిరి. చదువను ప్రతివాడు సమర్థుడుకావలెనని కోరుటకంటె ప్రతి గ్రామవాసికిని అతను ఎట్లు జీవించవలెనా అని వివరించి బోధించుటే యెక్కువ ముఖ్య

మనిరి. చదువను రావలెనని కోరేవారెవ్వరును ఈ రెండవఉద్దేశమును వద్దనరు. నిజమునకు చదువు నేర్పుటే యీ రెండవఉద్దేశమును పూర్తిచేయుటకొరకే చదువు సాధనము. ఈ సాధనము లేక ఈదినములలో పైఉద్దేశము పూర్తికాదని విశ్వసించుటను చేసే వయోజనవిద్యలో చదువను నేర్చుట తప్పని మొదటి తరిబీతుగా నెంచుట.

## అడల్టు ఎడుకేషన్ అండు ప్రొగ్రెసివ్ రైటర్సు (వయోజనవిద్య, అభివృద్ధి వ్రాయసకాండ్రు)

కర్త— శనివారపు సుబ్బారావు పేజీలు 100. వెల 0-8-0

ఇందు 1938 వ సంవత్సరమున శేశవరమున జరిగిన ఆంధ్రదేశ వయోజనవిద్యామహాసభ, ఆంధ్రదేశ అభివృద్ధి వ్రాయసకాండ్ర సమావేశముల డాక్టరు సుబ్బరాయన్, గరిమెళ్ళ సత్యనారాయణ గారల అధ్యక్షోపన్యాసములును, రెండు అధ్యాయములుగా అభివృద్ధి వ్రాయసకాండ్ర ధర్మము లనుగురించి ఆచార్య ఎన్. జీ. రంగాగార్లు వ్రాసినవ్యాసమును కలవు. అనుబంధములుగా ఆ సమావేశముల తీర్మానములును, 1921-24 లో పంజాబు గవర్నమెంటువారు జరిపిన అక్షరజ్ఞత ప్రయత్న వివరములును ఆంధ్రదేశములోని వయోజనవిద్య సంఘమువారు నాటి మంత్రికి పంపుటకు తయారుచేసిన తాత్కాలిక ప్రణాళికయు, మరికొన్ని ఇతరవిషయములును ఇచ్చిరి. ఈప్రణాళి కను ఆచార్య రంగాగారు వివరముగా తమ గ్రంథముననిచ్చిరి. ఆగ్రంథవిమర్శ వెంటనే ఇచ్చు చున్నాము.

## ఇండియన్ అడల్టు ఎడుకేషన్ మూవ్మెంటు (భారతదేశీయ విద్యోద్యమము)

కర్త— ఆచార్య ఎన్. జీ. రంగా. దీనిని ప్రకటించినవారు ఆంధ్రదేశ వయోజనవిద్యాసంఘము వారైనా సోల్ ఏజంట్లు రాజమండ్రి హిందూస్థాన్ పబ్లిషింగ్ కంపెనీవారే. పేజీలు 224. వెల 1-0-0

ఈ గ్రంథాదిని శ్రీ శనివారపు సుబ్బారావు, ఆచార్య రంగాగార్ల జీవితకథనముకలదు. రంగా గారి జీవితకథనమును శ్రీ భమిడిపాటి సత్యనారాయణగారు చేసిరి. అందులో ప్రత్యేకముగా శ్రీమతి భారతీరంగాగారి ప్రశంసతెచ్చి ఆమె ఏవిధముగా వయోజనవిద్యకు దృష్టాంతమో స్పష్టపరచియుండుట, అందు రంగాగారి కెంత యశముచెంద తగునో నిరూపించియుండుట గమ నింపదగినది.

మొదటియధ్యాయమున రంగాగారు వయోజనవిద్య యననేమో వివరించిరి. మానవుని సంఘజీవ నమున కర్త మొనర్చుట వయోజనవిద్యయని వారు సారాంశమును దేల్చిరనవచ్చును. దీనికి అవలం బింపదగు 31 మార్గాలను సూచించిరి. ఇందులో కొన్ని పరస్పర వ్యత్యయములుగా నున్నా అవి పరస్పర సహకారులే యనిరి. నాదేమార్గమను ఛాందసుల కిది సరియైనజవాబు.

నేటి వయోజన విద్యాధోరణులను కొన్నిటిని వివరించి అందు నిరక్షరాస్యనిర్మూలనము ప్రథమావ సరమని నిర్ణయించిరి. ఈ యుద్యమచరిత్రను వ్రాయుచు ఆంధ్ర జాతీయకళాశాలను స్మరించిరి. గాడిచర్ల హరిసర్వోత్తమరావు, జీ. రామకృష్ణయ్య, జి. సీతారామశాస్త్రి ప్రభృతులు 1924లో వ్రాసిన విద్యాప్రణాళిక చాల సంపూర్ణప్రయత్న మనిరి. శ్రీ శనివారపు సుబ్బారావు వగైరాల ప్రయత్నములను వర్ణించిరి. స్త్రీల జాతీయవిద్యకై కర్వే, ఉన్నవ లక్ష్మీనారాయణలు చేసిన కృషి, రామానీడుసంస్థయొక్క కార్యసాధన, కిసాన్ విద్యాలయాల వృత్తాంతము నిచ్చిరి. గ్రామపున ర్నిర్మాణముల వార్త మరువలేదు. అరవనాడు, పంజాబు, బీహారు ప్రయత్నాలను సింహావలోకనము కావించిరి. సోమలిష్టుబళ్ళకు వేరు అధ్యాయమిచ్చి అచ్చట ఉపయోగపడు గ్రంథాలజాబితా నిచ్చిరి. ఆంధ్ర రైతాంగవిద్యాలయము మొదటి ఏడాది (1938) కార్యనివేదికనుచేర్చి అచ్చట

ఉపయోగించిన రిపోర్టులు పుస్తకములు జాబితాచేసిరి. ఇది చాల ఉపయోగకరము. కాంగ్రెసు వారి విద్యాలయాల విషయమును ప్రస్తావించి మహాజన వయోజనవిద్యాలయాలెట్లు స్థాపించవలెనో సాగించవలెనో వివరముగా సూచించిరి.

తరువాత తొమ్మిదిపది అనుబంధములు, ఉపానుబంధములతో సహాయిచ్చిరి. ఇందులోను రెండు భాగములున్నవి. రెండవభాగమున 1938 వ సంవత్సరమున రాష్ట్రప్రభుత్వాలేర్పరచిన కమిటీలు వయోజన విద్యనుగురించి వ్రాసినరిపోర్టులన్నియును గలవు. మొదటిభాగమున (1) రాజమండ్రి గ్రామ పునర్నిర్మాణ విద్యాలయము 1931 నకుగాను (2) తాడేపల్లిగూడెము తాలూకాబోర్డు ఉపాధ్యాయుల వేసంగిపాఠశాలకుగాను సిద్ధపరచిన విద్యాప్రణాళికలు (3) ఇందుకుగాను శనివారపు సుబ్బారావు, భమిడిపాటి సత్యనారాయణులు తయారుచేసిన చిత్తు (4) వారపుచి వర దినముల బళ్లకని శనివారపు సుబ్బారావుగారు తయారుచేసిన ప్రణాళిక (5) నిడుబ్రోలు ఆంధ్ర రైతాంగ విద్యాలయమునకని తయారుచేసిన ప్రణాళికచేరియున్నవి. శనివారపు సుబ్బారావుగారి స్వతంత్రగ్రామనిర్మాణపు బిల్లుచిత్తును కలదు. ఇవన్నియు వయోజన విద్యాప్రచారాభిలాషులకు మిక్కిలి యుపయోగకారులుగా నుండుననుటకు సందేహములేదు.

గా. హరిసర్వోత్తమరావు

## అరవము

**తంబీ వా (తమ్ముడా రా):** కర్త శ్రీ సి. రాజగోపాలచార్యులు. ప్రచురణకర్తలు రాక్‌హౌస్ అండుసన్సు లిమిటెడ్, ఎస్ప్లనేడ్, మద్రాసు పేజీలు 35. వెల 0-2-0.

ఇది వయోజనవ్యాప్తికొరకు శ్రీ రాజగోపాలాచార్లవారు వ్రాసిన మొదటిపుస్తకము. ఇందులో వీరి విధానమునుగురించి వివరము లేమీలేవు. కొన్నిపాఠాలయినపిదప అంతవరకు నేర్చినవాడు మరియొకరికి నేర్పునట్లు చేయవలసినదని మూడునెలలలో వ్రాయను చదువను నేర్పవచ్చుననిరి. ఈ పుస్తకములో కడపటిరెండు పేజీలలో ఇంగ్లీషుఅంకెల రూపములు స్థూలముగానిచ్చిరి. మొదటి పందొమ్మిది పేజీలలో వట్టిపదములుగలవు. 20 వ పేజీనుండి వాక్యములు సులువయినవి వ్రాసిరి. ఇందులోకొన్ని లోకోక్తులు. అరవమున అక్షరములు చాలతక్కువ. అందులో అ, ఇ, ఎ అను అచ్చులు, అయిదు వర్గ ప్రథమాక్షరములు, అయిదు అను నాసికములు, ఎనిమిది యరల వాదులు పెద్దక్షరములుగా పదరూపముగా 'పవడమ్' అన్నట్లు ఇచ్చిరి. తరువాత ఇతర అచ్చులు వచ్చునట్లు కొంచెము తక్కువ పరిమాణపు అక్షరములలో నాలుగు పేజీల పదములిచ్చిరి. తరువాత అక్షరముల పరిమాణము తగ్గించుచు పోయి అరవమునకు ఆది అక్షరములు కాని వ, జ, ఐ, స, లు వచ్చుసరికి మరి పెద్దఅక్షరములలో 11 పదములు మాత్రమువ్రాసిరి. ఉపయోగమున దీని ప్రయోజన మెంతవరకుండునో చెప్ప వీలులేదు.

**ఊరుక్కు నల్లదు (ఊరికిమంచిది) :** శ్రీ రాజగోపాలాచారిగారి రెండవపుస్తకము. దీని కర్తృత్వమున శ్రీ సంతానంగారికిని భాగముకలదు. పేజీలు 44. వెల యివ్వలేదు.

వయోజనవిద్యతో ఆరంభించి ఒక్కొక్క పేరాగా పని, విరామము, కాలపువిలువ, దేహవస్త్ర గృహపరిసర పరిశుభ్రత, చెత్తకుప్ప లెత్తివేయడము, దంపుడుబియ్యము, ఇతరధాన్యములు, ఉచిత భోజనము, త్రాగుడునీరు, బావులు, మలమూత్రవిసర్జనములు, ఈగలచెరుపు, దోమలచెరుపు, ఉడుపులు, పరుపులు, వెల్లవేయుట, వీనినిగురించి వ్రాసిరి. కొలతలని—అంగుళములు అడుగులు వాని ప్రయోగములు, చదురపుటడుగు, చదురపుగజము, ఎకరా, ఘనఅడుగు, రూపాయలణాలు

పైసలు, తులాలు శేర్లు మణుగులు, ఉత్తర దక్షిణదేశ భేదములు, కాలమానములను వివరించిరి. అటనుండి ఉష్ణమాపకయంత్రమును వర్ణించిరి. పిదప వ్యవసాయవిషయములు కూర్చిరి. భూసారములు, పైరురోగములు, పైరు మార్పుదల, వ్యవసాయ డిపార్టుమెంటు, పంచివిత్తనము, ఎరువులను గురించి వ్రాసిరి. తరువాత చేతిపనులు—వడకడము, నేత, వడ్రంగము, కమ్మరము వగైరాలు కూలి, వీనిని వివరించిరి. తర్వాత ఇండియానుగురించి ఒక్క పేజీ, తమిళనాడునుగురించి రెండు పేజీలు, రాజ్యాంగము, పత్రికలు, ఎలెక్షనులు, కో-ఆపరేషను, కోర్టులు, పన్నులు, ఉద్యోగస్థులు, ప్రజాజీవనములను గురించి కొద్దికొద్దిగా వ్రాసిరి. తుదకు పట్టిగీతల ఇండియాపటము చిత్రించిరి. ఇందులో ఏమి ఎచ్చటనున్నదో కనుగొనుడని సవాలుకాబోలును.

**ఇద్దెయుంపడి (ఇదియును చదువు)** : శ్రీ రాజగోపాలాచార్లవారి మూడవపుస్తకము. దీని వ్రాయుటలోను సంతానంగారు భాగస్థులు. పేజీలు 38. వెల యివ్వలేదు.

ఇది మూడవపుస్తకము. వ్యవసాయానికి నాగలియెద్దుతో నడిచే రైతుచేత సూర్యనమస్కారము చేయించడముతో ఆరంభము. కాళ్లవిడుమర ప్రొద్దుకుఇంటికిపోయి నిద్దురించి సాయంకాలము పనికిరమ్మని ప్రబోధము. క్షామచిహ్నములు. పూజలు, భజనలు, పెద్దవర్షము, రైతుకష్టాలు త్రాగుడుకథ ఇతరకథలు—పేరాసఫలము వగైరావివిధములు — సేలంజిల్లాకు కావేరిప్రాంతాలకు భేదాలు - రైతురుణవిమోచన శాసనఫలము - దంపుడుబియ్యపు ప్రయోజనము - బీదవానిపెండ్లి - పాలఆహారము - వ్యవసాయవృత్తియే యుత్తమము - భయమేదయ్యాము - మాయమంత్రములు మనల చెరుచును - రైతు కోర్టుకెక్కరాదు - మధుపాననిరోధము - రాట్నమున్నయింట గుడ్డకరువులేదు - తల్లి నాడుప్రయాణము - రైతు అన్నిపనులెరుంగవలెను - ఇద్దరుభార్యల మగడు - పరమేశ్వరుడే పరమరక్షకుడు - మహనీయులుకుతరువాత మరీ వయోజనవిద్య మొదలగు విషయములు ఎక్కువ కథారూపముగా బోధించినారు. తుదకు మద్రాసురాష్ట్రము జిల్లావారిగా విస్తీర్ణము, జనసంఖ్య యిచ్చినారు.

ఇన్నివిషయాలు వ్రాసినా శీర్షికలులేవు. తొలినుడిలేదు. విషయసూచికలేదు. అకారాదిలేదు.

విషయముమాత్రము లలితముగా సుబోధకముగా అందిచ్చినారు. గా. హ.

## తెలుగు

**ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర** : సంపాదకులు దిగవల్లి వేంకటశివరావుగారు, బి. ఏ., బి. ఎల్. బెజవాడ, మూడవముద్రణము.

డెమ్మీసైజు 510 పుటలు, గ్లేజుకాగితము వెల 2—0—0.

ఈ యాత్రాచరిత్ర వివిధవిధములుగా విజ్ఞానవీచికలను వెదజల్లుచున్నదనుట సత్యదూరముకాదు. వినయ వినమితమైన నామము సూచించునట్లుగా ఇందు కేవల యాత్రాచరిత్రమాత్రమే చిత్రింపబడలేదు. ఇందు ఆకాలపు కుంపినీపరిపాలన విధానము, ప్రజలపరిస్థితులు, అప్పటి సంస్థానాధీశుల "క్షణ క్షణ గండములు", మతచర్చలు, రాజకీయవ్యవహారములు, తీర్థక్షేత్రముల విశేషములు, తీర్థయాత్రల యాదర్శములు—ప్రయోజనములు మొదలగు విషయబాహుళ్యము పఠకులకు లోకజ్ఞానప్రదానముచేయుచు క్రిక్కిరిసియున్నది.

గ్రంథకర్తయొక్క సనాతన మతప్రవిష్టిత, అఖండపాండితీగరిమ, సమదర్శనత్వము, సమరసభావము, గ్రంథమునందు చక్కగా ప్రస్ఫుటములై నేటి అనవసరపుతగాదాలకు చక్కని సమన్వయముకూర్పజాలియున్నవి. అందందు చర్చింపబడిన సూర్యసిద్ధాంత— అహఃప్రమాణ— గ్రహశాస్త్ర విశేషములు జ్యోతిషపండితుల కృతజ్ఞతకు పాత్రములు కాజాలియున్నవి. పరిస్థావవశ

మున జర్చింపబడిన హిందుమత - మహమ్మదీయమత - క్రీస్తుమత - సిద్ధాంతరహస్యములు మతాభిమానులకు విజ్ఞానభిక్షను పెట్టజాలియున్నవి.

అప్పటి మనదేశపరిస్థితులు, ఇంగ్లీషువారి రాజ్యతంత్రచాతుర్యము, భారతీయుల సాంఘికవ్యవస్థల జారుబాటులు, మద్రాసు కలకత్తా మొదలగు నూత్నపట్టణముల నిర్మాణవిధానము చారిత్రికులకు అమోఘోపకారములై యున్నవనుట అతిశయోక్తి కాదు. దాక్షిణాత్యులకు ఔత్తరాహులకును ఆచారవ్యవహారములయందు చూపబడిన భేదములు తత్కారణములు నేటి పరిశోధకులనుకూడ సంతోషపెట్టజాలియున్నవి.

విశేషించి గ్రంథకర్త ఆంధ్రుడగుట మన యదృష్టము. త్యాగియు, భోగియు, తత్త్వవేత్తయు, ఆదర్శజీవియు అగు నీ యాంధ్రమహనీయునిచే ఆంధ్రగౌరవము మిక్కిలియు ప్రకాశమానమైన దని చెప్పవచ్చును. ఇట్టి ఉద్గ్రంథము ఆంధ్రుల ఆదరాభిమానములకు పాత్రమగుననుటలో సందియ ముండదు.

ప్రతాప రామకోటయ్య

**త్రిలింగరజతోత్సవ సంచిక :** శ్రీయుతులు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి సంపాదకత్వమున నడచుచున్న త్రిలింగపత్రికకు 1941 సంవత్సరమున జరిగిన రజతోత్సవసందర్భమున ప్రచురింపబడిన ప్రత్యేకసంచిక. పెద్దసైజున 62 పుటలుగలవు. ఇందు ఆ యుత్సవసందర్భమున శ్రీ శాస్త్రిగారికి సమర్పించిన ప్రశంసలు, ఆ సభాధ్యక్షులగు శ్రీయుత నృసింహచింతామణి కేల్కారు బి. ఏ. యల్. యల్. బి. గారి యుపన్యాసము, శ్రీ శాస్త్రిగారి ప్రత్యుత్తరము ప్రధానస్థాన మాక్రమించుకొన్నవి. శ్రీ విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు శ్లేషలోని చమత్కారమును సామాన్య వ్యవహారములనుండి చాలచక్కగ ప్రదర్శించినారు. శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి 'నవీనయుగపురుషులు' అను వ్యాసము పఠనీయము. శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారి 'కాకతీయులనాటి యాంధ్రవాణి' భాషాభిలాషులకు విందులు చేయగలదు.

**త్రిభాషాబోధిని :** శ్రీయుత పండితకర్ణ వీరనాగేశ్వరరావుగారి కృతము

క్రౌను (ప్రథమభాగము) 78 పుటలు వెల ౦–౮–౦.

మొదట సంస్కృతపదమును, దానికిసరియగు హిందీ, తెనుగుపదములను వ్రాయబడినవి. కొన్నివాక్యములుకూడ నీయబడినవి. కాని యీ పద్ధతివలన నేభాషయేని నేర్చుకొననగునా ? యని సందియము. సంస్కృతాభ్యసనమునకు శ్రీ కాశీకృష్ణాచార్యులవారు చూపినపద్ధతి ప్రశంసనీయము. హిందీభాషాభ్యసనమునకు హిందీప్రచారక సంఘమువారి 'స్వబోధినీ' పద్ధతి ఆదరణీయము. ఈపుస్తకమువలన కొన్నిమాటలును, కొన్నివాక్యములును అవశ్యము నేర్చుకొనవచ్చును. కొన్ని శబ్దముల విభక్తిరూపములును, ఒకటి రెండు ధాతురూపములును, ఒంట్లును ఈయబడినవి.

**మాంసభక్షణ పాపమా? :** కర్త—శ్రీయుత తుమ్మల గోపాలకృష్ణయ్యగారు

క్రౌను 85 పుటలు వెల 0–4–0

వేదస్మృతి పురాణములయందు పాపకారణమున మాంసము నిషిద్ధము కాకుండుటయకాక మాంసభక్షణమును పూర్వాచార్యు లాదరించినారని గ్రంథకర్త నిరూపించినాడు. ఆ యభ్యాసమే విశేష సమయములందు మాంసప్రాధాన్యమునకు అవకాశ మిచ్చుచున్నది. స్మృత్యాదులలో మాంసభక్షణను నిషేధించుచు, పాపహేతువును జూపుచు, అహింసాప్రాశస్త్యమును వర్ణించు శ్లోకములు బౌద్ధమతవ్యాప్తికి బిమ్మట చేర్చబడిన ప్రక్షిప్తములని కర్తతలంపు. అగ్ని, ఇంద్రుడు మొదలగు

వారు మాంసమును భుజించినట్లు వేదములలో నున్నదని గ్రంథకర్త యుదాహరించినాడు. వేదములలో ఇంద్రాది భిన్నభిన్న దేవతలు చెప్పబడలేదనియు, అదియంతయు ప్రకృతివిశేషములను సూర్య, గ్రహాదులను వర్ణించిన ఆలంకారిక భాషయనియు దయానందస్వామి మొదలగువారి యభిప్రాయము. వైదికవిషయములను వెల్లడించుటకు మనప్రాంతమునందలి యార్యసామాజికుల కీగ్రంథము చక్కగ పురికొల్పుచున్నది.

"భారతకాలమున నిట్టి పరిషత్తులు మూడు జరిగియున్నవి. ఒకపరిషత్తులో మాంసభక్షణము పాపహేతువని శాసింపబడినది..............ప్రజాభిప్రాయము మాత్రము పాపహేతువని తోపింపజేయుచుండెను" అని కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు పీఠికలో వ్రాసియున్నారు. మహాభారతము బుద్ధునికాలమున కీవల రచింపబడినదా ? విమర్శకులు తమ విమర్శకులను ప్రసరింపజేయుటకు ఇది మంచిరంగము. గ్రంథకర్త చాల పరిశ్రమచేసి వేదములు, స్మృతులు, పురాణములు మొదలగువానినుండి యీ విషయములను సమకూర్చియున్నాడు. మాంసభక్షణచరిత్రను దెలుపుటయే గ్రంథకర్త యుద్దేశముగాని, దానిని ప్రచారములోనికి తేవలయునని కాదు. గ్రంథకర్త పరిశ్రమ ప్రశంసింపదగినది.

**శ్రీ గాంధిమహాత్ముని సత్యాన్వేషణప్రబోధములు:**— 58 + 14 పుటలు. చక్కని సైజు. మంచి అచ్చు. జొన్నలగడ్డ (నరసరావుపేట తాలూకా) నిర్మాణకార్యక్రమ కేంద్రమువారిచే ప్రకటితము. మూల్యము తెలియదు.

గాంధిమహాత్ముని బోధనములు అమృతరూపములు. అవి స్థిరముగనుండి ప్రతిమనుష్యుడును సంతతము నుపాసింపదగినవి. అవి పత్రికామూలమున బయలువెడలినను పుస్తకరూపమున స్థిరత్వ మొందదగినవి. ఇదియొక మహాకార్యము. అందొక కొంతభాగమును ఈకేంద్రమువారు పూనుట ప్రశంసార్హము.

వర్ణాశ్రమధర్మములు అను వ్యాసమును, కొందఱు పృచ్ఛకులకు సమాధానములును, అహింసాసిద్ధాంతమునందలి సూక్ష్మధర్మములును, స్త్రీధర్మములు మొదలగు మహాత్మునివ్యాసములును, ఆయన ఉపాసనాపద్ధతి, భగవత్ప్రార్థన, కర్మసిద్ధాంతము, ప్రతిమపూజ మొదలగు విషయములను గూర్చిన సంభాషణములును, (ఉపదేశములును) హరిజనపత్రికలనుండి యేర్చి కూర్చిన రాట్నసందేశము మొదలగు వ్యాససంగ్రహములును గల పుస్తకము. మహాత్ముని అభిప్రాయములు జగద్విదితములు. ఈపుస్తకము ఎల్లరచేత నుండదగినది. ఈకేంద్రమువారిట్టి గ్రంథములు ప్రకటించి దేశసేవ చేయుదురుగాక !

**కరుణకుమారకథలు:**— (మొదటిసంపుటము) క్రౌను 196 పుటలు. చక్కని కాగితము, చక్కని ముద్రణము. కర్త:—'కరుణకుమారుడు', ప్రచురణము ఆధునిక వాఙ్మయ కుటీరము.

ఇందు 'ఆకలిమంటలు' 'కొత్తచెప్పులు' మొదలగు కథలు కూర్పబడియున్నవి. ఇవి భారతి మొదలగు పత్రికలయందు ఒకతడవ ప్రకటితమయి పాఠకలోకమునకు పరిచయమైనవే. తిరిగి పుస్తకరూపమున ప్రకటితమయినవి. కథలలో భావనాబలముగాని, కల్పనాచాతుర్యముగాని కానరాదు. కాని యదార్థస్థితి కన్నులకు కట్టినట్లు చక్కగ చిత్రింపబడియున్నది. మనము సామాన్యముగ చూచుఘట్టములే యిందు మనోహరముగ తీర్చి దిద్దబడినవి. కథలు చదువదగినవి. కర్త ముందుముందు మంచి కథకులలో చేరగలడు.

**వల్లీయులు:**— కర్త: శరశ్చంద్రబాబు; అనువాదకర్త: శ్రీ చక్రపాణి.
క్రౌను 178 పుటలు; అచ్చుమంచిది; కాగితము సాదా. వెల రు 0-8-0

సామాన్యముగ పల్లెటూళ్ళలో నివసించు స్త్రీల-పురుషుల-స్వభావములు, వారి ఆలోచనములు, ఆవేశములు, పట్టుదలలు మొదలగునవి యిందు మనోహరముగ వర్ణింపబడినవి. కథాకల్పన మద్భుతము. కథారచనలో శరశ్చంద్రుడు అందెవేసినవాడు. అనువాదము ప్రశస్తము. మూల భాషలోని భావములకేమాత్రము లోటులేక, చక్కని జాతీయముతో—స్వతంత్రగ్రంథమువలె కాన బడుచున్నది. వంగభాషయందలి మనోహరకావ్యములను ఆంధ్రీకరింప 'చక్రపాణి' సమర్థుడు. ఆయన ఆసామర్థ్యము, దేశ భాషాసేవా వ్యసనముగలదియే యగుట ప్రశంస్యము.

**గ్రంథాలయోద్యమము:** కర్త— శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్., దేశోద్ధారక గ్రంథమాల 11 వ ప్రచురణము. క్రౌను 64 పుటలు. తెలికకాగితము. వెల రు 0-6-0

ఇందు యూరపు భరతఖండములయందలి ప్రాచీనగ్రంథాలయములు, మొగలాయిచక్రవర్తుల గ్రంథాలయములు, బరోడాగ్రంథాలయము, మహమ్మదీయరాజులు, ఫిరోజిషానాగర్ కోట, కాశ్మీరదేశము, ఆంధ్రదేశము, గ్రంథాలయోద్యమము—గ్రంథాలయస్థితులను సోదాహరణముగ నిరూపించుచు నిజాంరాష్ట్రాంధ్రులను హెచ్చరించుచు వర్ణింపబడినది. గ్రంథకర్త ఆయాసభలలో నధ్యక్షపీఠములనుండి యొసగిన యుపన్యాసములు మూడు ఇందు చివర చేర్చబడినవి. సామాన్యముగ తెలియరాని గ్రంథాలయములకు సంబంధించిన చరిత్రాంశములు కొన్ని యిందు చక్కగ వివరింప బడినవి. ఇందువర్ణింపబడిన ఖుదాబక్షు అను మహనీయుడు గ్రంథాలయాభిమానులకు ఇలువేల్పుగా నుండదగినవాడు.

ఈగ్రంథకర్త ఎవరికో విడిచిపెట్టిన ఎమర్సన్ గారి గ్రంథాలు అనువ్యాసమును తామే తర్జుమాచేసి వ్యాఖ్యానమునుచేర్చి తెనుగులో ప్రకటించి తెనుగువారికి మహోపకారము చేయుదురుగాక.

**వ. వేంకటరత్నము**

**స్వతంత్రం:** కర్త— విద్వాన్ విశ్వం, ప్రకాశకులు: నవ్యసాహిత్యమాల, అనంతపురం,
క్రౌను పేజీలు 50; వెల రు 0—4—0

ఇందులో శ్రీ విద్వాన్ విశ్వం, భారతదేశం సామ్రాజ్యతత్త్వంక్రింద ఎట్లా నలిగిపోతున్నదో అంకెలద్వారా నిరూపింపజూచినారు. 'అస్తీనాస్తీ' అని ఒకఖండము. అందులో మనజాతి ఆదాయము మనిషికి దినానికి 0-2-0 లు, ఇంగ్లీషుమనిషికి 2-3-0 అని తేల్చి ఇది మనతిండీ తీర్థాల కయినా చాలడం లేదని చూపినారు. ఇందులో ఇండియానుంచి ఇంగ్లండుకు వెళ్ళిపోయేసొమ్ము ఇండియాలో అధికారులజీతాల దుబారా వగైరాలు వివరించినారు. 'సేద్యము-వాద్యము' అనే శీర్షికక్రింద మన వ్యవసాయదారునికి ఉండే భూమికొరవ, ఉత్పత్తికొరవ, ప్రభుత్వములు సేద్యానికి సహాయముచేసే విషయములో తేడాలు, రైతుకుటుంబములో తలకు ఆదాయము 11-12-0 అయితే రు 38 లు అప్పు ఉండడము- ఈస్థితికి కారణాలు విమర్శించినారు. 'చదువు సంధ్యలో' మన నిరక్షరాస్యతను చర్చించినారు. 'ఆరోగ్యమూ-ఆహారము'లో శిశుమరణాలు, ఆవరేజిఆయుర్దాయం, మరణపురేటు, మందుల ఏర్పాటులలోట్లు, ఆహారపదార్థాలలోటు వగైరా అనేకసంగతులు తర్కించినారు. 'జమా—ఖర్చూ' అనే ఖండమున కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలబడ్జెట్టులు పరీక్షించి పన్నులబరువు బీదలమీద పడడము, సైన్యపుఖర్చు అమితముకావడము, మనసైన్యము సామ్రాజ్య యుద్ధాల కుపయోగపడడం, దేశీయఋణం- అది పెరుగుటకు కారణాలు వివరించినారు. 'స్వతంత్రం' అనే శీర్షికక్రింద అనేకరాజకీయ సాంఘికమతాలవారి నిర్వచనాలు చేర్చి కూర్చినారు.

